

# కమ్యూనిజం

అక్టోబరు 1985

* కమ్యూనిస్టు పార్టీ చరిత్రపై వక్రీకరణలు

[బిపిన్ చంద్రకు సమాధానం]

* కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక : పూర్వాపరాలు

* విప్లవాభిమాని విక్టర్‌హ్యూగో

* వై.వి. కృష్ణారావు స్మృతులు

KRSA101M140

కారుసాల

శేనివాసులు

# వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ

అరబిక్, బెంగాలీ, బల్గేరియా, జక్, డానిష్, ఇంగ్లీష్, ఫినిష్, ఫ్రెంచి, జర్మన్, గ్రీకు, గుజరాత్, హిబ్రూ, హిందీ, హంగేరియన్, ఇండోనీషియన్, ఇటాలియన్, జపనీస్, మళయాళం, మంగోలియన్, నార్వేజియన్, ఒరియా, పర్షియన్, పోలిష్, పోర్చుగీసు, పంజాబ్, రుమేనియన్, రష్యన్, సింగళీష్, స్పానిష్, స్వీడిష్, టాగాలోగ్, తమిళం, టర్కిష్, వియత్నామీస్ భాషలలో కూడ వెలువడుతున్నది.

విడి ప్రతి —రూ. 1–50 పై.
సంవత్సర చందా —రూ. 15/-

---

# కమ్యూనిజం

*సంపాదకవర్గం :*

వై. విజయకుమార్
తమ్మారెడ్డి సత్యనారాయణ
ఈడ్పుగంటి నాగేశ్వరరావు

COMMUNISM (Telugu Monthly)

Volume : II | OCTOBER 1985 | No. 6

*Contents :*

# కమ్యూనిజం

సంపుటి : 11 ★ అక్టోబరు 1985 ★ సంచిక : 6

ఈ సంచికలో....

ఇంటర్వ్యూ

# దక్షిణాఫ్రికాలో నింగి కెగసిన పోరాట జ్వాలలు

— జోస్లోవా

(దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ నాయకులు)

ప్రశ్న: దక్షిణాఫ్రికాలో సాగుతున్న పోరాట విజృంభణను ప్రపంచం గమనిస్తున్నది. ఆఫ్రికా ప్రజల సాహసోపేత కార్యాచరణను ప్రపంచ మానవాళి సమర్థిస్తున్నది జాత హంకార ప్రభుత్వ టెర్రరిస్టు విధానాన్ని అభ్యుదయ ప్రపంచం ఖండిస్తుంది. ప్రస్తుత వుద్యమం యొక్క స్వభావం గురించి దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ అంచనా ఏమిటి ? వర్ణ వివక్షపట్ల వ్యక్తమౌతున్న నిరసన వుద్యమం వెనుకవున్న శక్తులు ఏమిటి ? సాగుతున్న పోరాటం యొక్క తక్షణ అవకాశాలేమిటి ?

జవాబు : దక్షిణాఫ్రికాలో పోరాటం నూతన దశలో ప్రవేశించినది. ఇది విప్లవోద్యమం అనేది స్పష్టం. ఈ చారిత్రక వుద్వేగభరితమైన వుద్యమాన్ని సమర్థవంతంగా నడపగలిగితే ప్రజాధికారం కైవసమయ్యే అవకాశం దగ్గరలోనే వుంది.

మేము అట్టి నిర్ధారణకు రావడానికిగల కారణాలు ఇలా వున్నాయి. మౌలిక సామాజిక పరివర్తనకు మూడు ప్రాతిపదికలు వుండాలి.

(1) పాలకవర్గంలో పెద్ద సంక్షోభం;

(2) మార్పు కొరకు అవసరమైన త్యాగనిరతికి ప్రజలు సంసిద్ధంగా వుండడం. ఆ విధంగా వారిలో కదలిక వ్యక్తంగావడం;

(3) ప్రజామోదం పొందిన విప్లవ వుద్యమానికి కావలసిన బలము, నాయకత్వ దక్షతా వుండడం. ఈ కారణాలు విజయానికి తోడ్పడినాయి.

దక్షిణాఫ్రికాలో నేడున్న పరిస్థితి ఏమిటి ?

ఈ మూడు ప్రాతిపదికలూ ఇంకా పూర్తిగా పరిపక్వం చెందలేదు. కాని మూడు మొదటిసారిగా ఏకమౌతున్నాయి. ప్రభుత్వం తీవ్ర ఆర్థిక రాజకీయ సంక్షోభం ఎదుర్కొంటున్నది – పాలకవర్గం చీలిపోయింది. గతంలో ఎన్నటి కన్నా అది సంఘర్షణ వాతావరణంలో కూరుకుపోయి వుంది. మరోవైపు ప్రజలలో వేడి రాజుకుంటున్నది. దాదాపు వెయ్యిమంది కాల్పులలో సంఘర్షణలలో చని పోయినప్పటికి కార్మికులు యువకులలో పోరాట పటిమ ఎక్కువగుతున్నది. మృత్యువంటే వారికి పీసమెత్తు భయంలేదు. ఆఫ్రికా జాతీయ కాంగ్రెసు నాయకత్వానగల విముక్తి సంఘటనకు ఎనలేని ప్రజాదరణ నేడున్నది. నిరసన వుద్యమానికి అది నాయకత్వం వహిస్తున్నది.

కొత్త అంశం ఏమంటే ప్రజలు తమంతట తాముగానే అనేక పోరాట రూపాలు సృష్టించుకొన్నారు. ఉదా:– యువకులు తమ చొరవతోనే చిన్న పోరాటలుగా ఏర్పడి పోలీసులను ఎదుర్కొంటున్నారు. నల్లజాతి ప్రజలలో అవకాశవాద దళాలపై పెద్ద ఒత్తిడి తెస్తున్నారు నల్లజాతి పోలీసులు వారి ప్రజల మధ్య నేడు జీవించటంలేదు. ప్రభుత్వ ప్రకటనను అనుసరించి నల్లజాతి పోలీసుల గృహాలు వందల సంఖ్యలో భస్మీపటలమైనాయి.

యునైటెడ్ డెమోక్రటిక్ ఫ్రంట్ చట్టబద్ధ సంస్థగా పని చేస్తున్నది. అదే విధంగా ట్రేడ్ యూనియన్ వుద్యమం బలం రోజు రోజుకీ పెరుగుతున్నది. పట్టణ మురికివాడలలో ప్రభుత్వ పౌరపాలన స్తంభించిపోయింది. గవర్నమెంటు సమితుల స్థానంలో ప్రజలు ఏర్పరచుకొన్న సంస్థలు తలెత్తుతున్నాయి. ఇవి ప్రజాధికార సంస్థలుగా మారే అవకాశాలు వున్నాయి. ప్రభుత్వంవద్ద సైనిక బలం వుండవచ్చుకానీ పౌర పాలన సాగించే సామర్థ్యాన్ని పూర్తిగా కోల్పోయింది.

వర్గపోరాట తీవ్రతను నిర్దేశించే మరో ప్రధాన కారణం దక్షిణాఫ్రికా కార్మికుల కార్యకలాపాలు గత రెండు సంవత్సరాలలో నల్లజాతి వారి ట్రేడ్ యూనియను బాగా పెరిగాయి. తెల్లజాతివారి ట్రేడ్ యూనియన్‌లను అవి మించిపోయాయి. కేవలం వారి పోరాటం ఆర్థిక సంస్కరణలకు పరిమితమై లేదు. వర్ణ వివక్షతా చట్టానికి వ్యతిరేకంగా పెట్టుబడిదారీ దోపిడీ విధానానికి వ్యతిరేకంగా నల్లజాతివారి ట్రేడ్ యూనియన్ వుద్యమం ముందుకు సాగుతున్నది. జాతీయ విముక్తిపోరాటంలో ఒక ముఖ్య అంశంగా ట్రేడ్‌యూనియన్ వుద్యమం నేడు రూపొందింది. 1984 నవంబరులో ట్రాన్సువాల్‌లో రాజకీయ సాధారణ సమ్మె జరిగింది. రెండు రోజులపాటు దేశంలో పరిశ్రమలు స్తంభించిపోయాయి. తూర్పు

ప్రాంతంలో కూడా అనేక రాజకీయ సమ్మె పోరాటాలు జరిగాయి. కార్మికవర్గం నానాటికీ బలం పుంజుకొంటున్నది. దాని కార్యకలాపాలు వేగంగా పెరుగుతున్నాయి. విప్లవశక్తుల పెంపుదలపై దాని ప్రభావం గణనీయంగా వుంది.

ప్రశ్న: ప్రజల విప్లవ చైతన్యాన్ని పెంపొందించడంలో కమ్యూనిస్టుల పాత్ర ఏమిటి ? ఎటువంటి పోరాట రూపాలను వారు రూపొందిస్తున్నారు?

జవాబు : ఆఫ్రికా జాతీయ కాంగ్రెసు నాయకత్వానగల విముక్తి సంఘటనలో దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ భాగంగా వుంది. జాతీయ ప్రజాస్వామిక విప్లవ లక్ష్యాలను సాధించే వేదికగా ఈ సంఘటన పని చేస్తున్నది. దీనిలో అనేక వర్గాలు వున్నాయి. ఇది విశాల దేశభక్తియుత శక్తుల కలయికగా యున్నది. ఈ పొత్తులో కార్మికవర్గం ముఖ్యపాత్ర నిర్వహిస్తున్నది.

1985 జూలై నాటికి కమ్యూనిస్టుపార్టీకి 64 సంవత్సరాలు నిండినాయి. అనేక పోరాట అనుభవాలు కలిగిన పార్టీగా అది వుంది. ఫాసిస్టు వ్యతిరేక ఐక్య సంఘటనలో ఒక భాగంగాను కార్మికవర్గ అగ్రగామి దళంగాను అది దాని కర్తవ్యాన్ని పరిపూర్తి చేస్తున్నది. విశాల ఐక్య సంఘటనలో అది భాగస్వామిగానూ అదే సమయంలో స్వతంత్ర పాత్రను నిర్వర్తించుచున్నది. మార్క్సిజం, లెనినిజం బోధనలను వ్యాప్తి చేస్తున్నది. కార్మిక శ్రేణులను సమీకరిస్తున్నది, రహస్య పోరాట కేంద్రాలను నిర్వహిస్తున్నది.

కమ్యూనిస్టుపార్టీకి ఆఫ్రికా జాతీయ కాంగ్రెసుకు మధ్యగల స్నేహ బాంధవ్యాలను దెబ్బతియ్యాలని ఇంటా బయటా అభివృద్ధినిరోధక శక్తులు ప్రయత్నించుచున్నాయి. అదే విధంగా ఆఫ్రికా జాతీయ కాంగ్రెసుకు ప్రపంచ సోషలిస్టు శక్తులకు మధ్య స్నేహాన్ని విచ్ఛిన్నం చేయాలని కమ్యూనిస్టు వ్యతిరేకతను, సోవియట్ వ్యతిరేకతనూ రెచ్చగొడుతున్నారు. కానీ అత్యధిక దేశభక్తిపరులు మా మధ్యగల సంబంధాలను మరింత దృఢతరంచేయటం ద్వారా వుద్యమ లక్ష్యాలను చేరుకోగలమని విశ్వసించుచున్నారు.

ప్రశ్న : జాత్యహంకార ప్రభుత్వం అనుసరించుచున్న పాశవిక దమనకాండపట్ల ప్రపంచ ప్రజాభిప్రాయం ఆగ్రహం వ్యక్తమయింది. ఆ కారణంగా వర్ణవివక్ష అంతర్జాతీయంగా మరింత ఏకాకి కాలేదా? సోదర కమ్యూనిస్టు పార్టీల పాత్రను గురించి దక్షిణాఫ్రికా కమ్యూనిస్టుపార్టీ ఎలా భావిస్తున్నది ?

జవాబు ; దక్షిణాఫ్రికా సమస్యపై అమెరికా పాలకవర్గానికి సంబంధించిన కొన్ని విభాగములు వెనక్కు తగ్గవలసివచ్చింది. కానీదక్షిణాఫ్రికాప్రభుత్వ ఫాసిస్టు

చర్యలకు రీగన్ అంశము కూడా బాధ్యత వహించవలసి వచ్చినది. అమెరికా ప్రజలలో ఆగ్రహోద్రేకాలు వ్యక్తమవుతున్నాయి. దక్షిణాఫ్రికా శ్వేతజాతి ప్రభుత్వం శక్తిసామర్ధ్యాలలో అమెరికా సామ్రాజ్యవాదానికి నమ్మకం తగ్గుతున్నది. అంతా కోల్పోతామనే భయం పట్టుకొన్నది. పగుళ్ళు కన్పిస్తున్నాయి.

ప్రపంచ కార్మికోద్యమం సహాయం మాకు వుంది. దానికి మేము కృతజ్ఞులము. పశ్చిమ దేశాల ప్రభుత్వంపై వారు మరింత వత్తిడి తీసుకొనిరావాలి. వర్ణ వివక్ష ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆంక్షలు విధించే విధంగా చూడాలి. వర్ణ వివక్ష ఆధునిక ఫాసిజం రూపం తీసుకున్నది. దానికి వ్యతిరేకంగా వర్గ చట్టాన్ని అధిగమించి పోరాడాలి.

ప్రపంచ శాంతి పరిరక్షణకు మేము పోరాడుతున్నాము. అణుయుద్ధ విపత్తు వల్ల మా పోరాటం వృధా అవుతుందని మాకు తెలుసు. కనుకనే ప్రపంచ శాంతి కొరకు మేము నిలబడ్డాము.

నక్షత్రయుద్ధ కార్యక్రమాన్ని వ్యతిరేకిస్తున్నాము.

విముక్తి కొరకు సాగే పోరాటాన్ని ప్రపంచ శాంతి పోరాటంతో ఐక్య పరుస్తున్నాము. అవి విడదీయరానివి. శాంతి పరిరక్షణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కొరకు పోరాటం, సోషలిజం సాధన మా ఆశయాలుగా వున్నాయి'

# యువతనం ఆకర్షించేది ఎలా?

ఫ్రిట్జ్ ఎరిక్సెన్ (డెన్మార్క్ ఎంగ్ కమ్యూనిస్టు లీగ్ నాయకులు)

ఏ సమాజం లోనయినా వివిధ రాజకీయ శక్తుల దృష్టి ఎల్లప్పుడూ యువకులపై లగ్నమై వుంటుంది. కారణం వారిపై భవిష్యత్తు ఆధారపడివుంది. యువకులు యుక్తవయస్సులో ప్రవేశించిన తరువాత ఏదో ఒక వృత్తిని చేపట్టుతారు. వర్గపోరాట విస్తృతి వారిపై ఆధారపడి వుంటుంది. కనుకనే యువకులలో పనిచేయటం కమ్యూనిస్టులకు ఒక ప్రధాన కర్తవ్యంగా వుంది.

బూర్జువా ప్రపంచాన్ని పాలించే పెద్దమనుషులు అనైక్యతను. వ్యక్తివాదాన్ని, నిష్క్రియాతత్వాన్ని యువకుల్లో ప్రోత్సహించుతారు. ముఖ్యంగా సంక్షోభకాలంలో ఈ సమస్యలను కేవలం వ్యక్తిగత సమస్యలుగా వారు చూపెడతారు. సామాజిక సమస్యలుగా చూడరు. సమాజంలో, స్థానానికి పనికి ప్రజలమధ్య పోటీ వుంది, దీన్ని ఆధారంగా వారు కొన్ని నినాదాలు ఇస్తున్నారు. "ప్రతి మనిషి

తన భవిష్యత్తును తానే కర్త", "సంకల్పం ఎక్కడ వుందో మార్గం అక్కడ వుంది" ఇటువంటి నినాదాలు యువకుల మనసులను వశీకరింప చేసాయి.

ఇటువంటి నినాదాలు లేదా చిత్రీకరణ యువత విశ్వాసాన్ని దెబ్బతీస్తాయి. కన్సర్వేటివ్ ప్రభావానికి వారు లొంగిపోవచ్చు లేదా ఆధునిక ఫ్యాషన్లలో మునిగి పోవచ్చు, లేదా మాదక ద్రవ్యాలకు లోనుకావచ్చు. కొంతమంది సమాజానికి దూరంగా వారి ప్రపంచంలో వారు బ్రతకవచ్చు ఇవి అన్నీ ప్రతికూల ధోరణులు కాని జీవితంలో అవకాశాలు కొరవడటాన్ని యువకులు అధికారకంగా నిరసిసున్నారు. వారు మార్పును కోరుతున్నారు. మనం చేయవలసిన కర్తవ్యాలు ఇక్కడే వున్నాయి.

డెన్మార్కు యువకులలో కొంతమంది ఏకాకులుగా జీవించేందుకు ప్రయత్నిస్తున్నారు. చుట్టూరవున్న పరిస్థితులపట్ల ప్రతికూల వైఖరిని తీసుకొంటున్నారు. వీరు దేనికి నిరసన తెలుపుతున్నారో వారికి తెలియదు. ఐక్యత సమిష్టి కార్యాచరణ సంఘీభావము ద్వారా సాధించిన కార్మికవర్గ విజయాలు వీరికి తెలియవు. అటివారిలో యువ కమ్యూనిస్టులు నేడు పనిచేస్తున్నారు, పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా సాగే పోరాటంలోకి వారిని ఆహ్వానిస్తున్నారు. ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలలోనికి వారిని ఆకర్షించేందుకు ప్రత్యేక ప్రాధాన్యత నిస్తున్నారు. శ్రమజీవిని గౌరవించటాన్ని వారు బోధిస్తున్నారు. కార్మికవర్గ విప్లవ అనుభవాన్ని వారు గ్రహించటానికి ఇది ముఖ్యమైనది.

డానిష్ యువకులలో యువ కమ్యూనిస్టులీగు, కమ్యూనిస్టు విద్యార్థి యూనియన్ పనిచేస్తున్నాయి. లీగ్ ముఖ్యకర్తవ్యం యువకులను కార్మికవర్గం వైపు ఆకర్షించడం, వారిని చైతన్యయుత పోరాట యువకులుగా తీర్చిదిద్దటం ఈ కర్తవ్యం దృష్ట్యా యువకులకు ఉద్యోగం, విద్య అవకాశాలు కల్పించటంపై కమ్యూనిస్టు లీగ్ కేంద్రీకరించి పని చేస్తున్నది. శాంతి పరిరక్షణకు పోరాడుతున్నది. ప్రస్తుత ఐ.రా.స. యువజన అంతర్జాతీయ సంవత్సరములో దాని లక్ష్యాలు మార్గదర్శకంగా మేము పనిచేస్తున్నాము.

ఇతర దేశాలవలే మా దేశం కూడా పెట్టుబడిదారీ సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది. దాని దుష్ఫలితాలను ముఖ్యంగా యువకులు అనుభవిస్తున్నారు. ముఖ్యంగా నిరుద్యోగ సమస్య వారిని వెంటాడుతూ వుంది. జనాభాలో 11 శాతం మంది నిరుద్యోగులుగా వున్నారు. యుక్త వయస్సులో వున్నవారిలో 33 శాతం నిరుద్యోగంలో వున్నారు వీరికి నిరుద్యోగ భృతికూడా లేదు. భవిష్యత్తులో కూడా పూర్తి ఉద్యోగం వుండే ఆశలు అడుగంటి పోతున్నాయి, విశ్వవిద్యాలయాల డిగ్రీలు ఎందుకూ పనికిరావడంలేదు. దీని కారణంగా ఉన్నత విద్యపట్ల వితానక్తత పెరుగుతుంది.

అప్రెంటీసులకు కూడా పరిస్థితి ప్రోత్సాహకరంగా లేదు. వారు కూడా నిరుద్యోగ సైన్యంలోకి నెటబడుతున్నారు విద్యఖర్చుకోసం బ్యాంకులనుండి తీసుకొన్న రుణాలు యువకులకు మోయలేని భారంగా తయారైంది. దీని కారణంగా పై చదువులకు వెళ్ళలేకపోతున్నారు.

బూర్జువా ప్రభుత్వ ఆర్థిక విధానాలు సంక్షోభాన్ని మరింత తీవ్రం చేస్తున్నది. ప్రభుత్వం పొదుపు విధానాన్ని అవలంబించటంలో యువకులకు వున్న కొద్దిపాటి అవకాశాలు కూడా పోయాయి. ఈ కారణాలన్నింటివల్ల కార్మికుల సమ్మె పోరాటాల్లో యువకార్మికులు కూడా చేరుతున్నారు. ఈ సంవత్సరం మార్చి. ఏప్రియల్ మాసాలలో పక్షంరోజులపాటు 5 లక్షల మంది, సమ్మె పోరాటంద్వారా దేశ ప్రజా జీవితాన్ని స్తంభింపచేశారు.

అంతేకాక యువకులు తమ హక్కుల కోసం వివిధ సంస్థల ద్వారా సమీకృతులు అవుతున్నారు. అయితే డేనిష్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌పై పట్టుదల సంస్కరణవాద నాయకత్వం యొక్క వైఖరి. సమిష్టి కార్యాచరణకు అవరోధంగా వున్నవి. యువకుల సమస్యలపట్ల వారు ప్రతికూల వైఖరిని అవలంబిస్తున్నారు. యువకులలో నైరాశ్యత చోటు చేసుకోకుండా మేము శక్తి కొలది ప్రయత్నిస్తున్నాము.

యువకుల రాజకీయ శిక్షణపై కమ్యూనిస్టు యువజన సంస్థ కేంద్రీకరించి పనిచేస్తున్నది. బూర్జువా ప్రచార సాధనాలు యువకులలో రాజకీయాలపట్ల విముఖత కలిగించేందుకు ప్రయత్నిస్తున్నాయి. సామాన్య జనానికి రాజకీయాలు అర్థం కావని చెపుతున్నాయి. వీటికి తోడుగా పాలక పార్టీలు తమ వాగ్దానాలను తామే ఉల్లంఘించుతూ వుంటాయి. రాజకీయాలపట్ల ద్వేషభావం కలగటానికి కూడా ఇది ఒక కారణం.

బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఒక పెద్ద బలహీనత ఉంది. రాజకీయమే తమ వృత్తి కలిగినవారికి ప్రజలను మోసగించేందుకు అవి తోడ్పడుచున్నవి. అది నిజమైన ప్రజాస్వామ్యము కాదు. బూర్జువా ప్రచారకులు అవిశ్రాంతంగా డెన్మార్కు కమ్యూనిస్టు పార్టీపై చేసే విమర్శలలో ఒకటి. ఆ పార్టీ ఇతర పార్టీలకన్నా నిర్వీర్యంగా తయారయిందని నమ్మింపచేస్తున్నారు. ఇట్టి దుష్ప్రచారాన్ని మేము ఎదుర్కొంటున్నాము.

యువ కమ్యూనిస్టు లీగ్, యువకుల కమ్యూనిస్టుపార్టీ కాదు. దానికి ప్రత్యేక కర్తవ్యాలు ఉన్నాయి. యువకులలో అది పనిచేసే పద్ధతిలో వారికి రాజకీయ శిక్షణ కలిగించటము, వారిని పోరాట యోధులుగా తీర్చిదిద్దటము ప్రత్యేక తరహాకు చెందినవి.

యువకుల ఆదర్శాలను, అవసరాలను సంతృప్తిపరచే సమర్థతపై మన కృషి విజయం ఆధారపడి వుంది. వారి హృదయాలను, మనసులను ఆకట్టుకోవటం ప్రధానమైనది. మనవిధానంలోవున్న ప్రతిఅంశాన్ని వారు అర్థం చేసుకోకపోవచ్చు. కాని మనం వారిని ఆకట్టుకోవాలి. పెట్టుబడిదారీ వ్యవస్థకు సరయిన ప్రత్యామ్నాయం "కమ్యూనిస్టుపార్టీ విధానం మాత్రమేనని నచ్చచెప్పగలగాలి. మన రాజకీయ, ఆర్థిక నినాదాలు స్పష్టంగా, సూటిగా వుండాలి. ఉదాహరణకు "నేటో మిస్సిలీలు మాకు వద్దు" అనేది చాలా ఆకర్షణీయ నినాదం. అలాగే మరొక నినాదం "కోరే వారు అందరికీ అప్రెంటీసు పని ఇవ్వాలి".

ఇటీవల కాలంలో డెన్మార్కులో యువత నిరసన ఉద్యమం పెరుగుతూ ఉన్నది. అన్యాయాలకు వ్యతిరేకంగా వివిధ గ్రూపులు ముందుకు వస్తూ వున్నాయి. ఉదాహరణకు హెచ్చు అద్దెగల ఖాళీ గృహాలను కొంతమంది యువకులు స్వాధీనం చేసుకున్నారు. మరికొంతమంది యువజన గ్రూపులు విలాసవంతమయిన హోటళ్ళలో భోజనం చేసి డబ్బు చెల్లించకుండా నిరసన వ్యక్తం చేస్తున్నారు. ఆ విధంగా ప్రజల దృష్టిని వారు ఆకర్షించేందుకు ప్రయత్నిస్తున్నారు. మరికొంత మంది నిరాహారదీక్షలకు పూనుకొన్నారు. కొన్ని నిరసనలు రాజకీయ రూపాన్ని సంతరించుకొంటున్నాయి.

పశ్చిమ యూరప్‌లో అమెరికా అణ్వస్త్రాలను మోహరించటంతో శాంతి పరిరక్షణ సమస్య ముందుకు వచ్చింది. వేలాదిమంది యువకులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. డేనిష్ పార్లమెంటును చుట్టుముట్టారు. డేనిష్ ప్రభుత్వం వెనక అడుగు వేయవలసి వచ్చింది నేటో లైజాను కమిటీ నుండి డెన్మార్కు ఉపసంహరించుకోవాలి అని వారు ఎలుగెత్తి చాటుతున్నారు. డెన్మార్కు అమెరికా స్థావరం కాగూడదు అని వారు నినదిస్తున్నారు. గత సంవత్సరం యువకుల శాంతి మహాసభ జరిగింది. అది యువకులలో పెద్ద ఉత్సాహాన్ని రేకెత్తించింది. మిసిలీ వ్యతిరేక యుద్ధ వ్యతిరేక పోరాటాలలోనికి వారు అధికంగా వస్తున్నారు.

ఇటీవల యువ కమ్యూనిస్టు లీగ్ లక్ష పోస్టుకార్డులను అణ్వస్త్రాలు వద్దు అనే నినాదంతో నింపి డేనిష్ పార్లమెంటుకు అందజేసింది ఈ ఉద్యమం జయప్రదంగా నిర్వహించిన తరువాత మేము యువకుల్లో రెండవ దశ కార్యక్రమాన్ని ప్రారంభించాము. ఆయుధపోటీకి సామ్రాజ్యవాదం నేరస్తురాలిగా వుంది. అమెరికా నుండి యుద్ధ ప్రమాదం వస్తున్నది; సోషలిజం, శాంతి అవిభాజ్యమయినది. ఈ నినాదాలు యువకులను ఆకర్షించుతున్నాయి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ విలువయిన అనుభవాలపై ఆధారపడి మేము డేనిష్ యువకుల్లో పనిచేస్తున్నాము.



# ఎమెన్ సోషలిస్టుపార్టీ అగ్రగామి దళ పార్టీ

అలీ నాజర్ మహమద్
(ఎమెన్ సోషలిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి; ప్రధానమంత్రి)

మా దేశ సామాజిక జీవితానికి సంబంధించిన వివిధ రంగాలలో ఎమెన్ సోషలిస్టు పార్టీకి గల మార్గదర్శక పాత్ర పెరుగుతున్నది. దేశ అవసరాలనుండి జనించిన సహజ పరిణామం అది. పాదార్థిక, సాంస్కృతిక రంగంలో సాధించిన అభివృద్ధి కారణంగా, నిర్మాణశక్తి, చైతన్యం కూడా పెరుగుతున్నాయి. సోషలిజం పరివర్తనకు యివి ప్రాతిపదికలు.

మా దేశ సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధి కర్తవ్యాలు విస్తృతమైనవి. దానికి తగిన ఉన్నతస్థాయి రాజకీయ నాయకత్వం వుండాలి. పార్టీ నిర్మాణ నాయకత్వంకూడా ఉండాలి. ప్రజల సృజనాత్మక కార్యకలాపాలు పెరుగుతున్నందువలని దేశ పరిపాలనా రంగంలో వారి పాత్ర పెరుగుతున్నందువల్ల కూడా ఇట్టి రాజకీయ నాయకత్వం అవసరమౌతుంది. అదేవిధంగా ఉత్పత్తి మేనేజిమెంటు ప్రజాస్వామ్యాభివృద్ధిలో ప్రజల పాత్ర పెరుగుచున్నది. పరిగణనలోకి తీసుకొనవలసిన మరికొన్ని అంశాలు ఉన్నాయి. శాస్త్రీయ సోషలిస్టు భావాల ప్రచారం కార్మికులకు విప్లవ సిద్ధాంత బోధన ప్రజల ఆలోచనలలో పాత అవశేషాల నుండి బయటపడేందుకు నిరంతర ప్రయత్నం అవసరం వాటి కర్తవ్యాలు కూడా చాలా ముఖ్యమైనవి.

పార్టీ నాయకత్వ పాత్ర నేటి పరిస్థితుల స్వభావం రీత్యా పెరుగుతున్నది. "యమెన్" సోషలిస్టు పార్టీ అరబ్ జాతీయ విముక్తి పోరాటంలో అంతర్భాగంగా వుంది. ప్రపంచ విప్లవోద్యమంలో అది ఒక భాగం. మధ్య ప్రాచ్యంలో సాగుతున్న తీవ్ర పోరాటంలో మా చారిత్రక కర్తవ్యాన్ని గౌరవప్రదంగా మేము నిర్వహిస్తున్నాం. మా పార్టీ విదేశాంగ విధానం మా దేశ జాతియ విధానానికి అనుగుణంగా ఉంది.

జాతీయ ప్రజాస్వామిక విప్లవ ఆశయాల సాధనకు మేము కృషి చేస్తున్నాము. సోషలిస్టుల లక్ష్యంగా మేము పురోగమిస్తున్నాం. ఈ పంథా ననుసరించి సామ్రాజ్యవాద వ్యూహాన్ని, వారి సైనిక జోక్యాన్ని మేము వ్యతిరేకిస్తున్నాము. అరబ్ ప్రజల విప్లవోద్యమంతో సంఘీభావాన్ని ప్రకటిస్తున్నాము. సోషలిస్టు దేశాలతో, ముఖ్యంగా సోవియట్ యూనియన్‌తో సమగ్ర సహకారాన్ని విస్తృత పరచుకొంటున్నాం. అదేవిధంగా అంతర్జాతీయ కార్మికోద్యమంతో జాతీయ విముక్తి పోరాటాలతో శాంతికాముక శక్తులతో సన్నిహిత సంబంధాలు పెంచుకొంటున్నాము. యమెన్ సోషలిస్టుపార్టీ నాయకత్వాన అనుసరిస్తున్న ఈ పంథా కారణంగా ప్రజాస్వామిక యమెన్ ప్రతిష్ట గణనీయంగా పెరిగింది.

ఇటీవల కాలంలో మాకు కొన్ని క్రొత్త సమస్యలు ఎదురయినాయి. శాస్త్రీయ సోషలిజం ప్రాతిపదికగా మా పార్టీ కార్యక్రమం సిద్ధాంత వెలుగులో ఈ సమస్యలను విశ్లేషణ చేశాం. పార్టీ 3 వ మహాసభ సన్నాహాలలో భాగంగా ఇది జరిగింది గత ఫిబ్రవరిలో కేంద్ర కమిటీ డాక్యుమెంటుపై కేంద్ర కమిటీలో ముఖ్యమైన చర్చలు జరిగాయి. రానున్న మహాసభకు సన్నాహంగా సిద్ధాంత-రాజకీయ-నిర్మాణ లక్ష్యాలపై ఈ డాక్యుమెంటు వివరించింది. ఇప్పటివరకూ సాధించిన దానిని వాస్తవికంగా బేరీజు వేసింది. గడించిన అనుభవాలను సాధారణీకరణ చేసింది. పొరపాట్లను ధైర్యంతో వ్యక్తం చేసింది. భవిష్యత్తుకు మార్గాలను నిర్దిష్టంగా పేర్కొంది ఆ విధంగా పార్టీ మహాసభ సన్నాహాలు ఒక సమరశీల రాజకీయ కర్తవ్యంగా అన్ని స్థాయిలలోను భావిస్తున్నారు.

యమెన్ సోషలిస్టుపార్టీ కార్మికవర్గ అగ్రగామిదళం రైతాంగం, విప్లవకర మేధావివర్గం ఇతర శ్రమజీవులతో దానికి పొత్తువున్నది. ప్రజలకు సేవచేయడమే దాని లక్ష్యం. కనుకనే ప్రజల నాయకుడుగా అది వ్యవహరిస్తున్నది. సమాజ పరిణామ లక్ష్యాలను పార్టీ నిర్దేశించినది. రాజకీయ పంథాను రూపొందించింది. అమలుపరిచే పద్ధతులను వివరించింది. దేశ, ఆర్థిక, సామాజిక, రాజకీయ మేధో జీవితానికి అది మార్గదర్శకత్వం వహిస్తున్నది. పరిపాలనా వ్యవస్థను ఐక్యపరుస్తున్నది. రాజ్యాంగ యంత్ర ప్రధాన కర్తవ్యాలను పేర్కొంది వివిధ స్థాయిలలో కార్యకర్తల ఎంపిక, శిక్షణ, నియామకం, అది నిర్వహిస్తున్నది.

పార్టీ రాజకీయపంథా ఎంత వాస్తవమైనప్పటికీ, సరయినదప్పటికీ కార్మిక ప్రజల దగ్గరకు ఆ విధానాన్ని తీసుకువెళ్ళే నిర్మాణం లేకపోతే, దాని అమలుకు వారిని సమీకరించకపోతే అది శుష్కనినాదంగానే వుండిపోతుంది.

ప్రజలతో నిత్యసంబంధాలు వుండాలి; వారి పోరాటాలకు నిత్యం నాయకత్వం వహించాలి; లక్ష్యాలను అమలుపరచే సృజనశీల కృషి వుండాలి.

ప్రజలకు నిరంతర రాజకీయ బోధన, వారిలో నిర్మాణాన్ని పెంపొందించడం ద్వారానే అటి లక్ష్యాలను సాధించగలం. ఈ సందర్భంగా లెనిన్ మాటలు గమనార్హం. "మనం తీసుకురావాలని వాంఛించే మార్పులు, ప్రజలలో ఆసక్తిని కల్గించాలి; అది అవసరమని లక్షలాది ప్రజలకు నచ్చచెప్పాలి."

వివిధ ప్రజాసంఘాలలో, ప్రజలలో పనిచేయటం. రాజకీయ నాయకత్వం యొక్క ముఖ్యాంశాలలో ఒకటి. ఎమెన్ సోషలిస్టుపార్టీ రాజకీయ పంథా, విప్లవ కార్యక్రమం కాలపరీక్షలకు నిలబడినాయి. ప్రజలలో ప్రతిష్ఠను ఆర్జించాయి. కాని దాని నాయకత్వపాత్ర స్థాయి శాశ్వత స్వభావం కల్గిన డిక్రీ లాంటిదికాదు దానిని నిరంతరం కాపాడుకోవాలి; దృఢపరచుకోవాలి. దీని బాధ్యత పార్టీ సభ్యులందరి పైన వుంది. ప్రజల సమస్యలను అర్థంచేసుకోవాలి; వారిపట్ల సరయిన వైఖరిని తీసుకునే సామర్థ్యాన్ని కల్గియుండాలి వారు ఎల్లప్పుడు అగ్రభాగాన నిలబడాలి. ప్రజల చైతన్య స్థాయిని అంచనా వేయాలి; నైతిక వాతావరణం గమనించాలి; పార్టీ సభ్యులు సిద్ధాంత విధేయత కల్గియుండి. గత అవశేషాలపట్ల అసహనాన్ని ప్రదర్శించాలి; ప్రజలకు ఆదర్శప్రాయులై, వారి విశ్వాసాన్ని పొందాలి.

అదేవిధంగా రాజ్యాంగ యంత్రం అంగాలతో, ప్రజా సంస్థలతో, ఆర్థిక మేనేజిమెంట్లతో పార్టీయొక్క సంబంధాలు కూడ ఒక ముఖ్యాంశం. ప్రజలకు నాయకత్వం వహించే ప్రశ్నతో యిది ముడిపడి వుంది. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక తీవ్ర స్వభావంకల్గిన మార్పులకు రాజ్యాంగ యంత్రం ఒక కీలక సాధనమని శాస్త్రీయ సోషలిజం సిద్ధాంతం స్పష్టంచేసింది. విప్లవక్రమం పురోభివృద్ధిలో వర్గశక్తుల పొందిక మారుతుంది. జనతా ప్రజాస్వామ్యంయొక్క వర్గం, సారం కూడ మారుతుంది.

పాలక పార్టీగా ఎమెన్ సోషలిస్టుపార్టీ, ఎమెన్ రాజకీయ వ్యవస్థలో కేంద్ర స్థానం ఆక్రమించింది దేశ జాతీయ, అంతర్జాతీయ విధానాలను అది నిర్వచించు తుంది. ప్రభుత్వ అగ్రస్థానాలను భర్తీచేస్తుంది.

దేశ రాజ్యాంగ యంత్రం, ముఖ్యంగా న్యాయవ్యవస్థ ఏర్పాటు పూర్తయింది శాసనసంస్థలు సమగ్రస్వరూపం తీసుకున్నాయి. కొత్త చట్టాలు రూపొందు తున్నాయి. సామాజిక, ఆర్థిక పురోగతిని పెంపొందించేవిగా అవి వున్నాయి. రాజ్యాంగ చట్టబద్ధతను అవి దృఢతరం చేస్తున్నాయి.

రాజ్యాంగయంత్రం నిర్మాణంలో కొన్ని లోపాలు, బలహీనతలు వ్యక్త మయ్యాయి. ఉదా: అవసరాన్ని మించిన ఉద్యోగబృందం, కమిటీ సభ్యుల అసమగ్ర పరిజ్ఞానం, కాడరు ఎంపికలో లోపాలు, బ్యూరోక్రాటిక్ ధోరణులు,

క్రమశిక్షణస్థాయి తగ్గుదల వగైరా. శక్తి, సామర్థ్యాలకన్నా కుటుంబం, జాతి అభిమానాలపై ఎంపిక జరిగాయి.

పార్టీ నిర్మాణానికి, పరిపాలనా యంత్రాంగానికి మధ్య వుండవలసిన తేడాలు కొన్ని సందర్భాలలో చెరిగిపోయాయి. ప్రభుత్వ యంత్రాంగం స్థానే పార్టీ కమిటీలు వ్యవహరించిన ఉదాహరణలు వున్నాయి. పార్టీ, నాయకత్వపాత్రస్థాకు ప్రభుత్వ యంత్రాంగం వ్యవహరించిన ఘటనలు వున్నాయి. అవి ఘర్షణలనే దారితీశాయి. ఇటువంటి లోపాలను తొలగించుకోవాలి. దీనికిగాను ప్రభుత్వాధికారులకు మేనేజిమెంటులో తగిన సిద్ధాంత శిక్షణ యివ్వాలి. క్రమశిక్షణ పెంపొందించుకోవాలి. పరిపాలనా రంగంలోకి కార్మికులను ఎక్కువగా చేర్చుకోవాలి. ప్రభుత్వాధికారులకు రాజకీయ. సిద్ధాంత బోధనా కార్యక్రమాన్ని పార్టీ పట్టుదలతో నిర్వహించాలి పార్టీ రాజకీయ పంథాను సమర్థవంతంగా అమలుపరచేందుకు అట్టి చర్యలు తీసుకోవాలి.

ట్రేడ్ యూనియన్లు, ప్రజారక్షణ కమిటీలు, ప్రజాతంత్ర యువజన సంస్థలు, ద్వారా, ప్రజలతో ఎమెన్ సోషలిస్టు పార్టీ సంబంధాలను పెంచుకుంటున్నది. సామాజిక, ఆర్థిక సంస్కరణలను అమలు పెట్టటానికి యిది ప్రధాన సాధనం. రాజకీయ వ్యవస్థ ప్రజాతంత్ర స్వభావాన్ని కాపాడటానికి కూడా యిది సరియైన మార్గం ప్రజల ప్రయోజనాలను యివి ప్రతిబింబించగలవు.

ఎమెన్ సోషలిస్టు పార్టీ ఒక నూతన తరహా పార్టీ. సమాజానికి నాయకత్వం వహిస్తున్నది. ఎమెన్ కార్మికవర్గంతో శాస్త్రీయ సోషలిజం అనుసంధానం చేస్తున్నది. సిద్ధాంతం, ఆచరణల మధ్య అభేద్యమైన బంధనాన్ని నిర్మించుతున్నది

విప్లవ సిద్ధాంతం లేకుండా విప్లవోద్యమం లేదు. పురోగామి. సిద్ధాంతం మార్గదర్శకత్వంలోనే పార్టీ అగ్రగామి దళ పోరాట పాత్రను నిర్వహించగల్గుతుంది అని లెనిన్ చెప్పారు.

సమాజ పరిణామ సూత్రాలను కష్టజీవులకు వివరించటం ద్వారా వారి సిద్ధాంత పరిజ్ఞానాన్ని పార్టీ పెంపొందిస్తున్నది. వారి పోరాట లక్ష్యాలు, అవకాశాలు వివరిస్తున్నది.

నేటిదశలో. ఎమెన్‌లో సిద్ధాంత పోరాటం ప్రధానంగా కార్మికవర్గానికి, సామ్రాజ్యవాద అనుకూలశక్తులకు మధ్య జరుగుతున్నది. ఎమెన్‌ను నయావలస వాద దేశంగా మార్చాలనే ప్రయత్నం సాగుతున్నది. సిద్ధాంత పోరాటం ఉధృతమవుతున్నది. కనుకనే శాస్త్రీయ సోషలిజం భావాల వ్యాప్తికి మరింత ప్రాధాన్యత పెరిగింది. నూతన సామాజిక చైతన్యం పెరుగుతున్నది. కార్మికవర్గ విప్లవకర పైఖరి బలపడుతున్నది.

సుశిక్షితులైన కార్యకర్తలు తగినంతగా లేనందున సిద్ధాంతబోధన సక్ర

షంగా సాగటం లేదు. శాస్త్రీయ సోషలిజం భావాలు ప్రచారం మాత్రం విస్తృతంగా సాగుతోంది. కాని సిద్ధాంత ప్రతికక్షులు సాగించే మన సత్వ ప్రచారాన్ని సమర్థవంతంగా ఎదుర్కొనవలసి వుంది. దాని ప్రభావాన్ని నిరోధించాలి. యిప్పటికీ పెటీ బూర్జువా ఆలోచన ప్రజలలో బలంగా వుంది ప్రజల మనస్సులలో ఆకర్షణీయమైన వినిమయ వస్తువుల ముద్రలు నాటేందుకు శత్రువులు ప్రయత్నిస్తున్నారు. పరభాగ్యోప జీవితాన్ని వారు ప్రోత్సహిస్తున్నారు.

ప్రస్తుత దశకు తగిన స్థాయిలో సిద్ధాంత, విద్యాబోధన కృషిని పెంపొందించేందుకు, సామ్రాజ్యవాద ప్రచారాన్ని ఎదుర్కొనేందుకు మా పార్టీ ప్రయత్నిస్తున్నది. ఈ రంగంలో శాస్త్రీయ పథకాన్ని అమలు పరచాలి. వివిధవర్గాల అభిప్రాయాలు. అభిరుచులను అర్థం చేసుకుని, వారి సమస్యలకు పరిష్కార మార్గాలను అన్వేషిస్తున్నాం. సిద్ధాంత కృషికి కావలసిన భౌతిక పునాదిని మేము నిర్మించే ప్రయత్నంలో వున్నాము. ప్రచారకులకు శిక్షణ గరుపుతున్నాం వివిధ స్థాయిల్లో ప్రచార దళాలను ఏర్పాటు చేస్తున్నాం. సిద్ధాంతరంగంలో కార్యకర్తలను తయారు చేస్తున్నాము. సుశిక్షితులైన నిగ్గుతేలిన కార్యక్రమాలను ఈ రంగానికి కేటాయించుతున్నాం.

ఎమెన్ సోషలిస్టుపార్టీ సభ్యుల సిద్ధాంత రాజకీయ స్థాయిని పెంచడం పార్టీ అధ్యయనం ప్రధాన లక్ష్యంగా వుంది కానీ ఈ రంగంలో సాధించవలసింది చాలా వుంది. విప్లవ సోషలిస్టు సిద్ధాంతాన్ని ఆకళింపు చేసుకొనవలసివుంది. విద్యా స్థాయిని పెంపొందించుకొనవలసియుంది. కష్టజీవులకు నాయకత్వం వహించే సామర్థ్యాన్ని పెంపొందించుకోవాలి.

సామాజిక చైతన్యంలో మౌలిక నిర్మాణంలో మార్పులు తీసుకొనివచ్చేందుకు గాను సిద్ధాంత కృషి జరగాలి. బూర్జువా విలువలు ఆదర్శాల ప్రభావం నుండి ప్రజలను విముక్తి చేసేందుకుగాను సిద్ధాంత కృషి జరగాలి. నూతన పౌరుని ప్రపంచ దృక్పథం శాస్త్రీయ పరిజ్ఞానంపై ఆధారపడియుండాలి. వర్గ వైఖరిని ప్రతిబింబించేదిగావుండాలి. విప్లవకర సామాజిక పునరుజ్జీవనంలో భాగస్వామి కావాలి.

యమెన్ సోషలిస్టుపార్టీ పాలకపార్టీ అయినంతమాత్రాన సమాజంలో దానికి నాయకత్వ స్థానం వుండాలనే గ్యారంటీలేదు. పార్టీ నిర్ణయాలువాటంతటఅవే అమలు జరగవు. నాయకత్వ పాత్ర దానంతట అదే సిద్ధించదు

సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ ఐక్యత ప్రాతిపదికగా మాత్రమే పార్టీ కృషి విజయవంతం కాగలదు. పార్టీ సమర్థతకు ఈ ఐక్యత పునాది ఎన్ని చిక్కులనైనా ఇది అధిగమించగలదు. సామాజిక విముక్తిపోరాటానికి ఇది నాయకత్వం వహించగలుగుతుంది పార్టీ ఐక్యత అనేది వర్గ చైతన్య సూత్రాలపైన ఐక్య కృషిపైన ఆధారపడియుంటుంది. పట్టుదల. నిర్మాణం, పోరాటశీలత ముఖ్యమైనవి. వీటన్నిటికీ

పునాది సిద్ధాంత ఐక్యత. అయితే ఇది మాత్రమే సరిపోదు నూతన తరహా పార్టీకి నిర్మాణ ఐక్యత కూడా ముఖ్యమైనది.

ఎమెన్ సోషలిస్టుపార్టీ సభ్యత్వంలో కార్మికులు, రైతులు, విప్లవకర మేధావులు ఇతర శ్రమజీవులు వున్నారు. వీరిలో కొంతమంది శ్రామికవర్గేతర ప్రభావాలకు లోనౌతూవుంటారు. దీనికి కారణం పెటీబూర్జువా ప్రభావం ఇంకా దేశంలో వుండటమే. కార్మికవర్గం ఇంకా నాయకత్వ స్థానం పొందేక్రమంలోవుంది. మాదేశం విప్లకర ప్రజాస్వామిక దశ నుండి శాస్త్రీయ సోషలిజం పరివర్తనకు పురోగమిస్తున్నది.

వర్గ పోరాటం బహురూపాల్లో కొనసాగుతున్నది. పార్టీ పంథాను అమలు పరచే బాధ్యత ప్రధానంగా పార్టీ సభ్యులపై వుంది. పార్టీలో కొత్త సభ్యులను చేర్చుకోనేదానికి మేము తగిన ప్రాధాన్యతను ఇస్తున్నాం. వారి చరిత్రను పరిశీలించిన మీదటనే ఎంపిక చేస్తున్నాము. పార్టీ సభ్యత్వం నేడు 30 వేలకు చేరుకొంది. సభ్యత్వాన్ని త్వరగా పెంచే కార్యక్రమాన్ని మేము అమలుపరచడం లేదు. అర్హత, చైతన్యస్థాయి; త్యాగం, గీటురాయిగా పెట్టుకొన్నాము. శ్రామికులకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నాం.

సామాజిక, ఆర్థిక సంస్కరణల ఫలితంగా దేశ సామాజిక చిత్రంలో మార్పులు వస్తున్నాయి. చట్టరీత్యా కార్మికవర్గం పెరుగుతున్నది. జాతీయ వుత్పత్తిలో ప్రభుత్వరంగ భాగం నేడు 46 శాతం చేరుకొంది. కానీ శ్రమజీవులు ఇంకా చిన్న ఫ్యాక్టరీలలోనే పని చేస్తున్నారు. పార్టీ ఆంతరంగిక జీవితం లెనినిస్టు సూత్రాలపై ఆధారపడివుంది. కేంద్రీకృత ప్రజాస్వామ్యం అమలులోవుంది. ఇవి ఒకే నాణేనికి బొమ్మ బొరుసు లాంటివి. ప్రజాస్వామ్యము, కేంద్రీకరణ వేరు భావాలు కావు. కేంద్రీకరణ అధికమైతే అది చొరవను చంపేస్తుంది. శుష్క ప్రజాస్వామ్యం అమలుజరిగితే నిర్మాణ సిద్ధాంత బలహీనతలు ముందుకు వస్తాయి. సమిష్టి కృషి, సమిష్టి నిర్ణయాలు చాలాముఖ్యమైనవి. ఎంతటి మహా నాయకుడైనా సమిష్టి అనుభవాలకు సరికాడు. అంతమాత్రాన సమిష్టి తత్వంలో వ్యక్తిత్వం అదృశ్యమౌతుందని భావించరాదు! వ్యక్తిగత బాధ్యత ప్రాతిపదికగానే సమిష్టి కృషి ఆధారపడి వుంటుంది. పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని ఎల్లప్పుడు కాపాడుకోవాలి. విమర్శ, ఆత్మ విమర్శ ఆయుధాన్ని వుపయోగించుకోవాలి. దీని వల్ల అనేక సమస్యలు పరిష్కారమౌతాయి. పార్టీ కార్యకలాపాలు పెంపొందుతాయి.

విప్లవ విజయాలను కాపాడటంలో ఎమెన్ కార్మికులు, రైతులు, మేధావులు పార్టీ సభ్యులు మున్నెన్నటికి కన్నా మరింత కృతనిశ్చయంతోయున్నారు.

★★★

# సైద్ధాంతిక రంగంలో సి. పి. ఐ. (ఎం) నాయకుల అసంబద్ధ వాదనలు

శ్రీ ఇంద్రదీప్ సిన్హా

సైద్ధాంతిక గందరగోళం పరిస్థితిలో సి. పి. ఐ. (ఎం) పుట్టింది. "అతివాద కామ్రేడ్ల"లోని మొండివారు 1963 జూన్ 14 నాటి చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ లోని "సాధారణ పంథా"పట్ల రహస్యంగా తమ విధేయతను ప్రకటించగా మిగిలిన వారేమో వూగిసలాట ధోరణి ప్రదర్శించసాగారు. కొంతమంది 1957, 1960 నాటి కమ్యూనిస్టు వర్కర్ పార్టీల అంతర్జాతీయ సమావేశాలు ఉమ్మడి గా అంగీ కరించిన సాధారణ పంథాను కూడా బలపరుస్తూ వుండినారు.

అందువల్ల అటు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం తాలూకు 1957 - 1960 ల డాక్యుమెంట్ల పట్లనూ ఇటు 1963 జూన్ 14 నాటి చైనా కమ్యూ నిస్టుపార్టీ లేఖపట్లనూ ఒకే సమయంలో రెండింటిపట్ల విధేయత ప్రకటించడం ద్వారా సైద్ధాంతిక ఐక్యతా సంకేతాన్ని చూపడానికి ప్రయత్నించారు. (చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి విభిన్నమైన ప్రత్యా మ్నాయ సాధారణ పంథాను ప్రతిపాదించింది). అలా రెండు ధోరణులను బల పరచే నటనావైదుష్యాన్ని సి. పి. ఐ (ఎం) నాయకత్వం ఈనాటికి కొనసాగిస్తూనే వున్నది.

అయితే ఈ అసంబద్ధమైన, పరస్పర విరుద్ధమైన సి. పి. ఐ (ఎం) నాయ కత్వపు వైఖరి ఆశ్చర్యకరమైందేమీ కాదు. ముఖ్యంగాఅతివాదుల రివిజనిజాన్ని ప్రస్తావిస్తూ లెనిన్ ఆధునిక రివిజనిజంపై చేసిన నిర్వచనంయొక్క మౌలిక స్వభా వానికి యీ వైఖరి అనుగుణంగా వున్నది.

తన "మార్క్సిజం - రివిజనిజం" అనే సుప్రసిద్ధ వ్యాసంలో లెనిన్ రివిజ నిజంయొక్క స్వభావం గురించి యీక్రింది పరిశీలనలు వెల్లడించారు. "తనకు శత్రు

పూర్వకమైన సిద్ధాంతాలన్నింటిని మార్క్సిజం తరిమివేసిన అనంతరం, ఆ సిద్ధాంతాల్లో వ్యక్తం అయిన ధోరణులు వేరు రూపాల కోసం వెదకసాగాయి. పోరాటం యొక్క రూపాలు ఉద్దేశాలు మారినాయి కానీ పోరాటం మాత్రం కొనసాగింది. మార్క్సిజం పుట్టిన శతాబ్దంలోని ఉత్తరార్థంలో మార్క్సిజం ఆమోదిస్తేనే మార్క్సిజంను వ్యతిరేకించే ధోరణులతో పోరాటం ప్రారంభమైంది."

"అతివాదుల రివిజనిజం" యొక్క ప్రత్యేక స్వభావాన్ని నిర్వచిస్తూ లెనిన్ యీ క్రింది ప్రగాఢమైన ప్రకటన చేశారు. లాటిన్‌దేశాలలో "విప్లవ సిండికలిజం" లాటి రూపాలను ధరించడం ప్రారంభించిన 'అతివాద రివిజనిజం' మార్క్సిజంను సవరిస్తూనే మార్క్సిజంలాగా కనిపించసాగింది. ఇటలీకి చెందిన లాబ్రియోలా ఫ్రాన్స్‌కు చెందిన లాగార్డిలీ వారు మార్క్స్ చెప్పినదానిని చెప్పనిదానినీ తరుచుగా ఉటంకించి విజ్ఞప్తులు చేశారు."(మార్క్సిజం" మార్క్స్- ఎంగెల్స్, పుటలు 249 - 250 - 251).

సి. పి. ఐ. (ఎం) నాయకుల సైద్ధాంతిక వైఖరి స్థూలంగా యీ వర్ణనకు అనుగుణంగా వుంటున్నది. వారి పార్టీ కార్యక్రమేమో కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల 1957 సమావేశం ప్రకటననూ 1960 సమావేశం ప్రకటననూ గట్టిగా బలపరుస్తుండగా, 'సైద్ధాంతిక సమస్యల'పై రూపొందించబడిన వారి డాక్యుమెంటు మాత్రం యీ ప్రకటనలను ప్రస్తావించడంలేదు; ఆ డాక్యుమెంటు చైనా కమ్యూనిస్టుపార్టీ 1963 లేఖను కీర్తిస్తున్నది. మాస్కోలో జరిగిన రెండు అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశాల ఉమ్మడి నిర్ధారణలను ఆ లేఖ నిరాకరిస్తున్నది. అంతేగాక ఆ నిర్ధారణలకు వ్యతిరేకంగా సదరు లేఖ ప్రత్యామ్నాయ 'సాధారణ పంథా'ను ప్రతిపాదించింది.

సి. పి. ఐ (ఎం) నాయకుల సైద్ధాంతిక వైఖరిలోని యీ రెండు ముఖాల ధోరణినీ, వంచన స్వభావాన్ని, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ (1956) నిర్ణయాలపట్ల వారి వైఖరిలో స్పష్టంగా గమనించవచ్చు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ తాలూకు చరిత్రాత్మక నిర్ణయాలు, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో నూతన దశను ప్రారంభించాయని 1957 ప్రకటన 1960 ప్రకటన రెండూ హర్షించాయి. కాగా ఆ నిర్ణయాలు రివిజనిజం ప్రవాహానికి ద్వారాలు తెరచాయని సి. పి. ఐ (ఎం) నాయకులు నిందించారు.

1957 ప్రకటనను 1960 ప్రకటనను మాస్కో సమావేశాల్లో పాల్గొన్న కమ్యూనిస్టు పార్టీల్లో, వర్కర్స్ పార్టీల్లో అత్యధిక పార్టీలను రివిజనిస్టు పార్టీలని" సి.పి ఐ (ఎం) నాయకులు నిందించారు. కారణమేమిటంటే చైనా కమ్యూనిస్టు పార్టీ లేఖలోని మావోయిస్టు పంథాను కీర్తించడానికి సి.పి.ఐ (ఎం) నాయకులతో

గొంతు కలపడానికి ఆ పార్టీలు నిరాకరించాయి. ఉదాహరణకు తమ ఎనిమిదవ మహాసభ (1968) ఆమోదించిన రాజకీయ, నిర్మాణ నివేదికలో వారుఈ క్రింది పరిశీలన చేశారు.

"భారత కమ్యూనిస్టు ఉద్యమంలోని వాస్తవ పరిస్థితిని విశదీకరించే లేఖతో పాటు యీ సోదర పార్టీలకు మన కలకత్తా మహాసభ ఆమోదించిన అన్ని డాక్యుమెంట్లనూ పంపించాము. అయినప్పటికీ వారంతా డాంగే వాదుల మహాసభకు హాజరై వారినే ఆశీర్వదించారు. అంతేకాదు, ముఖ్యంగా సోవియట్ యూనియన్ కమ్యూనిసుపార్టీ ప్రతినిధివర్గం యీ రివిజనిస్టులదే సరైన మార్క్సిజం, లెనినిజం అంటూ వారిపై ప్రశంసావర్షం కురిపించడం గుర్తుచేసుకోవడం ఆసక్తికరంగా వుంటుంది" (పుటలు 133-134).

1957 1960 మాస్కో డాక్యుమెంట్ల పట్ల వారు ప్రకటించిన వంచనాత్మక మద్దతును చూసి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ నాయకులు మోసపోలేదు మావోయిస్టు స్వభావాన్ని స్పష్టంగా అర్థం చేసుకున్నారు కాబట్టి, సి.పి ఐ (ఎం) నాయకులకు కోపం వచ్చింది.

ఇది ఆశ్చర్యమేమీ కాదు. ఎందుచేతనంటే సి.పి ఐ (ఎం) నాయకులు తమ సిద్ధాంత పత్రంలో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీని ఈ క్రింది మాటల్లో నిందించారు.

"సిపి.ఎస్.యు. 20 వ మహాసభలో కృశ్చెవ్ ప్రతిపాదించినట్టి, ఆధునిక రివిజనిస్టులు వివరించి, భాష్యం చెప్పి ఆచరిస్తున్నట్టి శాంతియుత సహజీవనం, శాంతియుత ఆర్థిక పోటీ, శాంతియుత పరివర్తన అనే భావనలు ప్రపంచ స్థాయిలో వర్గ రాజీ పంథాగా వర్గ సాంకర్య పంథాగా క్రమేణా రూపుదాల్చుతున్నాయి." (పుట 29)

"శాంతి నిర్వహణలో సహకారంకోసం సహ ప్రాతినిధ్యంకోసం చేసే ప్రయత్నాన్నిన్ని ఆ డాక్యుమెంటు నిరసించింది. రెండు వ్యవస్థల మధ్య పోరాట రూపంగా, పోరాట మూలంగా ఆర్థికంగా, రాజకీయంగా, సైద్ధాంతికంగా, సైనికంగా రాజీలేని పోరాటం కావాలని డిమాండ్ చేసింది. సామ్రాజ్యవాదులు దురాక్రమణ జరిపినచోట, జోక్యం చేసుకున్నచోట సోషలిస్టు రాజ్యాలు నేరుగా సైనిక జోక్యానికి దిగాలని కూడా డాక్యుమెంట్ కోరింది" (అదే నివేదిక)

భారత దేశంలోని కమ్యూనిస్టు ఉద్యమ ఆంతరంగిక వ్యవహారాల్లో సి. పి. యస్.యు. నాయకత్వం "జోక్యం" చేసుకుంటున్నదని అసత్యారోపణలు చేశారు. సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు సమాజం నిర్మాణంలో "పాదార్థిక

ప్రోత్సాహకాలు" ఇచ్చే మార్క్సిస్టు-లెనినిస్టు విధానాన్ని ఈ క్రింది విధంగా నిందించారు.

"పెట్టుబడిదారీ ప్రోత్సాహకాలపైనా, సొంత లాభం అనే భావాలపైన ఆధారపడితే చివరకు అది నూతన తరహా పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణకు దారి తీస్తుంది" (అదే నివేదిక పుట 35).

సి.పి.ఐ. (ఎం) నాయకుల ద్వంద్వ వైఖరితో కూడిన, వంచనాత్మకమైన "సాధారణ పంథా"లోని పిడివాదసారం, సెకేరియన్‌సారం, దుందుడుకుసారం ఇదే. 1957-1960 ల మాస్కో డాక్యుమెంట్ల పట్ల నామమాత్రపు విధేయత ప్రకటిస్తూ, ఆచరణలో డాక్యుమెంట్లలోని ప్రతిప్రధాన ప్రతిపాదనను వారు నిరాకరించారు. వ్యతిరేకించారు; అదే సమయంలో చైనా కమ్యూనిస్టుపార్టీ 1963 జూన్ 14 లేఖలోని ప్రత్యామ్నాయ "సాధారణ పంథా" లోని ప్రతిపాదనలను బలపరిచారు.

విభిన్న సామాజిక వ్యవస్థలుగల రాజ్యాల మధ్య శాంతియుత సహజీవనం అనే లెనినిస్టు విధానాన్ని వారు నిరాకరించారు. శాంతికోసం, నిరాయుధీకరణకోసం ఉద్రిక్తతల ఉపశమనం కోసం పోరాటాన్ని వ్యతిరేకించారు.

సోషలిజం, పెటుబడిదారీ విధానం మధ్య శాంతియుత ఆర్థిక పోటీ విధానాన్ని నిరాకరించారు. పెట్టుబడిదారీ దేశాల్లో సోషలిస్టు విప్లవం విజయవంతం కావాలంటే సోషలిస్టు దౌత్యాన్ని, సోషలిస్టు కుటుంబం యొక్క సైనిక శక్తినీ విప్లవ కర పద్ధతిలో సమ్మేళనం కావించాలని వారు కోరారు.

శాంతియుత పంథా అంటే పార్లమెంటరీ పంథానే అంటూ విప్లవకర పోరాటం అంటే సాయుధ పోరాటమే అంటూ శాంతియుత పరివర్తన భావాన్ని వారు నిరాకరించారు. ఈ విధంగా సాయుధ పోరాటాన్ని పరమమైందిగా చిత్రించారు. ఇతరేతర ప్రజా విప్లవ పోరాట రూపాలన్నింటినీ "రివిజనిస్టు" పోరాట రూపాలుగా కొట్టిపారేశారు.

సోషలిజం, సామ్రాజ్యవాదాల మధ్యగల వైరుధ్యాన్ని ప్రధాన వైరుధ్యంగా వారు నిరాకరించారు; సోషలిజం కోసం పోరాటంలో సోషలిస్టు వ్యవస్థకు, అంతర్జాతీయ శ్రామికవర్గానికీ గల నేతృత్వ పాత్రను తిరస్కరించారు. ఈ క్రింది ప్రకటన చేయడం ద్వారా జాతీయ విముక్తి ఉద్యమానికి ఆ నేతృత్వ పాత్రను అంటగట్టారు. "అందుచేత ఒక విధంగా అంతర్జాతీయ శ్రామిక విప్లవ లక్ష్యం అన్నది ఆ ప్రాంతాల్లోని విప్లవకర ప్రజా పోరాటాలపై ఆధారపడి ఉంటుంది." (అదే నివేదిక పుట 10).

విప్లవ కేంద్రం యిప్పుడు రష్యానుండి చైనాకు యితర వలస దేశాలకు మారిందని తెలవిస్తూ తప్పుడు పద్ధతితో కూడిన భౌగోళిక విప్లవ సిద్ధాంతాన్ని కూడా సృష్టించారు.

సి.పి.ఐ. (ఎం) నాయకులు చేసిన యీ ప్రతిపాదనలు వారి బుర్రలోనే పుట్టిన మౌలికత్వంగల ప్రతిపాదనలేమీ కావు. ఉమ్మడిగా అంగీకరించిన అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రతిపాదనలకు, సూత్రాలకు పోటీగా అల్లబడిన ఆ ప్రతిపాదనలు కేవలం ట్రాట్స్కీయిజం, రాయిజం, మావోయిజంల కలగూరగంప.

అందువల్ల వారు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం నుంచి పూర్తిగా వేరుపడిపోయారు వివిధ ఒత్తిళ్ళకు గురై, తమ చుట్టూ చేర్చుకున్న అంశాలతో సిద్ధాంతాన్ని రూపొందించుకునే కర్తవ్యం పూర్తికాకముందే వారు ఈ విధంగా వేరుపడిపోయారు.

సి.పి.ఐ. (ఎం) ఎనిమిదవ మహాసభ ఆమోదించిన "రాజకీయ, నిర్మాణ నివేదిక" లో వారు తమ దురవస్థను గురించి యిలా చింతించారు.

"ఇంటా, బయటా ఆధునిక రివిజనిస్టులతో జీవన్మృత్యు పోరాటం జరుపుతున్న మన పార్టీ, చైనా కమ్యూనిస్టు పార్టీ వైపు గొప్ప ఆశాభావంతోనూ, ప్రశంసా భావంతోనూ చూసింది. సి.పి.యస్.యు. నాయకుల ఆధునిక రివిజనిజానికి వ్యతిరేకంగా వారు ధైర్యంగా పోరాటం ప్రారంభించినందువల్ల అలా ఆశగా వారివైపు చూశాము. అనేకమంది మన పార్టీ సభ్యులు రివిజనిస్టు సవాలును అంగీకరించే ధైర్యం కూడగట్టుకున్నారు. అంతర్జాతీయ స్థాయిలో చైనా కామ్రేడ్లు సాగించే రివిజనిస్టు వ్యతిరేక పోరాటం నుంచి మన కామ్రేడ్లు ఆ విధంగా ద్విగుణీకృత ఆత్మవిశ్వాసాన్ని సంతరించుకున్నారు. అయితే గత పద్దెనిమిది మాసాలుగా చైనా కమ్యూనిస్టు నాయకులు మన పార్టీకి వ్యతిరేకంగా పత్రికల్లోనూ, రేడియోలోనూ సంపూర్ణ స్థాయి దాడి ప్రారంభించారు. మన నాయకులకు వ్యతిరేకంగా, మన పార్టీకి వ్యతిరేకంగా వారు వాడని విశేషణం లేదు. దూషణపదం లేదు" (పుటలు 3-4)

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంనుంచి పూర్తిగా వేరుపడటంతో సి.పి.ఐ (ఎం) నాయకులు, కొత్త పరిస్థితికి "అతుక్కుపోవడానికి" అనువుగా కుతంత్రాలు చేయడం ప్రారంభించారు.

ఇలా అతుక్కుపోవడమనే క్రమం యొక్క సారం ఏమిటి? అంటే చైనా కమ్యూనిస్టుపార్టీ విదేశాంగ విధానంలోని "తాత్కాలిక దోషాల" పట్ల అధికారికంగా విమర్శనా వైఖరి అవలంబించడం; సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు

పార్టీ పట్ల తమ వైఖరిలో క్రమేణా మార్పు ప్రదర్శించడం; శాంతి, నిరాయుధీకరణ, ఉద్రిక్తతల ఉపశమనంకోసం పోరాటం పట్ల వైఖరిలో మార్పు; విభేదాలు తగ్గించుకుని సాధ్యమైతే ప్రపంచంలో, పలు కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీలతో స్నేహం పెంచుకోడానికి తెలివిగా ప్రయత్నించడం. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఇప్పుడు సి.పి.ఐ. (ఎం) కూడా ఒక భాగమే అన్న భావం సృష్టించడానికి అలా చేయడం. సి.పి.ఐ. (ఎం) తొమ్మిదవ, పదవ, పదకొండవ మహాసభలు ఆమోదించిన రాజకీయ తీర్మానాల్లోని మారిన సూత్రీకరణల్లో మనం వీటిని స్పష్టంగా గమనించవచ్చు.

తొమ్మిదవ మహాసభ (1972) తీర్మానంలో చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ పట్ల తమ మౌలిక విధేయతను వారు పునరుద్ఘాటించారు. "సామ్రాజ్యవాదం మధ్య జాతీయ విముక్తి పోరాటం మధ్యగల వైరుధ్యం అన్ని వైరుధ్యాల్లోకి ప్రధానమైందన్న" మావోయిస్టు సూత్రీకరణను నొక్కిచెప్పడం ద్వారా వారు తమ విధేయతను అలా పునరుద్ఘాటించారు. కాగా మరోవైపు వారు అటు సోవియట్ కమ్యూనిస్టు పార్టీని, ఇటు చైనా కమ్యూనిస్టుపార్టీని రెండింటినీ విమర్శించారు. "ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో సంబంధంగల అనేక సమస్యలపై ఒకరికి మితవాద, అవకాశవాద వైఖరి వుంటే మరొకరికి అతివాద, అవకాశవాద వైఖరి" వున్నదని ఇరువురినీ విమర్శించారు పుటలు (1-8)

పదవ మహాసభ తీర్మానం (1978).లో యీ మావోయిస్టు సూత్రీకరణలను ప్రస్తావించకపోవడమేగాక, వియత్నాం కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన వియత్నాం ప్రజలు సాధించిన చారిత్రాత్మక విజయాన్ని సానుకూల ధోరణిలో హర్షించారు. ఐ.రా.స. లో చైనా ప్రజా రిపబ్లిక్‌కు స్థానం లభించినందుకూ హర్షించారు. అంతేకాక సామ్రాజ్యవాదులు ఉద్రిక్తతల ఉపశమనాన్ని అంగీకరించినందుకూ, శాంతి, సహకారంపై హెల్సింకీ మహాసభ జయప్రదంగా ముగిసినందుకు కూడా వారు ఆ తీర్మానంలో హర్షించారు. 1968నాటి సైద్ధాంతిక తీర్మానం కంటె ఇది పెద్దముందడుగే. 1968 నాటి సైద్ధాంతిక తీర్మానంలో శాంతి, నిరాయుధీకరణ, ఉద్రిక్తతల ఉపశమనంకోసం పోరాటాన్ని తిరస్కరించారు. అవి సామ్రాజ్యవాదం గురించి శాంతి, ఊహా స్వర్గభ్రమలను సృష్టిస్తాయని ఖండించారు.

## అవకాశవాదంనుంచి బయటపడ్డారు

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీ రెండు సమానమే అన్న అవకాశవాద వైఖరి నుంచి తమ పదకొండవ మహాసభ తీర్మానంలో (1982) సి.పి.ఐ. (ఎం) నాయకులు బయటపడ్డారు. సి.పి.ఐ. నుంచి చీలి

పోయాక ప్రప్రథమంగా సి.పి.ఐ. (ఎం) నాయకులు యీ క్రింది ముఖ్యమైన పరిశీలనలు చేశారు.

"సామ్రాజ్యవాదుల దాడికి సోవియట్ యూనియన్ కేంద్రం కాగా చైనా నాయకులు కూడా సోవియట్ యూనియన్‌ను విమర్శిస్తున్నారు. అనేక చర్యల్లోనూ, కుతంత్రాల్లోనూ అమెరికాను చైనా నాయకులు బలపర్చుతున్నారు: ప్రపంచాధిపత్యం సంపాదించడానికి, సోవియట్ యూనియన్‌పై యుద్ధం ప్రారంభించడానికి అమెరికా పన్నే పథకాల్లో సైతం అమెరికానువారు బలపర్చుతున్నారు: అమెరికా విదేశాంగ విధానంతో తమ విదేశాంగ విధానాన్ని సమన్వయ పరుస్తున్నామని చైనా ప్రభుత్వ నాయకులే అంటున్నారు."

కొన్ని వర్తమాన సమస్యలపై వారి వైఖరిలో మార్పు వచ్చింది కాని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని విభేదాలు గల మౌలిక సమస్యలపై వైఖరిలో మార్పు మాత్రం రాలేదు. పర్యవసానంగా సి. పి. ఐ (ఎం) నాయకులు, చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖల్లోని దివాళాకోరు వైఖరులకే ఇంకా కట్టుబడివుండడం కొనసాగిస్తున్నారు. చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు విదేశాంగ విధానంలోని కొన్ని "తాత్కాలిక దోషాల"ను బర్ద్వాన్ ప్లీనం సమావేశం (1968) విమర్శించింది. అలాగే సోవియట్ ప్రభుత్వమూ, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం చేపట్టిన కొన్ని శాంతి చొరవలను కూడా విమర్శించింది.

పైన తెల్పిన ఈ పదకొండవ మహాసభ ఆ తీర్మానాన్ని ఆమోదించిన దాదాపు ఆరుమాసాలకే 1982 జూలైలో తిరువనంతపురంలోని ఎ.కె జి.కేంద్రంలో జరిగిన కార్యకర్తల తరగతిలో పాఠం చెబుతూ బి. టి. రణదివే సోవియట్ కమ్యూనిస్టుపార్టీ పార్టీ నాయకులపై పాత నీలాపనిందలే మళ్ళీ వేశారు. ఆయన ఇలా అన్నారు. "ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ శ్రేణుల్లో రివిజనిస్టు పెద ధోరణుల ప్రారంభాన్ని సి.పి ఎస్.యు. 20 వ మహాసభ సూచిస్తున్నది"1968నాటి బర్ద్వాన్. ప్లీనం సమావేశం తీర్మానంలో చేర్చిన సోవియట్ వ్యతిరేక నిందలను ఆయన మళ్ళీ యథాతథంగా అప్పచెప్పారు.

చైనా కమ్యూనిస్టుపార్టీ యొక్క మావోయిస్టు నాయకత్వాన్ని శ్రీ రణదివే కీర్తించారు. ఆయన ఇలా అన్నారు. "రివిజనిస్టు పెద ధోరణికి, ఏక పార్టీ పెత్తనానికి మొట్టమొదట చైనా కమ్యూనిస్టుపార్టీయే పోరాటాన్ని ప్రారంభించింది: ఆ పోరాటానికి నాయకత్వం వహించింది. ప్రజలకు ప్రధాన శత్రువు అమెరికా సామ్రాజ్యవాదమని చైనా కమ్యూనిస్టుపార్టీ సరిగానే అవగాహన చేసుకుంది. జాతీయ విముక్తి పోరాటాల ప్రాముఖ్యతను అర్థం చేసుకుంది; శాంతియుత

పంథాను తిరస్కరించి చైనా కమ్యూనిస్టుపార్టీ శ్రామికవర్గ నియంతృత్వాన్ని, పార్టీ యొక్క నాయకత్వ పాత్రను బలపరచింది. శాంతియుత సహజీవనం, శాంతి కోసం పోరాటం లాటి భావనల (!) విమర్శించింది"

ఆ తర్వాత దాదాపు సంవత్సరానికి 1983 ఏప్రిల్‌లో చైనాకు వెళ్ళిన సి పి ఐ. (ఎం) ప్రతినిధివర్గానికి నాయకులుగా చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుల ముందు ఆయన ఇలా అన్నారు: 19 7, 1960 నాటి ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల ప్రకటనకు మేము గట్టిగా కట్టుబడివున్నాము. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం లోని రివిజనిస్టు ధోరణులకు వ్యతిరేకంగా పోరాటం అంశానికి సంబంధించి, 1963 జూన్ చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖను మేము చాలావరకు బలపర్చు తున్నాం ప్రస్తుతం కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఆవహించి, ప్రధాన ప్రమాదంగా తయారైన ఆధునిక రివిజనిజంకు వ్యతిరేకంగా మనం పోరాడాలి."

ఈ విధంగా ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో తలెత్తిన సైద్ధాంతిక సమ స్యలపట్ల తమ వంచనాత్మక ద్వంద్వ వైఖరికే సి.పి.ఐ (ఎం) నాయకులు కట్టు బడి వుంటున్నారు. 1957, 1960 మాస్కో డాక్యుమెంట్లను బలపర్చుతున్నట్లు నటి స్తున్నారు. వాస్తవానికి వారు 1963 జూన్ నాటి చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ ప్రతిపాదించిన ప్రత్యామ్నాయ సాధారణ పంథానే బలపర్చుతున్నారు.

ఈ మౌలికమైన వంచనాత్మక సైద్ధాంతిక వైఖరిని అంటిపెట్టుకుంటూనే, వారు వర్తమాన సమస్యలపై తమ ధోరణిని క్రమేణా మార్చడానికి ప్రయత్నిం చారు. అందుకు కారణం తమ పాత పిడివాదాలను చెల్లుబాటు చేసుకోవడం సాధ్య పడకపోవడమే ఉదాహరణకు వియత్నాం సోషలిస్టు రిపబ్లిక్‌పై చైనా దాడి జరి పిన తర్వాత, సోషలిస్టు రాజ్యం దాడి చేయజాలదన్న తమ పిడివాదానికి అంటి పెట్టుకొని ఉండలేకపోయారు. కాబట్టి 1962 లో చైనాకాదు భారతదేశమే దాడిజరిపి వుంటుందన్నది వాదన.

వియత్నాంపై చైనా దురాక్రమణను వారు ఖండించడం జరగలేదు. రెండు సోషలిస్టు దేశాల మధ్య "దురదృష్టకరమైన శత్రు చర్య" లుగా వాటిని వర్గీకరిం చారు; దాడికి గురైన సోషలిస్టు దేశాన్ని తాము బలపరుస్తాము అన్నారు.

అదే సమయంలో సోవియట్ యూనియన్‌కు, ఆఫ్ఘనిస్తాన్‌కు, భారత్‌కు వ్యతిరేకంగా అమెరికాతో "వ్యూహాత్మక ఏకాభిప్రాయం" సాధించే విధానాన్ని చైనా ప్రభుత్వం అవలంబించసాగిన అనంతరం, అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చైనా రాజీలేని పోరాటం జరుపుతుందన్న తమ పిడివాదానికి అంటి పెట్టుకుని వుండటం సాధ్యపడకపోయింది. అలాగే అమెరికా సామ్రాజ్యవాదంతో

సోవియట్ యూనియన్ "రాజీపూర్వక, సాంకర్యపూర్వక" "రివిజనిస్టు" విధానాన్ని అవలంబిస్తుందన్న పిడివాదానికి కూడా అంటిపెట్టుకుని వుండలేకపోయారు.

కాబట్టి సి.పి.ఐ (ఎం) నాయకుల సైద్ధాంతిక పంథాలో పిడివాదమూ, ఉపయోగతావాదమూ ఉన్నాయి. అది ఆరెండింటి అవకాశవాద సమ్మేళనం. వారు సాధ్యమైనంతకాలమూ చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖలోని పాత పిడివాదాలకు అంటిపెట్టుకునే ఉంటారు. అయితే పరిస్థితులు వత్తిడిచేస్తే మాత్రం వర్తమాన సమస్యలపై మెల్లిగా తమ ధోరణిని మార్చుకుంటారు. అయితే తమ మౌలిక పిడివాదానికి కానీ ఒంటెత్తు ధోరణికి కానీ స్వస్తి మాత్రం చెప్పరు.

మీ వైఖరిని మార్చుకుంటున్నారంటే మాత్రం ఒప్పుకోరు. ఇతరులే మార్చుకున్నారని తమ వైఖరులే సక్రమమైనవని వాదిస్తారు.

ఉదాహరణకు తమ పదకొండవ మహాసభ ముగిసిన సందర్భంగా శ్రీ బి.టి. రణదివె విజయవాడ పత్రికా సమావేశంలో ప్రసంగిస్తూ యిలా అన్నారు:

సి. పి. ఐ. (ఎం) నాయకత్వం తన పెకింగ్ అనుకూల వైఖరి నుంచి మాస్కో అనుకూల వైఖరికి మారిందన్న అభిప్రాయంపై వ్యాఖ్యానించవలసిందిగా కోరగా ఆయన (బి.టి ఆర్.) యిలా అన్నారు. ఇతరులు కూడా మారుతారు అన్న విషయాన్ని మనం గుర్తించాలి. సామ్రాజ్యవాదం పట్ల చైనా, సోవియట్ యూనియన్‌ల వైఖరి ఎలా వుంటుందన్న అంశంపై ఆ దేశాల పట్ల మా వైఖరి ఆధారపడి ఉంటుంది 1957 లో అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చైనా కమ్యూనిస్టుపార్టీ గట్టి వైఖరి తీసుకుంటూ వుండగా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ మాత్రం మెతక వైఖరి చేపడుతుండేది. అందుచేత సి.పి.ఐ. (ఎం) సోవియట్ పార్టీని కాకుండా చైనా పార్టీనే బలపరిచింది. కాగా యిప్పుడు అమెరికా దాడికి సోవియట్ యూనియన్ లక్ష్యం కాగా, తాము అమెరికాతో తమ కార్యకలాపాలను సమన్వయపరచుకుంటున్నామని చైనా వారే అంటున్నారు"

(పేట్రియట్ ఫిబ్రవరి5, 1982)

శ్రీ రణదివెగారి ఈ విడ్డూరమైన ప్రకటన సి పి. ఐ. (ఎం) నాయకులు శ్రామికవర్గ అంతర్జాతీయతకు స్వస్తి చెప్పారనడానికి నిదర్శనం.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ, చైనా కమ్యూనిస్టు పార్టీలతో సహా అన్ని యితర సోదర పార్టీల నడవడిక స్వభావాన్ని నిర్ణయించే ఏకైక అధికారం తమకే ఉన్నదంటున్న వీరు, అంతర్జాతీయ ప్రాముఖ్యం గల మౌలిక సమస్యలపై కమ్యూనిస్టు పార్టీల సాధారణ పంథాను నిర్ణయించడానికి మార్క్సిజం–లెనినిజం అనే శాస్త్రం ఉన్నదన్న విషయాన్ని, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్య

మం వుందన్న విషయాన్ని మరచిపోయారు. అంతర్జాతీయ ప్రాముఖ్యం గల మౌలిక సమస్యలు అంటే-అణుయుద్ధం ప్రజ్వలింప చేయడానికి అమెరికా సామ్రాజ్యవాదం సాగిస్తున్న ఉన్మాద ప్రయత్నాలు, ఈ ప్రయత్నాన్ని వ్యతిరేకించడానికి, శాంతికోసం, నిరాయుధీకరణ కోసం, ఉద్రిక్తతల ఉపశమనంకోసం విభిన్న సామాజిక వ్యవస్థలకు చెందిన రాజ్యాల మధ్య శాంతియుత సహజీవనం కోసం పోరాడడానికి, కమ్యూనిస్టు ఉద్యమమూ, ప్రజాతంత్ర ఉద్యమమూ అవలంబించదగిన విధానం.

1957-1960 మాస్కో అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశాల ఉమ్మడి అంగీకృత నిర్ధారణలను త్రోసిరాజనే అధికారమూ, నిలకడలేని తమ స్వీయ మానసిక ధోరణితో యుద్ధం, శాంతి సమస్యలపై పంథాను నిర్ణయించే అధికారము సి.పి.ఐ. (ఎం) నాయకులకు ఎవరిచ్చారని మేము అడిగవచ్చు ?

అందులో ఆశ్చర్యమేమీలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రధాన స్రవంతి నుంచి చీలిపోయారు కనక చైనా కమ్యూనిస్టుపార్టీ మావోయిస్టు నాయకత్వం వారిని తన్ని తగలేసింది కాబట్టి సి.పి.ఐ. (ఎం) నాయకులు యిష్టం వున్నా లేకపోయినా అంతర్జాతీయతా, వ్యతిరేక ధోరణిలోకి బూర్జువా జాతీయ దురహంకార ధోరణిలోకి జారుకున్నారు. ఇది వారి అధికారిక ప్రకటనల్లో స్పష్టంగా వ్యక్తమైంది.

ఉదాహరణకు— పైన చెప్పిన తిరువనంతపురం ఎ.కె.జి. కేంద్రంలో శ్రీ రణదివె చేసిన ప్రసంగంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని విభేదాల పుట్టుపూర్వోత్తరాలపై సిద్ధాంతీకరించడానికి ప్రయత్నించారు. ఆయన అన్న మాటలు ఇవీ :

"రెండో ప్రపంచయుద్ధం, ఫాసిస్టు వ్యతిరేక పోరాటంలో సోవియట్ యూనియన్ విజయం. అనేక సోషలిస్టు దేశాలు అవతరించడం, చైనా విప్లవ విజయం_ఇవన్నీ ప్రపంచంలో నూతన శక్తుల సమతౌల్యం సృష్టించాయి. వాటి పరిణామాలను అంచనా వేయడంలో, వివిధ కమ్యూనిస్టు పార్టీలు తమ సొంత జాతీయ పరిగణనలనుంచి చూడడానికి ప్రయత్నించి, విభేదాల్లో పడిపోవటమేకాక, మార్క్సిజం-లెనినిజం మౌలిక పంథా వదలి పెడ మార్గం కూడా పట్టాయి."

ఈ విధంగా "స్వతంత్ర మార్క్సిజం" అనే సూత్రం ప్రకారం, రెండో ప్రపంచ యుద్ధం ముగిశాక ప్రపంచంలోని అన్ని కమ్యూనిస్టు పార్టీలు మార్క్సిజం-లెనినిజం మూలసూత్రానికీ, శ్రామికవర్గ అంతర్జాతీయతా మూలసూత్రానికీ స్వస్తి చెప్పి బూర్జువా జాతీయవాదంలోకి జారిపడ్డాయన్నమాట. అందుకే ఆ పార్టీలు తమ "సొంత జాతీయ పరిగణనల నుంచి నూతన పరిణామాలను చూడ ప్రయ

త్నించాయి. ఫలితంగా విభేదాలు తలెత్తాయి. పెడమార్గాలు తెరచుకున్నాయి. కాగా ఒక్క సి.పి.ఐ (ఎం) నాయకులు మాత్రమే మార్క్సిజం-లెనినిజం, శ్రామికవర్గ అంతర్జాతీయతా పతాకాన్ని నిలువెత్తు ఎత్తిపట్టుకున్నారు.

అతిశయాలుపోతున్న యీ పెద్దమనుషులను యీ క్రింది ప్రశ్నలు అడగవచ్చు అదే నిజమైతే మరి 1957, 1960 మాస్కో సమావేశాల్లో కమ్యూనిస్టు, వర్కర్సు పార్టీలు ఉమ్మడి నిర్ధారణలకు ఎలా వచ్చాయి? 1963 జూన్ 14 నాటి చైనా కమ్యూనిస్టు పార్టీ లేఖలో మార్క్సిజం - లెనినిజం పాఠమూ, శ్రామికవర్గ అంతర్జాతీయతా పాఠమూ ముమ్మూర్తుల మూర్తీభవించి వున్నట్లు 1964 లో సి.పి.ఐ. (ఎం) నాయకులు ఎలా కనుగొన్నారు? 1983 లో చైనా కమ్యూనిస్టు పార్టీతో "పార్టీ గత" సంబంధాలు తిరిగి ఏర్పాటు చేసుకున్న సందర్భంగా మార్క్సిజం - లెనినిజం కానీ, శ్రామికవర్గ అంతర్జాతీయతకానీ తమ సౌహార్ద సంబంధాలకు మూలం అన్న ప్రస్తావనే రాలేదు ఎందుకని ?

అసలు సత్యం ఏమిటంటే మార్క్సిజం - లెనినిజంకూ, శ్రామికవర్గ అంతర్జాతీయతకు స్వస్తి చెప్పిన సి.పి.ఐ (ఎం) నాయకులు కానీ చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకులు కానీ ఆ మూల సూత్రాల గురించి బొత్తిగా లక్ష్య పెట్టారు కాదు.

ఇది యాదృచ్ఛికంగా జరిగిందేమీకాదని సి. పి. ఐ. (ఎం) తొమ్మిదవ, పదవ, పదకొండవ మహాసభల రాజకీయ తీర్మానాల్లో పదేపదే చోటుచేసుకున్న ప్రకటనలే రుజువు చేస్తున్నాయి. "వర్ధమాన దేశాల్లోని విప్లవశక్తుల అభివృద్ధిని తమ ప్రభుత్వాల విదేశాంగ విధానపు అవకాశవాద అవసరాలకు వినియోగించుకోడానికి సి.పి.ఎస్.యు, సి పి.సి. రెండూ ప్రయత్నిస్తున్నాయి.

(పదవ మహాసభ తీర్మానం పుట-11)

ఈ చిత్రాతిచిత్రమైన సూత్రీకరణలో అంతర్జాతీయ వర్గ పోరాట గతి తర్కపు అవగాహన లోపించడమేగాక, యిది సి. పి ఐ. (ఎం) నాయకులను బూర్జువా జాతీయ దురహంకార స్థాయికి, అంతర్జాతీయతా వ్యతిరేకత స్థాయికి దించుతున్నది.

సి.పి.ఐ. (ఎం) కేరళ రాష్ట్ర సమితి ప్లీనం సమావేశంలో ప్రసంగిస్తూ పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ నంబూద్రిపాద్‌గారే స్వయంగా యీ విషయం ఒప్పుకున్నారు. ఆయన యిలా అన్నారు:

"సి.పి.ఐ. (ఎం) తొమ్మిదవ మహాసభ పేర్కొన్నట్లు, సోవియట్ నాయకులు, చైనా నాయకులు తమ తమ విదేశాంగ విధాన ప్రయోజనాలకు తోడ్పడే

విధంగా అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యలపట్ల వ్యవహరిస్తారు. దీని ఫలితంగా సోవియట్ పార్టీ చైనాపార్టీ రెండూకూడా పెట్టుబడిదారీ దేశాల్లోని విప్లవకర ఉద్యమానికి శత్రువులుగా వుంటున్నాయన్న అభిప్రాయం మనలో కలిగింది. చైనా సోషలిస్టు దేశం కాదనీ, దాని నాయకులు విప్లవానికి శత్రువులనీ ఒక విభాగం అనుకుంటారు; కాగా మరో విభాగమేమో సోవియట్ యూనియన్ సోషలిస్టు దేశం కాదనీ, దాని నాయకులు విప్లవానికి శత్రువులని భావిస్తారు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికే వ్యతిరేకమైన ధోరణి ఒకటి మన శ్రేణుల్లో తలెత్తుతున్నది. ఈ ధోరణికి వ్యతిరేకంగా పోరాడటంలో పార్టీ నాయకత్వం జయప్రదం కాలేదు" (పీపుల్స్ డెమోక్రసీ మే — 3, 1981)

సి. పి. ఐ (ఎం) నాయకత్వమే స్వయంగా అంతర్జాతీయతా వ్యతిరేకతకు, బూర్జువా జాతీయ దురహంకారానికి బలై పోతూంటే. తమ 'సొంత' స్వతంత్ర మార్క్సిజం అనే తప్పుడు పట్టకం నుంచి అంతర్జాతీయ పరిణామాలను చూస్తూ ఉంటే యిక యీ ధోరణికి వ్యతిరేకంగా వారెలా పోరాడ గలుగుతారు ?.

సి. పి. ఐ. (ఎం) నాయకత్వానికి. లెనిన్ నిర్వచించినట్టి, అతివాద "రివిజనిజం" అని చెప్పడానికి ఆ పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులు హరికిషన్‌సింగ్ సూర్జిత్‌గారి అర్థం — పర్థంలేని తాజా రాతలే నిదర్శనం. "బూర్జువా జాతీయత - శ్రామికవర్గ అంతర్జాతీయ" అనే ఆయనగారి సుదీర్ఘవ్యాసం సి. పి ఐ (ఎం) "స్వతంత్ర మార్క్సిజం" యొక్క బూర్జువా జాతీయ స్వభావానికి ముసుగు కప్పడానికే ఉద్దేశించబడింది. అయినప్పటికీ అది వారి అతివాద రివిజనిజంను స్పష్టం చేస్తున్నది. సి. పి. ఐ. మీద నీలాపనిందలు, దూషణలు కురిపించడంద్వారా ఆయన ఒక సత్యాన్ని బయటపడేశాడు. 1957, 1960 నాటి మాస్కో అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశాల సక్రమమైన, సరైన అవగాహనపై, లేక వ్యాఖ్యానంపై వివాదం లేవనెత్తడమే తమ పార్టీ తాజా వైఖరి అన్న సత్యాన్ని ఆయన వెల్లడించారు.

లెనిన్ భాషలో చెబితే, సి. పి. ఐ (ఎం) నాయకులు నిజమైన "అతివాద రివిజనిస్టుల" పద్ధతిలో మార్క్సును తప్పుగాను ఒప్పుగాను ఉటంకించటం ప్రారంభించారు.

## అవధులులేని అవకాశవాదం

"అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం తాలూకు 1957 — 1960 డాక్యుమెంట్లలోని విప్లవకర సూత్రాలను సి. పి ఐ. (ఎం) ఎల్లప్పుడూ బలపరుస్తూనే వున్నదని సూర్జిత్ సెలవిచ్చారు. అజయ్‌ఘోష్, భూపేష్‌గుప్తా రాశారని చెప్పబడే

నోట్స్ నుంచి ఉల్లేఖనా పరంపర ఇవ్వడం ప్రారంభించారాయన 1960 మాస్కో సమావేశానికి హాజరైన సి. పి. ఐ. ప్రతినిధివర్గంలో సభ్యులయిన ఆ ఇరువురు మాస్కో ప్రకటన పై విభిన్నమైన వ్యాఖ్యలు రూపొందించారని చెప్పడానికి ఆయన అలా ఉల్లేఖనలు వినిపించాడు. అయితే ఇది రుజువు చేస్తున్నదేమిటి ?

వ్యాఖ్యానానికి లేక అవగాహనకు సంబంధించిన యీ విభేదాలు, మాస్కో డాక్యుమెంట్ల స్థూలమైన పరిధికి లోబడేవున్నాయి. వారు వాటిని సవరించడానికి ప్రయత్నించలేదు. చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖలో చేసినట్లుగా వీరు (కీ॥ శే॥ అజయ్‌ఘోష్ కీ॥ శే॥ భూపేష్) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి తమ సొంత ప్రత్యామ్నాయ సాధారణ పంథాను ప్రతిపాదించలేదు. చైనా పార్టీ లేఖ ప్రచురింపబడ్డాక కూడా సజీవులుగా వున్న శ్రీ భూపేష్‌గుప్తా ఆ అప్రతిష్టాకర లేఖను బలపరచకపోవటమేకాక దానిని గట్టిగా ఖండించారు కూడా.

మేమిలా ప్రశ్నించవచ్చా. చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖను సి. పి. ఐ (ఎం) నాయకులు ఎలా బలపరచారు ? మాస్కో డాక్యుమెంట్లను బలపరుస్తున్నట్లు ఒక చెంపన నటిస్తూనే మరొకవైపు వారు అదే వైఖరికి ఎలా అంటిపెట్టుకుని వున్నట్లు ? "చైనా కమ్యూనిస్టు పార్టీ లేఖను మేము ఎక్కువ భాగం బలపరుస్తున్నామని" ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్‌గారు 1983 లో చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుల ముందు ఎలా ప్రకటించగలిగారు ? చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ, మాస్కో డాక్యుమెంట్లు – ఇవి అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమానికి ప్రత్యామ్నాయ సాధారణ పంథాలను ప్రతిపాదించివుండగా సి. పి. ఐ. (ఎం) నాయకులు అటు వానినీ ఇటు వీటినీ రెండింటినీ ఎలా బలపరచగలుగుతున్నట్లు ?

సి. పి. ఐ. (ఎం) నాయకుల మార్కు మార్క్సిజం – లెనినిజం అన్నది లెనిన్ నిర్వహించిన "అతివాద రివిజనిజమే" అన్న మన సూత్రాన్ని సూర్జిత్ వాదనలు స్పష్టంగా నిరూపిస్తున్నాయి వారు మార్క్సిజం – లెనినిజంలోని ఒక ధోరణికి ప్రాతినిధ్యం వహిస్తారు. మార్క్సిజం – లెనినిజంకు వారు వ్యతిరేకులు. "అతివాదం" దిశనుంచి వారు మార్క్సిజం – లెనినిజంను సవరించడానికి ప్రయత్నిస్తారు. అలా చెయ్యడంలో విఫలమయ్యే పక్షంలో వారు తమ విధానాన్ని "మార్చు" తారు. తమ మౌలికమైన పిడివాద ధోరణికి, ఒంటెత్తు పోకడలకూ స్వస్తి చెప్ప కుండానే లెనిన్ అన్నట్లు "రోజు వారీ ఘటనలకు, సంకుచిత రాజకీయాల మార్పు, కూర్పులకూ అనుగుణంగా తమ విధానాన్ని "మార్చు"తారు.

అందుచేతనే, సి. పి. ఐ (ఎం) సైద్ధాంతిక రాజకీయ పంథాను కమ్యూనిస్టు వుద్యమానికి బాహ్యమైందిగా మనం చిత్రించడం లేదు. ఈ పంధాకు వ్యతిరేకంగా మనం ఐక్యంగా నిర్విరామ పోరాటం కొనసాగించే మాట వాస్తవం. మార్క్సిజం-లెనినిజం, శ్రామికవర్గ అంతర్జాతీయత, మాస్కో డాక్యుమెంట్లపట్ల నిబద్ధత, 1963 జూన్ 14 లేఖలో రూపుదాల్చిన మావోయిజంను నిర్ద్వంద్వంగా తిరస్కరించడం అనే సూత్రబద్ధ ప్రాతిపదిక పై కమ్యూనిస్టు వుద్యమం చివరకు ఏకీకరణ చెందాలని మనం అంటున్నది అందుకే.

సి.పి ఐ. (ఎం) నాయకులకు ధైర్యమే వుంటే, విశ్వాసమే వుంటే, చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖకు తమ మద్దతును వుపసంహరించుకున్నామని ప్రకటన చేయమనండి, సోదర కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీలపైన ముఖ్యంగా సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీపైన తాము కురిపించిన నిరాధార ఆరోపణలను నిందలను, వుపసంహరించుకున్నామని ప్రకటించ మనండి చూద్దాం అలా ప్రకటిస్తే వారు అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ ప్రధాన స్రవంతిలోకి తిరిగిరావడానికి అది వుపకరిస్తుంది.

★★

# సోవియట్ పార్టీ 20 వ మహాసభ ప్రాధాన్యత

సి. పి. ఐ. ప్రధాన కార్యదర్శి, సి.పి.ఐ. ప్రతినిధివర్గ నాయకులు కామ్రేడ్ అజయ్‌ఘోష్ 1960 నవంబరులో మాస్కోలో జరిగిన కమ్యూనిస్టు, వర్కర్స్‌పార్టీల అంతర్జాతీయ సమావేశంలో ప్రసంగిస్తూ ఈ క్రింది వ్యాఖ్యలు చేశారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి, సి.పి. ఎస్. యు. 20 వ మహాసభకు గల ప్రాముఖ్యతను వివరించే వాక్యాలను ముసాయిదా ప్రకటన నుంచి తొలగించాలని కోరుతూ చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం ప్రవేశపెట్టిన సవరణపై ప్రసంగిస్తూ కామ్రేడ్ అజయ్‌ఘోష్ యీ క్రింది వ్యాఖ్య చేశారు.

భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గంలో సభ్యులైన ఎస్. ఎ. డాంగే, భూపేశ్‌గుప్తా, ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్, పి. రామమూర్తి, ఆనాడు అజయ్‌ఘోష్ చేసిన ప్రసంగాన్ని సంపూర్ణంగా ఆమోదించారు. అజయ్‌ఘోష్ వ్యాఖ్యలు యివి :

"సి. పి. యస్. యు 20 వ మహాసభ చరిత్రాత్మక నిర్ణయాల బ్రహ్మాండమైన ప్రాముఖ్యం సి.పి.ఎస్ యు. కే కానీ సోవియట్ యూనియన్‌లో కమ్యూనిజం నిర్మాణానికే కాని పరిమితమైలేదు; ఆచారిత్రాత్మక నిర్ణయాలు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో నూతన దశను ఆవిష్కరించాయి; మార్క్సిస్టు లెనినిస్టు పంథాపై ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమాన్నిమరింత అభివృద్ధిపరచాయి. కామ్రేడ్ మావోసేటుంగ్, చైనా కమ్యూనిస్టుపార్టీకి చెందిన ఇతర నాయకులు యీఅంశాన్నే పునరుద్ఘాటించారు.

"ప్రస్తుతం చర్చింపబడుతున్న ముసాయిదా ప్రకటన నిజానికి నూతన దశను వివరిస్తుంది.

"సి.పి.యస్ యు. తాలూకు 20 వ మహాసభ 21 వ మహాసభ ప్రాముఖ్యతకు సంబంధించిన వాక్యాలను తొలగించడానికి ప్రయత్నించే చైనా కామ్రేడ్ల సవరణతో, యీ పరిస్థితులలో మేము అంగీకరించలేక పోతున్నాము".

ఆ తర్వాత 1960 డిశెంబరు 31 న జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి యీ ప్రసంగాన్ని ప్రతినిధివర్గం కృషిని ఆమోదించింది.

# భూపేష్‌గుప్తా సూటి ప్రశ్న

1960 మాస్కో ప్రకటనలోని కొన్ని ప్రతిపాదనలపై గల విభేదాలను ప్రస్తావిస్తూ, 1963 జూన్ 14 నాటి చైనా కమ్యూనిస్టుపార్టీ లేఖ పట్ల సి.పి.ఐ. (ఎం) నాయకులకు గల అవగాహనే భూపేష్ గుప్తాకు కూడా వుండిందని సి పి.ఐ. (ఎం) పొలిట్ బ్యూరో సభ్యులు హరికిషన్ సింగ్ సూర్జిత్ సూచనప్రాయంగా ఆరోపించారు. అదృష్టవశాత్తూ యిదే సమస్యపై వివిధ సందర్భాలలో భూపేష్ రాసిన వ్యాసాలు మన దగ్గరున్నాయి. 1980 ఆగస్టులో భూపేష్ రాసిన వ్యాసంలోని కొన్ని వాక్యాలను యీ క్రింద ఇస్తున్నాము.

సి.పి ఐ. కి వ్యతిరేకంగా వక్రీకరణలు, నిందా ప్రచారం, అబద్ధాలు కుమ్మరిస్తూ 1980 జులై 27 న పీపుల్స్ డెమోక్రసీలో సూర్జిత్ రాసిన రాతలను ఎండగట్టుతూ భూపేష్ ఇలా అన్నారు :

"అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ప్రత్యామ్నాయ సాధారణ పంథా అనబడే దానిని ప్రతిపాదిస్తూ సి.పి.యస్.యు. కేంద్ర కమిటీకి చైనా కమ్యూనిస్టుపార్టీ రాసిన లేఖను మేము ప్రస్తావించాం. మాస్కో అంతర్జాతీయ సమావేశాల 1957 ప్రకటనను 1960, ప్రకటనను ఆ లేఖ పూర్తిగా విరాకరిస్తున్నది.

"ఆ అపఖ్యాతికరమయిన లేఖలో, శాంతియుత సహజీవనం, శాంతియుత పోటీ, శాంతియుత పరివర్తన. అనే సమస్యలపై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఉమ్మడి వైఖరులను మావోయిస్టు నాయ

కులు వక్రీకరించారు. అపభ్రంశం చేశారు. తమ ప్రత్యామ్నాయ సాధారణ పంథాను చెల్లుబాటు చేయించుకోడానికి, తమ చీలిక కార్యకలాపాలను మరింత పెంచుకోడానికి వారు అలా చేశారు.

ఈ సమస్యలపై చైనా కమ్యూనిస్టుపార్టీ తీసుకున్న వైఖరితోనే తమ వైఖరి ఎక్కువ భాగం ఏకీభవించిందని" సూర్జిత్ ఒప్పుకున్నారు. అయితే ఆ మావోయిస్టు వైఖరులకే తాము ఇప్పటికీ కట్టుబడి వున్నదీ లేనిదీ మాత్రం ఆయన చెప్పారు కాదు....

1962 ఆగస్టులో హైద్రాబాదులో జరిగిన జాతీయ సమితి సమావేశం, సి.పి.ఎస్.యు. 22 వ మహాసభపై ఒక తీర్మానాన్ని ఏకగ్రీవంగా ఆమోదించింది. ఆ తీర్మానంలో పైన చెప్పిన ముఖ్యమైన సమస్యలపై పార్టీ అవగాహన సంక్షిప్తంగానే అయినా స్పష్టంగా వ్యక్తం చేయడం జరిగింది. మేము గట్టిగా ఆ అవగాహనకే కట్టుబడి వున్నాం 1963 జూన్ 14 నాటి చైనా పార్టీ లేఖలో వ్యక్తం చేసిన మావోయిస్టు నాయకుల అవగాహనను నిరాకరిస్తున్నాం."

"అప్పట్నుంచి మార్క్సిస్టు-లెనినిస్టు లందరూ మావోయిస్టు వైఖరులను పూర్తిగా ఖండించారు, నిరాకరించారు. ఈనాడు సూర్జిత్ గారూ, ఆయన పార్టీ వైఖరి ఏమిటో తెలుసుకోవడం ఆసక్తికరంగా ఉంటుంది."

భూపేష్‌గుప్తా ప్రశ్నకు సూర్జిత్ ఇప్పుడైనా సమాధానం ఇస్తారా?

# కమ్యూనిస్టుపార్టీ చీలికకు కారణం పిడివాదం, ఒంటెత్తు ధోరణి

— ఇంద్రదీప్ సిన్హా

హరికిషన్‌సింగ్ సూర్జిత్‌గారు 'పీపుల్స్ డెమోక్రసీ' లో రాసిన అర్థం పర్థం లేని సుదీర్ఘమైన వ్యాసంలో మహా విజయగర్వంతో యిలా సెలవిచ్చారు: "భారత కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక అన్నది బయటి జోక్యం ఫలితం కాదనీ, అప్పటి ఐక్య భారత కమ్యూనిస్టుపార్టీలో దశాబ్దం పాటు సాగిన పార్టీ అంతరంగిక పోరాటం అంతిమ ఫలితం అదనీ పై వివరణవల్ల స్పష్టమవుతున్నది. దీనిని సవాలు చేయడానికి ఎవరూ సాహసించలేరు." (ఆగస్టు 18, 1985)

మేము ఈ సవాలును స్వీకరించక తప్పదు. ఒకవైపు సత్య సంరక్షణకూ, మరొకవైపు కమ్యూనిస్టుల్లో విప్లవకర నీతి సూత్రాల పునఃస్థాపనకు మేమీ సవాలును స్వీకరించక తప్పదు.

సూర్జిత్‌గారి ప్రధాన ప్రతిపాదనను పరిశీలించడానికి ముందు ప్రాథమిక పరిశీలన జరపాలని వాంఛిస్తున్నాము. చీలికకు దారితీసిన అంతరంగిక పోరాటం సాగిన ఖచ్చితమయిన వ్యవధి గురించి సి.పి.ఐ. (ఎం) నాయకులకు, ఏకీకృత అవగాహన ఉన్నట్లు లేదు. వారు ఈ వ్యవధి విషయమై వివిధ సందర్భాలలో కనీసం మూడు రకాల వాదనలు వినిపించారు. కాగా కొంతమంది తమ సంకుచిత రాజకీయాలకు అనుగుణంగా ఆ వ్యవధి విషయమై రెండు రకాల వాదనలు వినిపించారు.

ఉదాహరణకు జాతీయ, అంతర్జాతీయ పరిస్థితిపై ఖచ్చితమైన విశ్లేషణకోసం 20 ఏళ్ళపాటు జరిపిన పోరాటం ఫలితమే తమ పార్టీ కార్యక్రమమని బర్ద్వాన్‌లో జరిగిన కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశం తీర్మానం పేర్కొంది. సైద్ధాంతిక సమస్యపై ఆ తీర్మానాన్ని ఆమోదించారు" (సైద్ధాంతిక సమస్యపై వైఖరి-పుట 115)

1963 లో ఇ.యం. యస్. నంబూద్రిపాద్ కూడా దాదాపు ఇదే విధమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఆయన ఇలా అన్నారు : "ముఖ్యమైన సైద్ధాంతిక సమస్యలపై తీవ్రమయిన స్వభావంగల పార్టీ అంతరంగిక పోరాటం 1947 లో

అధికారం బదలాయింపునకు ముందునాటి మాసాలనుంచి కొనసాగుతూనే వున్నది" (భారత కమ్యూనిస్టుపార్టీలో రివిజనిజం, పిడివాదం-పుట 15)

ఇంత తీవ్ర స్వభావంగల పార్టీ ఆంతరంగిక పోరాటం అన్నది ఎందుకు చీలికకు దారితీయలేదు అన్న ప్రశ్నకు సమాధానం ఇవ్వజాలని నంబూద్రిపాద్, సూర్జిత్ ఇరువురు కూడా పార్టీ చీలికకు దారితీసిన ఆంతరంగిక పోరాటం దశాబ్దం కాలం నాటిదే అన్నారు. అనగా 1954 నుంచి 1964 వరకు మాత్రమే అది సాగిందన్నారు.

సి. పి. ఐ. (ఎం) నాయకుల దురదృష్టమేమో కానీ సరిగ్గా రెండేళ్ళ క్రితమే సూర్జిత్ వారికొక విధంగా ద్రోహం చేశారు చైనా కమ్యూనిస్టుపార్టీతో "పార్టీ గత" సంబంధాలను పునరుద్ధరించుకున్న అనంతరం సి.పి.ఐ. పై కొత్త వాగ్వివాదం ప్రారంభిస్తూ ఆయన వారికి ఆ విధంగా ద్రోహం చేశారు. పాలక పార్టీ వెంట పయనం సాగించాలని వాదించే వారికీ యీ వర్గ సాంకర్య పంథాను వ్యతిరేకించే వారికీ మధ్య అర్ధదశాబ్దంపాటు సాగిన పోరాటం ఫలితమే పార్టీ చీలిక కాదేమో పార్టీ పురావత్ర భాండాగారం పరిశీలించి తెలుసుకోవలసిందిగా" మాకు ఆయన సూచించారు.

వాస్తవానికి యీ రెండు దశలూ దేనికదే సి.పి ఐ. (ఎం) నాయకత్వంలోని ప్రత్యేక ధోరణికి సంకేతం వంటిది 1947-49 నాటి ధోరణేమో పార్టీ రెండో మహాసభ సిద్ధాంతపు ఒంటెత్తు పోకడ దుస్సాహసిక పంథాయొక్క అవశేషాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. ఆతర్వాత తలెత్తిన ఎత్తుగడల పంథానాటి 1954-1964 ధోరణేమో 1950 జూన్ కేంద్ర కమిటీ ఎత్తుగడల పంథా తాలూకు, పార్టీ కార్యక్రమం తాలూకు 1951 ఎత్తుగడల పంథా తాలూకు పిడివాద, ఒంటెత్తు పోకడ అవశేషాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. 1959-64 ధోరణేమో మావోయిస్టు పంథా అవశేషాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. మావోయిస్టు పంథా 1959 నుంచి పార్టీ నాయకత్వంలోని ఒక విభాగాన్ని అధికాధికంగా ప్రభావితం చేయసాగింది. ఈ మూడు పిడివాద, ఒంటెత్తు పోకడ ధోరణుల సమ్మేళనమే సి.పి ఐ. (ఎం) నాయకత్వం. అందుకే వివిధ ధోరణులు పార్టీ చీలిక కారణాలకు సంబంధించిన విభిన్న "సత్యాలను" వెల్లడిస్తున్నాయి. సి.సి.ఐ, సి.పి.ఐ. (ఎం) మధ్య వివాదం చెలరేగినప్పుడల్లా అలా చేస్తున్నారు.

"తన సుదీర్ఘమైన "వివరణ" ద్వారా సూర్జిత్‌గారు యీ క్రింది ప్రధాన ప్రతిపాదనను వ్యవస్థాపించడానికి ప్రయత్నించారు; "అంతిమంగా సి. పి. ఐ. చీలికకు దారితీసిన, దశాబ్దకాల పోరాటం అన్నది వర్గ సాంకర్యపంథా, దానిని వ్యతిరేకించే వర్గ పోరాట పంథా మధ్య సాగిన పోరాటమే."

అయితే సి. పి ఐ. (ఎం) నాయకులను ఇలా ప్రశ్నించవచ్చు: అదే వాస్తవమైతే చీలిక సృష్టించడానికి ముందు వారు ఎందుకని 10 నుంచి 20 యేళ్ళ పాటు ఆగారు ?

వారి యీ వాదన సైద్ధాంతికంగాకానీ, వాస్తవాల నిరూపణ దృష్ట్యా కానీ సక్రమమైందికాదు. భారత కమ్యూనిస్టుపార్టీ నాలుగవ మహాసభకు (1956) సమర్పించిన నిర్మాణ నివేదిక స్పష్టీకరించినట్లు పోరాటం రెండు పంథాల మధ్య కాదు, అది మూడు పంథాలమధ్య పోరాటం. ఆ నిర్మాణ నివేదికలో యిలా అన్నారు.

"నెలపాటు సాగిన చర్చ అనంతరం 1955 జూన్ నాటి కేంద్ర కమిటీ సమావేశం మెజారిటీ నిర్ణయంతో రాజకీయ తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానమూ, దానిపై సాగిన చర్చలూ కలిసి పార్టీలో దాదాపు మూడు ఖచ్చితమైన గ్రూపుల అవతరణకు దారితీశాయి. ఆ తీర్మానాన్ని బలపరిచేవారి మధ్య, వ్యతిరేకించే వారి మధ్య తీవ్రమైన రాజకీయ పోరాటం అన్నది పార్టీ అంతరంగిక జీవితంలో ప్రధాన లక్షణంగా తయారైంది (తీర్మానాన్ని వ్యతిరేకించే వారు "అతివాదులు"గానూ "మితవాదులు" గానూ చీలిపోయారు)".

ఆశ్చర్యకరమైన విషయం యేమిటంటే, విభేదాల విస్తృతిని గురించి కేంద్ర కమిటీలోనూ, పొలిట్‌బ్యూరోలోనూ తలెత్తిన సంక్షోభం గురించి వివరిస్తూ సూర్జిత్‌గారు ఆ నివేదిక నుంచి మరి రెండు పేరాగ్రాపులు ఉటంకించారే కానీ అసలు పేరాగ్రాపును మాత్రం వదిలేశారు. ఈ మూడు ధోరణుల వునికిని తెలిపే పేరాగ్రాపును ఆయన వదిలేశారు.

## మూడు ధోరణులు

1955 జూన్ కేంద్ర కమిటీ తీర్మానంపై పార్టీ అంతరంగిక చర్చను క్రమబద్ధం చేయడానికిగాను విడుదల చేయబడిన "పార్టీ వేదిక"ను సూర్జిత్ ప్రస్తావించారు. కేంద్ర కమిటీ తీర్మానంపై భవానీసేన్ చేసిన "విమర్శ"ను కూడా ఆయన ఉటంకించారు. "వేదిక-2" రూపంలో యిది ప్రచురింపబడింది. అయితే ఆయన ఒక వాస్తవాన్ని మాత్రం దాచిపెట్టారు.

తమ పార్టీ సభ్యులు తెలుసుకోకుండా దానిని ఆయన దాచి పెట్టారు. భవిష్యత్తులో యేర్పడనున్న సి.పి ఐ (ఎం) కు చెందిన అయిదుగురు నాయకులు తమ "సొంత" ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానాన్ని నివేదించిన వాస్తవాన్ని ఆయన దాచిపెట్టారు. ఈ ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానం "వేదిక - 4" రూపంలో ప్రచురింపబడింది. కాగా "వేదిక-5" లో దానిపై వచ్చిన "వివ

రణ పూర్వకపత్రం" ప్రచురింపబడింది. ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానంపై సంతకాలు చేసిన వారు శ్రీయుతులు పి సుందరయ్య. ఎం. బసవపున్నయ్య. హరికిషన్‌సింగ్ సూర్జిత్, ఎన్. ప్రసాదరావు. ఎం. హనుమంతరావు. తను సొంతంగా సంతకం చేసిన యీ పత్రాల విషయం సూర్జిత్ "మరచిపోయారంటె" నమ్మడం అసాధ్యం.

నాలుగవ మహాసభ సందర్భంగా బయట పడినటువంటి, తిరిగి అయిదవ మహాసభలోను, ఆరవ మహాసభలోను వ్యక్తమైనటువంటి ఆ మూడు ధోరణులు పార్టీ చీలిక దాకానూ చీలిన తర్వాత కొంత కాలం పాటూను తమ వునికిని కొనసాగించాయి. 1983లో సూర్జిత్ అల్లిన కట్టుకథలకు సమాధానమిస్తూ మేము స్పష్టం చేసినట్లుగా పార్టీ ఆరవ మహాసభలో (1961) మూడు రాజకీయ తీర్మానాలు వచ్చాయి ఒకటి కేంద్ర కమిటి మెజారిటీ తీర్మానం, రెండు-"అతివాదుల" తీర్మానం మూడు-ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ తీర్మానం.

ఈ మూడు ధోరణుల పుట్టుపూర్వోత్తరా లేమిటి? స్వరూప స్వభావాలేమిటి? నాలుగవ మహాసభకు సమర్పించిన నిర్మాణ నివేదికలో పేర్కొన్నట్లు, ఒకరు "అతివాదం" నుంచి కేంద్రకమిటీ మెజారిటీ తీర్మానంపై దాడి చేస్తే, మరొకరేమో "మితవాదం" నుంచి దాడిచేశారు. అయితే "అతివాద" ధోరణి "మితవాద" ధోరణి రెండూ కూడా మైనారిటీ ధోరణులే. నాలుగవ మహాసభ నుంచి ఆరవ మహాసభ దాకా ఏ మహాసభలోనూ అవి పార్టీ ఆమోదం పొందలేక పోయాయి.

అయితే కేంద్ర కమిటీలోని (ఆ తర్వాత జాతీయ సమితిలోని) స్థూలమైన మెజారిటీ సభ్యులు ఖచ్చితమైన మార్క్సిస్టు-లెనినిస్టు ధోరణికి ప్రాతినిధ్యం వహించారనడం సరికాదు. దేశంలోని రాజకీయ పరిస్థితిపట్ల ఉన్నంతలో ఖచ్చితమైన అవగాహన "మధ్యేమార్గ" ధోరణికి వుండిందని చెప్పవచ్చు. ఆ ధోరణే అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమ పంథాకు కూడా కట్టుబడి వున్నది.

ఏర్పడనున్న సి పి. ఐ. (ఎం)కు చెందిన నాయకులు యీ మెజారిటీ ధోరణికి వ్యతిరేక గా పోరాడుతూ వుండినారు. వారు పిడివాద. ఒంటెత్తుపోకడ వైఖరి నుంచి పోరాటం చేస్తూ వుండినారు. అని • నిస్సంశయంగా "వర్గపోరాటమే' కానీ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా శ్రామికవర్గం జరిపే పోరాటంకాదు. ఎందుచేతనంటే సరైన మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం నుంచి జరిపిన పోరాటం కాదిది."
"మితవాద ధోరణి కూడా పెట్టిబూర్జువావర్గం యొక్క సిద్ధాంతానికి, రాజకీయాలకు ప్రాతినిధ్యం వహించింది.

ఉదాహరణకు "అతివాద" ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానంపై రూపొందించిన వివరణాత్మక పత్రం యిలా పేర్కొన్నది. "ఈ అంశాలను, ఇంకా తదితర అంశాలను, ప్రాతిపదిక చేసుకుని, మేము భారతదేశపు రాజ్యాంగ యంత్రాన్ని పరాధీన అర్ధవలస రాజ్యంగా వర్గీకరించాము. ఆ మేరకు సంపూర్ణ విముక్తికోసం పరిపూర్ణ జాతీయ స్వాతంత్ర్యంకోసం బ్రిటీష్ సామ్రాజ్యవాదానికీ, దేశంలోని వారి నేస్తాలకు వ్యతిరేకంగా పోరాటం వగైరా కర్తవ్యాలను నిర్ధారించాం". (వేదిక-5. పుట-5)

తమలో నుంచే బయల్దేరిన అధికాధిక అతివాదుల నుంచి సవాలు ఎదురయ్యేసరికి, కొన్నేళ్ళ తర్వాత పొలిట్‌బ్యూరో పై ప్రతిపాదన "అతివాదపు పొరపాటు" అని ఒప్పుకొనక తప్పలేదు. "ఆంధ్ర కామ్రేడ్లకు లేఖ"లో వారు ఈ క్రింది విధంగా అన్నారు. (బర్ద్వాన్ ప్లీనమ్ తర్వాత ఆ లేఖను విడుదల చేశారు. 1968లో):

"1947-55 దశలో మనపార్టీ ప్రపంచ వ్యాపితంగా వచ్చిన పెద్ద, కొత్త మార్పులను దృష్టిలోకి తీసుకోవటంలో విఫలమైంది. కొత్తగా సాధింపబడిన భారతదేశపు జాతీయ స్వాతంత్ర్యం అర్ధాన్నీ, ప్రాముఖ్యాన్నీ పాత చట్రంనుంచే అంచనా వేయడానికి ప్రయత్నించి, భారతదేశపు స్వాతంత్ర్యాన్ని నామమాత్రమైనదిగా, దగా స్వాతంత్ర్యంగా వర్గీకరించింది; రాజకీయ స్వాతంత్ర్యం దృష్ట్యా నీ, జాతీయ స్వాతంత్ర్యం దృష్ట్యా కానీ భారత దేశానికున్న కొత్త హోదాను తిరస్కరించింది. ఆ విధంగా "అతివాదపు" పొరపాటు చేసింది. (పుట-9).

ఇక్కడొక ఆసక్తికరమైన అంశం గమనించాలి. 1954-55లో వీరు పార్టీలోపల అతివాద, ఒంటెత్తు ధోరణిగల గ్రూపుగా పనిచేస్తూ వుండేవారు అయితే వారు ఆ పార్టీని "మన పార్టీ" అన్నారు. వాస్తవానికి "మన పార్టీ" అనబడే వీరి పార్టీ 1964లో చీలిక తర్వాతనే కదా యేర్పాటైంది.

మరో ఆసక్తికరమైన అంశంకూడా వుంది. 1968లో తమ సొంత పొలిట్‌బ్యూరోయే "అతివాదపు పొరపాటు" అని అంగీకరించిన దానిని ఇప్పుడు 1985లో సూర్జిత్‌గారు మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం నుంచి సరైన "వర్గపోరాటం" అని ట్యాముకు వేసి మరీ చెప్తున్నారు. తన వాగ్వివాద అవసరాలకు అనువుగా ఎదాపెడా వాయించగలననీ తమ వాదనలోని సారాన్ని ఇతరులెవరూ గ్రహించలేరని సూర్జిత్ అనుకుంటున్నారు.

సిద్ధాంతాలనూ, రాజకీయాలనూ, సూర్జిత్ గందరగోళ పరచడమేకాదు; ఆయనగారు వాస్తవాలను అణచివేస్తున్నారు; వక్రీకరిస్తున్నారు. ఉదాహరణకు "శాంతి, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యంతో కూడిన ప్రభుత్వం" అనే ప్రతిపాద

నను మొదట చేసింది పి. సి. జోషి నాయకత్వంలోని యు. పి. రాష్ట్రసమితికి చెందిన పదిమంది సభ్యులుకాదు. ఆ ప్రతిపాదన చేసింది పి. రామమూర్తి ఇప్పుడు ఆయన సి. పి ఐ (ఎం) పొలిట్‌బ్యూరో యొక్క "విప్లవకర" సభ్యులు. కామ్రేడ్ రామమూర్తి వ్యాసాన్ని యు. పి డాక్యుమెంటు హర్షించింది "జాతీయ వేదిక" అనే ఆయన పిలుపును హర్షించింది కూడా యు. పి. డాక్యుమెంటే. భారత ప్రభుత్వ విదేశాంగ విధానంలో పెరుగుతున్న ప్రగతిశీల దిశపట్ల ఆ డాక్యుమెంటు స్పష్టమైన, సానుకూలమైన దృక్పథాన్ని సూచించింది కాబట్టి వారలా హర్షించారు.

సూర్జిత్ మరో వాస్తవాన్ని కూడా అణచిపెట్టారు.

ఈ పదిమంది డాక్యుమెంటుకు వ్యతిరేకంగా డాక్టర్ జడ్ ఎ అహ్మద్, కాశీశంకర్‌శుక్లా నాయకత్వంలోని యు. పి. రాష్ట్ర కమిటీకి చెందిన పదకొండు మంది సభ్యులు మరొక డాక్యుమెంటు ప్రతిపాదించారు కాగా కేంద్ర కమిటీ రామమూర్తి వ్యాసాన్ని, పదిమంది డాక్యుమెంటును వెంటనే తిరస్కరించింది. రామమూర్తి వ్యాసంపై కేంద్ర కమిటీ తీర్మానం ఇలా ఉంది: "కామ్రేడ్ రామమూర్తి తన వ్యాసం ద్వారా, అనగా 1954 జూలై 18న న్యూఏజ్‌లో ప్రచురింపబడిన వ్యాసంద్వారా వెల్లిబుచ్చిన ఇవ్వదల్చుకున్న శాంతి-స్వాతంత్ర్యాలకోసం జాతీయ వేదిక అనే భావన పూర్తిగా దోషభూయిష్టమైనది"

నాలుగవ మహాసభ (1956) అనంతరం సోవియట్ పత్రిక "న్యూటైమ్స్"లో ప్రచురింపబడిన రూబెన్‌స్టీన్ వ్యాసాన్ని సూర్జిత్ ప్రస్తావించారు పార్టీ విధానం గురించి మళ్ళీ చర్చ ప్రారంభించే ఉద్దేశంతో కొంతమంది "మితవాద" కామ్రేడ్లు ఆ వ్యాసం ప్రచురణను వాడుకోడానికి ప్రయత్నించారని చెప్పడానికి ఆయన ఆ విషయం ప్రస్తావించారు.

దానికి జవాబు రాసింది. అజయ్‌ఘోష్ కానీ "అతివాద" కామ్రేడ్లు కాదు. అజయ్‌ఘోష్ వ్యాసం "న్యూటైమ్స్"లో ప్రచురింపబడింది.

అయితే బ్రిటీష్ కమ్యూనిస్టు నాయకులు రజనీ పామీదత్ వ్యాసం గురించి సూర్జిత్‌గారు ఎందుకనో మౌనం పాటించారు పామీదత్ వ్యాసం "ఫార్ ఏలాస్టింగ్ పీస్, ఫార్ పీపుల్స్ డెమోక్రసీ" అనే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ పత్రికలో ప్రచురితమైంది. 1954 సెప్టెంబరు సంచికలో అది అచ్చయింది. పార్టీ ప్రధాన కార్యదర్శి అజయ్‌ఘోష్ కేంద్ర కమిటీ హెడ్ క్వార్టర్సులో లేనందువల్ల హెడ్ క్వార్టర్స్‌లోని కొంతమంది అతివాద కామ్రేడ్లు యీ అవకాశాన్ని వినియోగించుకుంటూ ఒక రకమైన కుట్ర లాటిది చేశారు. రజనీ పామీదత్ వ్యాసాన్ని పొలిట్‌బ్యూరో నిరాకరించిందని తెలుపుతూ పార్టీ యూనిట్లకు వారు

టెలిగ్రాములు పంపారు. ఆ "నిరాకరణను" ఆమోదించడానికి కేంద్రకమిటీ సమావేశాన్ని ఏర్పాటు చేశారు.

అయితే పామీదత్ వ్యాసాన్ని తిరస్కరించడాన్ని సమర్థించే పొలిట్‌బ్యూరో ముసాయిదా తీర్మానాన్ని కేంద్ర కమిటీ నిరాకరించింది. కేంద్ర కమిటీ అలా ఎందుకు చేసినట్లు? పామీదత్ వ్యాసంలో పేర్కొనబడినటువంటి వలస, పరాధీన ప్రజల జాతీయ విముక్తి పోరాటంలోని నూతన లక్షణాలను గుర్తించడానికి పొలిట్ బ్యూరో లోని అతివాదులు నిరాకరించారు కాబట్టి.

సూర్జిత్‌గారి ప్రతి కల్పిత కథను నిరాకరించడానికి గాను సుదీర్ఘ వివరణ యిచ్చే ఉద్దేశం గాని పార్టీ డాక్యుమెంట్ల నుంచి సుదీర్ఘ ఉల్లేఖనలు యిచ్చే ఉద్దేశం కానీ మాకులేదు. పార్టీ రికార్డుల ప్రాతిపదికపై సత్యాలను సంక్షిప్తంగా వివరించవచ్చు.

అతివాద కామ్రేడ్ల అవగాహన పూర్తిగా ఒంటెత్తు పోకడతోనూ పిడివాదంతోనూ కూడుకుని వున్నది కాబట్టి సూర్జిత్‌గారి ఆరోపణ అషామాషీగా, నిరాధారమైందిగా కొట్టివేయవచ్చు. అనేక సమస్యలపై 1955 జూన్ కేంద్ర కమిటీ తీర్మానం "వర్గ సాంకర్య వైఖరి" చేపటిందనీ అట్టి వైఖులను "అతివాదుల" ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానం సరిదిద్దిందని ఆయన ఆరోపణ. ప్రతి పరిణామాన్ని తమ వక్రీకృత పట్టిక నుండి దర్శించే ఒంటెత్తు ధోరణిగలవారికి, పిడివాదులకూ ఉచితమైన వైఖరులు సైతం "వర్గసాంకర్య ధోరణులు"గానే కనిపిస్తాయి.

సూర్జిత్‌కు స్వభావ రీత్యాగల ఒంటెత్తు ధోరణి మూలంగా, మితవాదులు నివేదించిన ప్రత్యామ్నాయ తీర్మానంలోని వైఖరిని ఆయన వక్రీకరించారు. 1957 ఎన్నికల సమీక్ష విషయమై కేంద్ర కమిటీ అన్నట్లు ఆ తీర్మానంలో యిలా ఉంది: "అంగీకృత ప్రగతిశీల విధానాలను అమలుపరచడానికి కాంగ్రెస్ లోపలి, కాంగ్రెస్ వెలుపలి ప్రజాతంత్ర వాదులకు ప్రాతినిధ్యం ఉండే జాతీయ ప్రజాతంత్ర మిశ్రమ ప్రభుత్వ నినాదాన్ని కొంతమంది కామ్రేడ్లు ముందుకు తెచ్చారు." (పుట 33).

సూర్జిత్‌గారు యీ వైఖరిని వక్రీకరించారు మొత్తం కాంగ్రెస్‌తో మిశ్రమ ప్రభుత్వం అన్న పిలుపును తీర్మానం ప్రతిపాదించిందన్న అభిప్రాయం సృష్టించేలా ఆయన దానిని వక్రీకరించారు. కాంగ్రెస్‌లోని ప్రజాతంత్రవాదులతో మిశ్రమ ప్రభుత్వం అనే నినాదాన్ని సైతం నాలుగవ మహాసభ తిరస్కరించింది. అది అవాస్తవికమైందనీ, సంస్కరణవాద భ్రమలను అది సృష్టిస్తుందని నాలుగవ మహాసభ పేర్కొంది.

1957 ఎన్నికల సమీక్షపై కేంద్ర కమిటీ వైఖరిని కూడా సూర్జిత్ వక్రీకరించగలిగారంటే ఆశ్చర్యంగా వుంది. ఆయన అందులోని కొన్ని వాక్యాలను ఆమోదపూర్వకంగా ఉటంకిస్తూనే, 'మితవాద' ధోరణిని సరిగా విమర్శిస్తూనే ఆయన అలా వక్రీకరించారు. ఉదాహరణకు ఎన్నికల ఎత్తుగడల్లో ఒంటెత్తు వాదంపై వచ్చిన విమర్శను పాల్ఘాట్ మహాస కు ముందున్న ఒంటెత్తు- పిడివాద ధోరణిని ఆయన పీపుల్స్ డెమోక్రసీ పాఠకుల కళ్ళబడకుండా కప్పిపుచ్చారు. కేంద్ర కమిటీ ఎన్నికల సమీక్షలో ఇలా స్పష్టం చేశారు.

"మునుపటి దశకు చెందిన ఒంటెత్తు వైఖరి, ఎత్తుగడల సంధాను అవలంబించివుంటే, మనపార్టీకి ఇప్పుడు ఎన్నికల్లో వచ్చిన విజయాలు లభించి ఉండేవి కావనడం స్పష్టం" (పుట-32)

1957 ఎన్నికలపై అజయ్‌ఘోష్ ఇచ్చిన నివేదికలో "అతివాదుల"పై వున్న విమర్శను కూడా తమ శ్రేణుల కళ్ళపడకుండా సూర్జిత్ దాచారు. అజయ్‌ఘోష్ ఇలా అన్నారు: "పిడివాదానికి వ్యతిరేకంగా నిర్దిష్టమైన పోరాటం జరపాలన్నదే ముఖ్యమైన నిర్ధారణ. చాలా కాలంగా పిడివాదం అన్నది పార్టీకి పట్టిన పీడగా ఉంటున్నది."

"సి.పి.ఎస్.యు. 20 వ మహాసభ సూత్రీకరణలను ఆమోదించడానికి కేంద్ర కమిటీ మెజారిటీ సభ్యులు తిరస్కరించారని ఆరోపించడం ద్వారానూ, 1956 మార్చిలో స్టాలిన్‌పై కేంద్ర కమిటీ తన సొంత తీర్మానాన్ని ఆమోదించిందని ఆరోపించడం ద్వారానూ సూర్జిత్ కేంద్ర కమిటీ వైఖరిని వక్రీకరించారు. ఈ తీర్మానం శీర్షిక "సి.పి.ఎస్.యు. 20 వ మహాసభపై". అంతే కానీ పూర్తిగా స్టాలిన్‌పైనే ఆ తీర్మానం శీర్షికకేమీ. సోవియట్ ప్రజలకేకాక సకల దేశాల కార్మిక ప్రజలకు సర్వ ప్రగతిశీల ప్రపంచానికే బ్రహ్మాండమైన ప్రాముఖ్యంగల ఘటన అది" అని ఆ తీర్మానం సి. పి. ఎస్. యు. 20 వ మహాసభను హర్షించింది.

ఈ తీర్మానం తర్వాత పాల్ఘాట్ మహాసభ కూడా 20 వ మహాసభపై తీర్మానాన్ని ఆమోదించింది. సి.పి.ఎస్.యు. 20 వ మహాసభ "మహత్తర ప్రాముఖ్యం గల ఘటన అని ప్రశంసించింది. వక్రీకరణలు అసలు సత్యాన్ని దాచి పెట్టలేవు.

'క్రమపరివర్తన' అనే సంస్కరణవాద భావనను 'రివిజనిస్టులు' ప్రచారం చేస్తున్నారని సూర్జిత్ ఆరోపించారు కేరళ రాష్ట్ర కమిటీ ముందుకు తెచ్చిన "కేరళమార్గం" అనే నినాదం అట్టి సంస్కరణవాద భావనకు ప్రతీక అన్నారు. ఇది నిజంగా సంస్కరణవాద భావనే. అయితే నినాదం యిచ్చింది ఎవరు? కేంద్ర

కమిటీ మెజారిటీ ఆ వినాదం ఇవ్వలేదు నాలుగవ, అయిదవ, ఆరవ మహాసభలకు ఇచ్చిన నివేదికలలో అజయ్‌ఘోష్ యీ క్రమ పరివర్తన భావనను నిశితంగా ఖండించారు. ఈ వినాదాన్ని మొట్టమొదట ముందుకు తెచ్చింది. ఇ. ఎం. ఎస్. నంబూద్రిపాద్ నాయకత్వంలోని కేరళ రాష్ట్ర కమిటీయే. రుచించని యీ సత్యాన్ని సూర్జిత్ దాచారు. 1959 లో పి. సి. జోషీ, ఎస్. ఎ. డాంగేలు చేసిన కొన్ని సంస్కరణవాద సూత్రీకరణలను ప్రస్తావిస్తూ ఇలాంటి సంస్కరణవాద భావాలు ఒక ధోరణికి చెందిన కార్యకర్తలకు మాత్రమే పరిమితమయ్యాయన్నట్లు ఆరోపించ దానికి సూర్జిత్ ప్రయత్నించారు. అయితే యిది సత్యం కాదు.

ఉదాహరణకు 1959 లో జాతీయ సమితికి సమర్పించిన ముసాయిదా రాజకీయ తీర్మానంలో శ్రీ బసవపున్నయ్య "నెహ్రూ నాయకత్వంలోని ప్రభుత్వంపట్ల సరైన రాజకీయ వ్యూహాత్మక పంథాను"ను అవలంబించడం అవసరమని వాదించారు. ఆయన ఇలా వాదించారు. "యీ సమయంలో ముఖ్యమైన సమస్య, తాను చేపట్టిన పంథాలో నెహ్రూ ప్రభుత్వం ముందుకెళ్ళేలా దానిపై వత్తిడి తేవడం కాదు; ఆ మార్గాన్ని సంపూర్ణంగా వదిలివేసి, మితవాద ప్రగతి నిరోధకులకు లొంగిపోయే ప్రమాదం నుండి ఆ పంథాను కాపాడడమే." అందుచేత "స్వతంత్ర, జనసంఘ్, పి.ఎస్.పి నాయకత్వంలోని మితవాద ప్రగతి నిరోధకత్వానికి వ్యతిరేకంగా మన దాడిని ఎక్కుపెట్టాలని" బసవపున్నయ్య వాదించారు. ఒకేసమయంలో అటూ ఇటూ పోరాటం అని అమృత్‌సర్ మహాసభ (1958) రూపొందించిన విధానానికి బసవపున్నయ్య సూచించిన ఎత్తుగడల పంథా పూర్తిగా వ్యతిరేకమైంది.

మరో ఉదాహరణ తీసుకుందాం. "ఉత్పత్తిని పెంచాల్సిన ఆవశ్యకతను, ప్రజానీకంలోని ఏ విభాగమూ అధికాధికంగా వినిమయం చేయడాన్ని నిరాకరించాల్సిన ఆవశ్యకతను" ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్ నొక్కి చెప్పారు. 1957 ఆఖరు ప్రాంతంలో కేంద్ర కమిటీకి రాసిన లేఖలో ఆయన పైవిధంగా నొక్కి చెప్పారు.

అందుచేత "పారిశ్రామిక ప్రశాంతత" కావాలనీ, అనగా సమ్మెలపైనా లాకౌట్లపైనా నిషేధం ఉండాలని వేతనాల, జీతాల పెంపుదలపై పరిమితి విధించాలని" ఆయన వాదించారు. కిసాన్ సభలు, విద్యార్థి సంఘాలు, యువజన సంఘాలు, మహిళాసంఘాలు అన్నీ కూడా సహకార సంఘాలకు, పంచాయితీలకు, సమాజవికాస కార్యక్రమాలకూ, జాతీయ విస్తృతి సేవలకు, యువక సమాజాలకూ, మహిళాసమాజాలకూ తమ దృష్టిని మళ్ళించాలని ఆయన సలహా యిచ్చారు. తీవ్రమైన రాజకీయ, సైద్ధాంతిక విభేదాల మూలంగా పార్టీలో తీవ్ర సంక్షోభం వున్నదని చెప్పడానికి గాను అయిదవ మహాసభ (1958) కు సమర్పించబడిన నిర్మాణ నివేదికనుంచి

అనేక పేరాగ్రాపులను సూర్జిత్ ఉటంకించారు. ఈ సంక్షోభానికి కారణం "రివిజ నిజం వెల్లువే" అని తెలపడానికి కూడా ఆయన ప్రయత్నించారు.

## సూర్జిత్ పద్ధతులు

అయితే ఒక ముఖ్యమైన పేరాగ్రాపును ఉటంకించకపోవటం ద్వారా ఆయన సత్యాన్ని అణచిపెట్టాడు. ఆ పేరాగ్రాపు యిది: "వివిధ రూపాల్లో రివిజనిస్టు భావాలు పార్టీలో పాతుకుపోయాయి. వాటి పక్కనే పిడివాదమూ వుంది. అనగా కొన్ని మౌలిక సూత్రాలను వల్లించడమూ, పరిస్థితిలోని మార్పులను గుర్తించాలంటే, పట్టు విడుపులతో కూడిన ఎత్తుగడలను అవలంబించాలంటే భయమూ, అలా చేసినట్లయితే సంస్కరణ వాదాన్ని పెంచుతుందన్న వాదనతో భయపడడమూ."

పైన తెలిపిన వాస్తవాలను పరిశీలించినట్లయితే, 1954-59 మధ్య పార్టీలో సాగుతూ ఉండిన అంతర్ పోరాటం- సూర్జిత్ వాదించినట్లు వర్గ పోరాట పంథాకు, వర్గ సాంకర్య పంథాకు మధ్య కాదన్న నిర్ధారణ అనివార్యంగా వస్తుంది. పైపెచ్చు, అది మూడు పంథాల మధ్య పోరాటం. అటు "మితవాదులు" ఇటు అతివాదులు మాత్రమేగాక ఈ ఇరువురి దాడికి గురయ్యే కేంద్ర కమిటీ మెజారిటీ పంథా అన్నది మూడవ పంథా.

సత్యాన్ని అణచివేసి, అసత్యాన్ని సూచించే సూర్జిత్ పద్ధతి అన్నది పిడివాద, ఒంటెత్తు పోకడ స్వభావంలోని సత్యాన్ని దాచిపెటలేదు. అలాంటి పిడివాద ఒంటెత్తు పోకడకు సూర్జిత్, ఆయన అనుచరులు ప్రాతినిధ్యం వహించారు. అలాటి ధోరణి విప్లవ ధోరణి కాజాలదు. ఎందుచేతనంటే దానిని ప్రతిపాదించిన వారు సి.పి.ఐ. నుంచి చీలిపోయి ప్రత్యేక పార్టీని ఏర్పాటు చేసుకున్నారు కదా.

కొన్ని అంతర్జాతీయ పరిణామాల మూలంగానూ, జాతీయ పరిణామాల మూలంగానూ, పిడివాద, ఒంటెత్తు ధోరణి గ్రూపునకు చెందిన కామ్రేడ్లు 1964లో తెగించి సి.పి.ఐ. నుండి విడిపోయి సి.పి.ఐ (ఎం) ను ఏర్పాటు చేసుకున్నారు. ఆ అంతర్జాతీయ, జాతీయ పరిణామాల గురించి వచ్చే వ్యాసంలో చర్చిద్దాం.

10 లేక 20 ఏళ్ళుగా మాత్రమే కాదు, అది అవతరించినప్పట్నుంచీ సి. పి. ఐ. లో ఆంతరిక విభేదాలు వుంటూ వచ్చాయి. అయితే ఆ విభేదాలు చీలికకు దారితీయలేదు; 1964 నాటి తీవ్ర రూపమూ దాల్చలేదు. 1964 లో పార్టీ చీలికకు ప్రేరకంగా పనిచేసిన అంశాన్ని గురించి వచ్చే వ్యాసంలో పరిశీలిద్దాం. ★

# సి. పి. యం రాజకీయ నైతికత!

మార్క్సిజం సర్వశక్తివంతమైంది. ఎందుచేతనంటే అది సత్యమైంది కాబట్టి అని లెనిన్ ఒకసారి అన్నారు సి.పి.ఐ (ఎం) నాయకులు తమ సొంత శైలిలో "మార్క్సిజం"ను అభివృద్ధి చేసుకున్నట్లుంది. వారి మార్క్సిజం ప్రకారం నాయకులు గనక పదే పదే అబద్ధాలను వల్లించినట్లయితే అబద్ధాలు కూడా సర్వశక్తివంతమవుతాయి. సి.పి.ఐ (ఎం) నాయకులు సి. పి. ఐ. పై ప్రారంభించిన ప్రతివాద వివాదం సందర్భంగానూ అదే నిందను పదే పదే వల్లించడం ద్వారా వారు యిందుకు తిరుగులేని నిదర్శన చూపించారు.

సి.పి.ఐపై ప్రారంభించిన తాజా నిందాపూర్వక దాడి సందర్భంగా సి.పి.ఐ. (ఎం) పొలిట్ బ్యూరో సభ్యులు హరికిషన్‌సింగ్ సూర్జిత్, జాతీయ సమితి మెజారిటీని కేంద్ర కార్యవర్గ కమిటీని నిందించారు.

1962 లోనూ, 1965 లోనూ కమ్యూనిస్టుల అరెస్టు పట్ల జాతీయ సమితి మెజారిటీ, కేంద్ర కార్యవర్గమూ "ప్రతిస్పందించ" లేదని ఆయన ఆరోపించారు. ఆయన యిలా దారుణంగా ఆరోపించారు. "పార్టీలోని ఒక భాగంపై ప్రభుత్వం దాడి జరిపితే. నిరసన ప్రచార ఉద్యమం నిర్వహించడానికి నాయకత్వం నిరాకరించడం ఏ కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో అయినా బహుశా ఇదే ప్రథమ ఉదాహరణ కావచ్చు."

నీచమైన. దుర్బుద్ధితో కూడిన యీ తప్పుడు నిందకు మా సమాధానం ఏమిటంటే మా మునుపటి సమాధానాల నుంచి తిరిగి వుటంకించడమే. ముందు భూపేష్‌గుప్తాతో ప్రారంభిద్దాం. సి. పి. ఐ. (ఎం) నాయకుల నైతికతనే ఆయన ప్రశ్నించారు. ఆయన యిలా స్పష్టం చేశారు :

"1963 ఫిబ్రవరిలో మన జాతీయ సమితి రాజకీయ ఖైదీల విడుదలపై ఆమోదించిన తీర్మానం గురించి సూర్జిత్ మరచిపోయినట్లుంది కమ్యూనిస్టుపార్టీకి చెందిన దాదాపు 750 మంది సభ్యులను విచారణ లేకుండా భారత రక్షణ నిబంధనల ప్రకారం డిటెన్షన్‌లో వుంచడం కొనసాగిస్తున్నందుకు జాతీయ సమితి తీవ్రంగా ఆందోళన వ్యక్తం చేసింది; క్రోధం కూడా వెల్లడించింది."

"ప్రభుత్వాన్ని ఖండించిన అనంతరం, రాజకీయ ఖైదీల విడుదలకై ప్రజోద్యమం నిర్వహించాల్సిందిగానూ వారిని త్వరలో విడుదల చేయించడానికి యీ డిమాండ్‌కు అనుకూలంగా తగిన అన్ని రూపాలలో ప్రజాభిప్రాయాన్ని సమీకరించేందుకు కూడా ప్రజోద్యమం నిర్వహించాల్సిందిగానూ జాతీయ సమితి అన్ని పార్టీ యూనిట్లకు పిలుపు యిచ్చింది."

ఆ వెంటనే జరిగిన పార్లమెంటు బడ్జెట్ సమావేశంలో సి.పి.ఐ. (గూపు విడుదల డిమాండ్‌ను తీవ్రంగా చేపట్టింది. నిజానికి 1962 నవంబరులో అరెస్టు వార్తలు ఢిల్లీకి చేరీచేరగానే మేము ప్రభుత్వం చర్చకు వ్యతిరేకంగా మా గొంతు వినిపించాం. పార్లమెంటు ఉభయ సభల్లోని అధికారిక చర్చలే ఇందుకు సాక్ష్యం!)

"ఇక్కడ మరొక విషయం చెప్పాలి. 1963 ఫిబ్రవరి 1964 జనవరి మధ్య సి.పి.ఐ. జాతీయ సమితి కానీ లేక కేంద్ర కార్యవర్గ కమిటీ కానీ ఆ సమస్యపై నాలుగు తీర్మానాలను ఆమోదించింది. 1963 ఫిబ్రవరిలో, సెప్టెంబరులో, అక్టోబరులో 1964 జనవరిలో ఆ తీర్మానాలు ఆమోదించబడినాయి.

"చీలిక తర్వాత పలువురు సి.పి.ఐ. నాయకులు, సభ్యులు 1965 లో అరెస్టు కాబడినప్పుడు కూడా వారి విడుదలకై సాగిన ప్రచారాందోళనలో అగ్రభాగాన నిలిచింది మన పార్టీయే. ఆ అరెస్టులను సమర్థిస్తూ హోం మంత్రిత్వ శాఖ పార్లమెంటులో ప్రవేశపెట్టిన శ్వేతపత్రాన్ని నిలువునా ఎండగట్టింది పార్లమెంటులోని మన పక్షమే. ఇందిరాగాంధీ ప్రధాని అయ్యాక వారిని విడుదల చేసేదాకా మేము మా ప్రయత్నాలను జయప్రదంగా కొనసాగించాము."

1966 లో బి.టి. రణదివె చేసిన అదే నిందాపూర్వక ఆరోపణకు సమాధానమిస్తూ భూపేష్‌గుప్తా ఇలా అన్నారు: "నిర్బంధించబడినవారి విడుదలకోసం పోరాడడం ద్వారా సి పి ఐ. తన ప్రాథమిక విద్యుక్తధర్మాన్ని మాత్రమే నిర్వహించింది. ఆ పనికి సి.పి ఐ. ఎలాటి కృతజ్ఞతల కోసం ప్రయత్నించదు. అయితే సి పి ఐ. చేసినదానికి ప్రతిఫలంగా రణదివె కనీసం ఇలాటి అవమానకరమైన కంపుకొట్టే నిందాపూర్వక వ్యాఖ్యలు చేసి వుండరాదని రాజకీయ నైతికత ఆదేశిస్తున్నది"

* * *

అదే ఆరోపణకు సమాధానం యిస్తూ శ్రీ పాలీని పరకాల్ 1983 లో యిలా రాశారు: "1962 లో చైనా దాడి అనంతరం, అప్పటి ఐక్య పార్టీలోని ఒక విభాగంపై ప్రభుత్వం జరిపిన దాడిని ఖండించడానికి సి. పి. ఐ నిరాకరించిందని సూర్జిత్ ఆరోపిస్తున్నారు ఇది అసత్యం అసలు వాస్తవా లేమిటి?

"అరెస్టులు జరిగిన అనంతరం రాజ్యసభలో తాను చేసిన ప్రప్రథమ ప్రసంగంలోనే (1962 నవంబరు 8) భూపేష్‌గుప్తా అరెస్టులు పట్ల విచారం వ్యక్తం చేస్తూ కమ్యూనిస్టు నిర్బంధితులను విడుదల చేయాలని డిమాండ్ చేశారు. 1962 నవంబరు 11 నాటి సంచిక న్యూయేజ్‌లో ఆయన ప్రసంగాన్ని ప్రముఖంగా ప్రచురించాం.

"ఆ తర్వాత కూడా కమ్యూనిస్టు నిర్బంధితుల విడుదలకోసం పార్టీ అవిచ్ఛిన్నంగా ప్రచారాందోళన నిర్వహించింది. ఆ సమస్యపై న్యూఏజ్ మొదటి పేజీలో వ్యాసాలు ప్రచురితమయ్యాయి.

దాదాపు అన్ని సంచికల్లోనూ లోపలి పేజీల్లో ఆ డిమాండ్ ప్రతిధ్వనించింది. 1963 ఏప్రిల్ 28 సంచికలో, మే 19 సంచికలో, జులై 21 సంచికలో, అక్టోబరు 13 సంచికలో ఆ డిమాండు ప్రతిధ్వనించింది. జులై 21 సంచికలో డిటెన్షన్‌లు చట్ట వ్యతిరేకమైనవంటూ అలహాబాద్ హైకోర్టు ఇచ్చిన తీర్పును ఉటంకించాము. 1963 అక్టోబరు 13 సంచికలో 'డిటెన్యూలను విడుదల చేయండి' అన్న శీర్షిక అక్షరాలను రెండు అంగుళాల సైజు అక్షరాల్లో ప్రచురించాం."

1964 నవంబరులో బి.టి. రణదివె చేసిన అదే ఆరోపణకు సమాధానంగా పార్టీ ఏడవ మహాసభ (1964 డిసెంబరు) తీర్మానాన్ని ఉటంకించాము. 8 వ మహాసభ రాజకీయ నివేదికను కూడా ఉటంకించాము అరెస్టులు జరిగిన వెంటనే కమ్యూనిస్టు డిటెన్యూల (నిర్బంధితులు) కోసం నడపాల్సిన బలీయమైన ప్రచారాందోళన విషయమై తీసుకోవాల్సిన చర్యల వివరాలను ఆ రాజకీయ నివేదిక రూపొందించింది.

అలా అరెస్టు కాబడిన వారిలో సి.పి ఐ. కి విధేయులైనవారు కూడా వున్న విషయాన్ని సి.పి.ఐ. (ఎం) నాయకులు బుద్ధిపూర్వకంగానే దాచిపెడుతున్నారు. అలా అరెస్టు అయిన వారిలో కా॥ సి. అచ్యుతమీనన్ ఒకరు.

సి.పి ఐ. కి వ్యతిరేకంగా యిలా పనిగట్టుకుని సి.పి ఐ. (ఎం) నిందాపూర్వక ప్రచారం కొనసాగించడం మావోయిజంలోని కొన్ని సూత్రాల పట్ల ఆ పార్టీ నాయకుల కిప్పటికీ నిబద్ధులుగా వున్నారనడానికి మరో ఉదాహరణ.

ఎందుచేతనంటే సి. పి. ఐ నాయకులు నెహ్రూగారి "గూఢచారులని" మొటమొదట ఆరోపణ చేసింది చైనా కమ్యూనిస్టుపార్టీయే అన్న విషయం అందరకూ తెలిసిందే. ఇండోనేషియా కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి టి. ఎస్. ఐడిత్ కూడా అదే నింద వేశారు. సి.పి.ఐ. కి వ్యతిరేకంగా సి. పి. ఐ. (ఎం) శ్రేణుల మనసులను విషపూరితం చేసే వుద్దేశంతో దాదాపు ప్రతి సంవత్సరం సి పి.ఐ. (ఎం) నాయకులు ఈ నిందా ప్రచారం కొనసాగిస్తున్నారు.

తన్ను తాను కమ్యూనిస్టుపార్టీగా చెప్పుకుంటూ నిందలను, అబద్ధాలను తన ఒకానొక ప్రధాన సైద్ధాంతిక-రాజకీయ ఆయుధంగా మార్చుకున్న పార్టీ మరొకటి ప్రపంచంలో ఉన్నదా అని మేము సూర్జిత్‌ను అడగవచ్చా ?" ★

# కమ్యూనిస్టుపార్టీ చరిత్ర "తప్పుల తడక" చరిత్రయా ?

—నరహరి కవిరాజ్

బిపిన్‌చంద్ర సంపాదకత్వంలో వెలువడిన "భారతీయ వామపక్షాలు" అనే గ్రంథంలో భారత కమ్యూనిస్టు పార్టీ మొదటి 30 సంవత్సరాల చరిత్రపై ఒక వ్యాఖ్యానం వెలువడ్డది. ఒక పండిత బృందం ఈ కృషి చేసింది. వారి అధిపతి సుప్రసిద్ధ చరిత్రకారుడైన ప్రొఫెసర్ బిపిన్‌చంద్రగారే. ఈ పండితులందరూ జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయానికి చెందినవారైనందున, వారి సమిష్టి కృషి ఫలితమే ఈ గ్రంథం అని భావించవచ్చు.

పార్టీ చరిత్రకు ప్రాధాన్యమిచ్చిన వ్యాసాలు ఈ క్రింది విధంగా వున్నాయి.

1) రైతు-కూలీ పార్టీలు (1926-30)

—ఆదిత్య ముఖర్జీ

2) నెహ్రూ, వామపక్ష గ్రూపుల ఆవిర్భావం (1927-29)

—శశిజోషి

3) జాతీయవాదం, మూడో అంతర్జాతీయ సంస్థ భారత కమ్యూనిస్టులు (1934-39)

—భగవాన్ జోషి

4) కమ్యూనిస్టుపార్టీ-పాకిస్తాన్ ఉద్యమం

—శ్రీ ప్రకాశ్

5) సంక్షోభంలో పడిన వ్యూహం-కమ్యూనిస్టుపార్టీలో చర్చ

—బిపిన్‌చంద్ర

ఈ పరిశోధక పండితులందరూ తమ అన్వేషణ ఫలితంగా ఒక సత్యాన్ని కనుగొన్నారట అదేమంటే భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర, తప్పుల తడక చరిత్ర–అని. పార్టీ తన సాధారణ విధానాన్ని అనుసరిస్తూ, అక్కడక్కడ తప్పులు చేసిందని వీరంటున్నారా, అంతేకాదు. ఇంతకంటె కఠినమైన తీర్పు ఇస్తున్నారు. ఈ దేశంలో మార్క్సిజాన్ని అమలుజరపటంలో కమ్యూనిస్టుపార్టీ ఘోరంగా విఫలమైందనే నిర్ణయానికి వారు వచ్చారు. ఈ వైఫల్యానికి మూలకారణం ఏమిటా అని వారు వెతుకుతున్నారు. తన సుదీర్ఘ వ్యాసంలో ప్రొఫెసర్ బిపిన్‌చంద్ర ఈ మూల కారణాన్ని ఇలా చెబుతున్నాడు. అభివృద్ధి ఇంత స్వల్పంగా ఎందుకున్నది అనేది సమస్య. ప్రజలలోను, వేరు వేరు జీవిత విభాగాలలోను, పార్టీ నాయకత్వ పాత్ర ఇంత తక్కువగా ఎందుకున్నది" (259–260) అని వీరు ప్రశ్నిస్తున్నారు. ఈ మౌలిక ప్రశ్నకు చారిత్రక వ్యాఖ్యానం ఇవ్వటమే, ఈ గ్రంథ రచన పరమార్థమని సంపాదకులు అంటున్నారు.

## నెహ్రూ ప్రశంస

కాగా, ఈ సమస్యను వస్తుగతంగా, నిరావేశంగా చర్చించిన సూచన ఈ గ్రంథంలో ఎక్కడా లేదు. గ్రంథంలో హెచ్చు భాగం నెహ్రూ ప్రశంసతోనే సరిపోయింది.

నిజానికి ఈ గ్రంథానికి కేంద్ర బిందువు నెహ్రూ. కమ్యూనిస్టుపార్టీని బోషిలాగా బోనులో నిలబెట్టారు. భారత రాజకీయాలలో నెహ్రూ పాత్రను, కమ్యూనిస్టు పాత్రను పోల్చి వీరు ఒక నిర్ణయానికి వచ్చారు. దూరదృష్టికి ఎంతగా నెహ్రూ చిహ్నమో, కమ్యూనిస్టుపార్టీ అంతగా అపరిపక్వతకు తార్కాణం అని.

ఈ గ్రంథంలో మూడు వ్యాసాలు 1926–39 సంవత్సరాల మధ్య నెహ్రూ నిర్వర్తించిన పాత్రను సుదీర్ఘంగా చర్చించాయి. ఈ చర్చలో ప్రధానమైన పరిశీలనా పద్ధతికి బిపిన్‌చంద్ర నాంది పలికారు ఆయన దృష్టిలో పై దశ నెహ్రూ జీవితంలో "అత్యంత మార్క్సిసు భావప్రేరిత విభాగం" "అతని వామపక్ష పార్శ్వానికి గ్రీష్మఋతువు" (జవహర్‌లాల్ నెహ్రూ, పెట్టుబడిదారీ వర్గం 1936, ఆధునిక భారతదేశంలో జాతీయవాదం, వలసవాదం–బిపిన్‌చంద్ర. 171 పేజీ)

గురువుగారి అడుగుజాడల ననుసరించి, మిగతా పరిశోధకులందరూ వంత పాడారు. భారత స్వాతంత్ర్య లీగును, రిపబ్లికన్ కాంగ్రెసును, ఇతర అభ్యుదయ శక్తులను సన్నిహితం చేయటం ద్వారా, నెహ్రూ కాంగ్రెసు లోపల వామపక్ష గ్రూపును నిర్మించటానికి తీవ్ర కృషి చేశాడు (18–19, 59–60 పేజీలు)

ఈ పరిశోధకులు ఇంకా ఇలా అంటున్నారు. ఈ దశలోనే నెహ్రూ కార్మిక, కర్షక పార్టీ కార్యకర్తలకు, (వీరిలో హెచ్చుమంది కమ్యూనిస్టులు) సహకారాన్ని అందించాడు. వామపక్ష కాంగ్రెసువాదులైన, నెహ్రూ. తదితర తీవ్ర వాదులు అందించిన ఇలాంటి సహాయం ఫలితంగా, నూతనంగా ఏర్పడిన కార్మికోద్యమానికి నాయకులుగా కమ్యూనిస్టులు ముందుకు రావటానికి అవకాశాలు మెరుగయ్యాయి (24 పేజీ)

ఇదే సమయంలో నెహ్రూ భారత జాతీయ కాంగ్రెసుకు, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఏర్పడిన అంతర్జాతీయ లీగుకు మధ్య సంబంధం ఏర్పరచడానికి కృషి చేశాడని కూడా వీరంటున్నారు.

కనుక వీరి వాదన ఏమంటే, నెహ్రూగారి ప్రోత్సాహంతో వామపక్ష, కమ్యూనిస్టు శక్తుల ఐక్యతపై ఆధారపడిన వామపక్ష ధోరణి, కాంగ్రెసు ఉద్యమంలో క్రమేపీ బలపడసాగింది అని.

ఇంతటితో వీరు ఆగలేదు. నెహ్రూ ఆ రోజులలో కేవలం వామపక్షవాదిగానే ఉండిపోలేదు. నిజాయితీ గల మార్క్సిస్టు మేధావిగా రూపొందసాగాడు. ఈ పరిశోధకులలో ఒకరు ఇలా అంటున్నారు.

"ఆ కాలంలో నెహ్రూను మరే ఇతర మార్క్సిస్టుతో సమానమైనస్థాయిలోనైనా చెప్పవచ్చును. (69 పేజీ) ఈ పరిశోధకురాలు యింకా యిలా అంటున్నది. "సామ్రాజ్య వ్యతిరేక ప్రజా పోరాటాన్ని సమైక్యంగా నిర్వహిస్తూనే, అదే సమయంలో సోషలిజంవైపు మొగ్గుచూపడానికి మార్గదర్శకుడైన ఏకైక జాతీయ నాయకుడు నెహ్రూ ఒక్కడే." (65 పేజీ) అనగా నెహ్రూ "విప్లవ ప్రజాస్వామ్య పంథాను" లేక "సోషలిజం వైపు ఉన్ముఖమైన మార్గాన్ని" ఆవిష్కరించాడు. (56, 74-76 పేజీలు)

వలస దేశాల పోరాటంపై లెనిన్ ప్రతిపాదించిన సూత్రాల సారాంశాన్ని నెహ్రూ సరిగ్గా గ్రహించాడని తన స్వంత మార్గంలో భారత పరిస్థితులకు దానిని వర్తింపచేయటానికి ప్రయత్నించాడని (56 పేజీ) ఈ పరిశోధకుల నిశ్చితాభిప్రాయం."

ఈ పరిశోధ పండితుల ఆరోపణ ఏమంటే-తన మార్క్సిస్టు విశ్వాసాలననుసరించి నెహ్రూ కాంగ్రెసు ఉద్యమం లోపల నిజమైన వామపక్ష గ్రూపును నిర్మించటానికి ప్రయత్నిస్తుండగా కొమింటర్న్ సూచన మేరకు కమ్యూనిస్టులు సంకుచితమయిన ఒంటెత్తు పోకడను అనుసరించి, కుహనా వామపక్షవాది, బూర్జువా వర్గపు ప్రచ్ఛన్న ఏజంటు అని, నెహ్రూను నిందించారు. తమ దాడికి నెహ్రూను కేంద్రంగా చేశారు. (64)

వారి వాదనలు ఈ క్రింది విధంగా సాగుతాయి.

ప్రారంభ దశలో కార్మిక, కర్షక పార్టీ కార్యక్రమాలు కాంగ్రెసు సంస్థలోనే కొనసాగాయి. నెహ్రూ తదితర వామపక్షవాదులతో కలిసి ఈ కార్యకలాపాలు సాగాయి. కొమింటర్న్ ఆదేశాల మేరకు, కార్మిక, కర్షక పార్టీని రద్దుచేసి, స్వతంత్రంగా కమ్యూనిస్టుపార్టీని ఏర్పరచారు. బోల్షివిక్ పార్టీ నమూనాలో కమ్యూనిస్టు పార్టీని, కాంగ్రెసుకు వెలుపలగా ప్రారంభించటంవల్లనే (బోల్షివిక్ పార్టీ స్వభావంలోనే పిడివాదమున్నది), జాతీయోద్యమంలో అంతర్భాగంగా వామపక్షవాదుల ఏకీకరణ జరగకుండా ఆగిపోయింది.

జాతీయ విమోచనకై ఆనాడు పోరాడుతున్న శక్తుల ముందు రెండు ప్రత్యామ్నాయాలున్నాయి. ఒకటి నెహ్రూ నమూనా జాతీయ వాదానికి సోషలిజంతో సంలీనం చేసే మార్గం, రెండొకటి జాతీయవాదానికి పోటీగా కమ్యూనిస్టు నమూనా సోషలిజం పతాకను ముందుకు తీసుకుపోవటం (62–62, 199–200)

ఆనాటి పరిస్థితులలో నెహ్రూ నమూనా వాస్తవమైనది, ఆచరణాత్మకమైనది. సోషలిస్టు నమూనా, సామ్రాజ్య వ్యతిరేకోద్యమంపై సోషలిస్టు విప్లవ భావాలను రుద్దటానికి జరిగిన యత్నం, జాతీయోద్యమానికి పోటీగా కమ్యూనిస్టు ఉద్యమాన్ని పెంపుచేయాలనుకోవటం. ఇది పూర్తిగా అవాస్తవికం, యాంత్రికం. ఆనాటి పరిస్థితులలో పూర్తిగా తప్పు (61–62)

* * *

1947 తర్వాత భారత రాజకీయాలలో నెహ్రూ పాత్రను అంచనావేసే కష్టతరమైన బాధ్యతను కూడా బిపిన్‌చంద్ర చేపట్టాడు. సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధాన సాధారణ సంక్షోభ దశలో, జాతీయ బూర్జువావర్గం, బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని పరిపూర్తి చేయలేదనే భావన పూర్తి పిడివాదం. స్వాతంత్ర్యానంతర భారతదేశంలో కమ్యూనిస్టులు ఈ వాదన చేశారు. నెహ్రూ తన జీవితంలో సాధించిన విజయాలే పై వాదన తప్పు అని నిరూపించాయి. (388–389)

బిపిన్‌చంద్ర అంచనా ప్రకారం 1947 లో రాజ్యాధికారం బ్రిటిష్ వలసవాదుల చేతుల్లోనుండి నిజమయిన సామ్రాజ్య వ్యతిరేకోద్యమ నాయకులైన బూర్జువా వర్గం చేతులలోనికి సంపూర్ణంగా మారింది. కేవలం రాజకీయాధికారం మాత్రమే మారిందని, ఆర్థిక విమోచన రాలేదని భావించటం పొరపాటు. ఈ మార్పు ప్రాధాన్యత ఇంకా ఉంది" ఇదొక నిర్ణయాత్మక ఘటన.

వలసవాదం నిర్మూలనమై, వలస వ్యతిరేక బూర్జువా ప్రజాతంత్ర విప్లవం పరిపూర్తి అయ్యే సందర్భంలో అనివార్యంగా జరిగే నిర్ణయాత్మక ఘటన"

(349 పేజీ) వలస, అధీన దేశాలలో జరిగే రెండు విప్లవాలపై లెనిన్ ప్రవచనాలను ఆధారంగా చేసుకుంటే, బూర్జువా ప్రజాతంత్ర విప్లవ దశ, నాటితో పూరయినట్లుగానే భావించాలి. భారతదేశంలో 1947 అగస్టు 15, రష్యాలో 1917 ఫిబ్రవరి విప్లవంతో సమానం నెహ్రూ ప్రభుత్వం సాధించిన సానుకూల విజయాలేవంటే, కమ్యూనిస్టుపార్టీ లేవనెత్తిన అనేక అంశాలను కాలక్రమేణా నెహ్రూ ప్రభుత్వం నెరవేర్చింది. సోషలిస్టు స్వభావం గల కోర్కెలను మాత్రమే అది తీర్చలేమి. ఏ బూర్జువా ప్రభుత్వమూ ఆ పని చేయలేము (281 పేజి)

కాపిటల్ గ్రంథంలో మార్క్స్ ప్రస్తావించిన ప్రమాణాల దృష్ట్యా చూసినా, ఏ ఇతర బూర్జువా ప్రభుత్వం, నెహ్రూ ప్రభుత్వం అంత అభ్యుదయకర పాత్ర నిర్వర్తించింది అని బిపిన్‌చంద్ర ప్రశ్నిస్తున్నాడు.

ఆ దశలో నెహ్రూ ప్రభుత్వానికి కమ్యూనిస్టులు విమర్శనాత్మక తోడ్పాటును ఇచ్చిఉండవలసింది (393) ఈ ప్రభుత్వం పెట్టుబడిదారీ పంథా అవలంబించింది, కనుక ఆ ప్రభుత్వంతో మొత్తంగా ఐక్య సంఘటన విధానాన్ని అనుసరించటం సాధ్యం కాదు. (392) అయినప్పటికీ, ప్రభుత్వం స్వంత పెట్టుబడిదారీ పంథా అనుసరిస్తున్నది. ఇది గుత్త వ్యతిరేక పెట్టుబడిదారీ పంథా (389) భారత పురోగతికి ఇది తోడ్పడ్డది. మొత్తం జాతికి ప్రయోజనకరమైన పెక్కు చర్యలను ప్రభుత్వం చేపట్టింది. దేశంలో నెహ్రూ నాయకత్వం దృఢంగా వేరూనింది. కనుక నెహ్రూ పట్ల కమ్యూనిస్టులు మెతక వైఖరిని ప్రదర్శించి, పూర్తి విప్లవం కొరకు గాక, సంస్కరణలకై పోరాటం చేసి ఉండవలసింది. విమర్శనాత్మక తోడ్పాటు వైఖరి ప్రయోజనకరంగా ఉండేది. (393–394)

వర్తమాన రాజకీయాలనుండి పోలిక చెప్పదలిస్తే, మిటరాండ్ ప్రభుత్వానికి ఫ్రెంచి కమ్యూనిస్టులు తోడ్పాటు ఇవ్వడం లేదా, ఫ్రాన్సులో కమ్యూనిస్టుల నుంచి మిటరాండ్ ఎంత ఆశించాడో, అంతకంటె ఎక్కువగానే, నెహ్రూ ప్రభుత్వం కమ్యూనిస్టులనుండి ఆశించటంలో దోషంలేదు. (394)

నెహ్రూ ప్రత్యేకత ఏమిటి? అని ప్రశ్నించుకుని బిపిన్‌చంద్ర ఇలా సమాధానమిస్తున్నాడు. కమ్యూనిస్టుల ఆలోచనా విధానానికి వ్యతిరేకంగా, సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారీ విధాన సాధారణ సంక్షోభ దశలో సైతం నెహ్రూ బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి సంబంధించిన కొత్త భావనను, నమూనాను దేశం ముందుంచాడు. ఈ నమూనాకు ఈ క్రిందివి ప్రాతిపదికాంశాలు. 1. ఆనాటి పరిస్థితులలో సైతం, జాతీయ బూర్జువావర్గం, నిజమైన స్వతంత్ర పాత్రను, చిత్తశుద్ధితో కూడిన విప్లవకర పాత్రను నిర్వర్తించగల అవకాశం ఉంది. 2 స్వతంత్ర పెట్టుబడిదారీ పంథాను అనుసరించటం ద్వారా, దేశంలోని ప్రజాతంత్ర చైత

న్యాన్ని పరాకాష్ఠకు తీసుకుపోవటం సాధ్యం. 3. యావత్ జాతిపై ప్రభావాన్ని, పెత్తనాన్ని వహించటానికి జాతీయ బూర్జువావర్గానికి అవకాశం ఉంది. పెత్తనం అనే మాటను గ్రామ్చీ (ఇటాలియన్ కమ్యూనిస్టు నాయకుడు) వాడిన అర్థంలో గ్రహించాలి (281_283, 387_396) ఈ ప్రాతిపదికలను పరిశీలించడానికే కమ్యూనిస్టులు నిరాకరించారు. నెహ్రూ రూపొందించిన నమూనాకు ప్రజాదరణ లభించినందుననే అది నిలబడగలిగింది. కమ్యూనిస్టుపార్టీ రూపొందించిన నమూనా భారత పరిస్థితులకు పూర్తిగా అసంగతమైనది. కనుక రాజకీయం గానూ, సైద్ధాంతికం గానూ కూడా, కాలక్రమేణా, కమ్యూనిస్టుపార్టీ, భారత రాజకీయాలలో "నిష్ప్రయోజనకర" స్థితికి వచ్చింది. (391-394)

మార్క్సిజాన్ని సరిగ్గా అర్థం చేసుకోక, తప్పుడు వ్యాఖ్యానం చేసిందని కమ్యూనిస్టుపార్టీని దూషించటంతో బిపిన్‌చంద్ర సరిపుచ్చుకోవటంలేదు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం సైతం మార్క్సిజాన్ని పిడివాద ధోరణిలో వ్యాఖ్యానం చేసిందని ఆరోపిస్తున్నారు. వీరి దృష్టిలో లెనిన్‌సైతం విమర్శలకు అతీతుడు కాదు.

వీరి వాదన ఇలా సాగుతుంది.

కాంగ్రెసు ఉద్యమం, బూర్జువా నాయకత్వంలో నడిచే జాతీయ సంస్కరణవాద ఉద్యమం అనే నిర్వచన చేయటంలోనే, భారత జాతీయోద్యమ స్వభావాన్ని అర్థం చేసుకోవటంలో కొమింటర్న్ విఫలమైంది. "జాతీయ సంస్కరణవాదం" అనే మాటకే వీరు అభ్యంతరం చెబుతున్నారు. కాంగ్రెసు ఉద్యమం సంస్కరణవాద ఉద్యమం కాదు, అది చిత్తశుద్ధి కలిగిన విప్లవోద్యమం. బూర్జువావర్గ నాయకత్వంలో కొనసాగే బూర్జువా ప్రజాతంత్ర విప్లవం అసంపూర్తిగా మిగిలిపోక తీరదు అనే కొమింటర్న్ సూత్రీకరణ, భారతదేశం విషయంలో పూర్తిగా అసంగతమని రుజువైంది. (33-36, 53-54 161-166)

వలసదేశ విప్లవాలపై "లెనినిస్టు మార్గదర్శక సూత్రాలపై" వీరికి కొన్ని అభిప్రాయాలున్నాయి. యం. యన్. రాయ్ పిడివాద భావాలతో లెనిన్ తరచు రాజీపడ్డాడు (1-2). కొమింటర్న్ వలసదేశాల కమిషన్‌లో, యం. యన్ రాయ్ "అనుబంధ ప్రతిపాదనలను" చర్చకు ప్రాతిపదికగా ఆమోదించటంలో లెనిన్ పొరపాటు చేశాడు. అంతేకాదు, యం. యన్ రాయ్ సమర్పించిన సమాచారం ఆధారంగా, కమ్యూనిస్టుపార్టీని ఏర్పరచటానికి భారతదేశంలో పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయని భావించటంలోనే, లెనిన్ పెద్ద పొరపాటు చేశాడు. (42, 157-61, 161-65). లెనినిస్టు మార్గదర్శక సూత్రాలుగా భారత కమ్యూనిస్టులు

భావిస్తున్నవి, లెనిన్, రాయ్ భావనల వికృత కలయిక. కనుకనే, పిడివాద పద్మ వ్యూహం నుండి కమ్యూనిస్టుపార్టీ బైటికి రాలేకపోతున్నది.

మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి చేయటం పేరుతో ఈ పరిశోధకులు, మార్క్సిజాన్ని గురించి, వలస సమస్యపై లెనిన్ సూత్రీకరణలను గురించి కొన్ని ప్రశ్నలను లేవనెత్తుతున్నారు.

కొమింటర్న్ ఆధిపత్యం కొనసాగినంత కాలం, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, పిడివాదం అనబడే, దారీ తెన్నూలేని చీకటి బాటలో చిక్కుబడి పోయింది. స్టాలిన్ సారథ్యంలో మార్క్సిజం సృజనశీల లక్షణాన్ని పూర్తిగా కోల్పోయింది.

"నవీన వామపక్షవాదులు" లేక "యూరో కమ్యూనిస్టులు", ప్రచురించిన గ్రంథాలలోని వాదనలు ఆధారంగా. ఈ పరిశోధకులు కొమింటర్న్‌పై నిశితమైన దాడిని ఎక్కుపెట్టారు. డూషర్ "అసంపూర్ణ విప్లవం" పెర్రీ ఆండర్సన్ "పాశ్చాత్య మార్క్సిజం" క్లాడిన్ "కమ్యూనిస్టు ఉద్యమం" అనే గ్రంథాలు, ఇంకా అలాంటివి, వీరికి "సృజనాత్మక మార్క్సిజం"పై సరికొత్త భావనలను సమకూర్చాయి. నవీన వామపక్ష వాదుల మాటలను మక్కీకిమక్కీ పునశ్చరణ చేస్తున్నారు. కొమింటర్న్ హయాంలో మార్క్సిజం పిడివాదంగా మారిపోయిందని భారతీయ కమ్యూనిస్టులు. యాంత్రికమైన ఆర్థిక వ్యాఖ్యా ప్రధానమైన మార్క్సిజాన్ని, అనుసరించేటట్లు ఆదేశింపబడ్డారని ఈ పరిశోధకుల అభిప్రాయం.

"పాశ్చాత్య మార్క్సిజాన్ని" సోవియట్ తరహా "సాంప్రదాయ మార్క్సిజానికి" పోటీ పెట్టటం, లేక యూరో కమ్యూనిజంలో, సోషలిజం యొక్క మానవతా వాద దర్శనమున్నదనటంలోను, కొత్త వాదన ఏమీలేదు. ప్రస్తుతం పాశ్చాత్య యూరప్‌లో మార్క్సిస్టు మేధావులనబడే వారిలో ఇలాంటి వాదనలు చేయటం, ఒక ఫాషనుగా తయారైంది. కాగా వీరి ప్రత్యేకత ఒక అంశంలో ఉంది గ్రామ్సీ ఆలోచనకు యువ నెహ్రూ సోషలిస్టు భావాలకు పోలికను కనిపెట్టారు. నెహ్రూ భావాలలో పిడివాద ఛాయలు లేనివని వీరి భావన. పాశ్చాత్య మార్క్సిజం అని, యూరో కమ్యూనిజం అని, మానవతా దర్శనం కలిగిన సోషలిజం అని ఇప్పుడు చెప్పబడే వాదనలన్నిటికీ మూలం ఆనాటి నెహ్రూ యొక్క అభివృద్ధి చెందిన భావాలలోనే బీజాలు ఉన్నాయని వీరి విశ్వాసం. వీరు ఇలా అంటున్నారు. "ఆశ్చర్యమేమంటే, ఈనాడు పశ్చిమ యూరప్‌లోని కమ్యూనిస్టుపార్టీలు, ముఖ్యంగా ఇటలీ కమ్యూనిస్టుపార్టీ యొక్క ఆలోచనా మార్గం, నెహ్రూ సూత్రీకరణలు పెక్కింటితో పూర్తి ఏకీభావం కలిగి ఉంది". (76-77)

# లెనినిస్టు మార్గదర్శక సూత్రాలపై వివాదం

వలస జవీన దేశాలలోని విప్లవాలను గురించి లెనినిస్టు మార్గదర్శక సూత్రాలు అనే అంశం పరిశీలించుదాం. ప్రొఫెసర్ బిపిన్‌చంద్ర అభిప్రాయం ప్రకారం భారతదేశంలోని బూర్జువా జాతీయోద్యమాన్ని నిజమైన విప్లవోద్యమం గానే లెనిన్ భావించాడు. కనుకనే, గాంధీజీని విప్లవ నాయకునిగా ఆయన ప్రశంసించాడు (బిపిన్‌చంద్ర, లెనిన్, జాతీయ విమోచనోద్యమం, ఆధునిక భారతదేశంలో జాతీయవాదం, వలసవాదం 1979) దాంతోపాటు ఈ వ్యాస పరిశీలనలో ఉన్న భారతీయ వామపక్షం అనే గ్రంథంలో 33వ పేజీ)

లెనినిస్టు మార్గదర్శక సూత్రాలను అతిగా తేలికపరచే వ్యాఖ్యగా దీనిని భావించాలి.

వలసదేశాల బూర్జువావర్గ పాత్రను గురించి గాంధీజీ పాత్రను గురించి లెనిన్ రాయ్‌ల మధ్య జరిగిన వివాదం, రచయిత మనస్సులో ఉన్నదని స్పష్టమౌతూనే ఉన్నది. వలసదేశ బూర్జువావర్గం తన పాత్రను అప్పటికే పరిపూర్తి చేసిందని రాయ్ భావించగా, దాని పాత్ర ఇంకా పరిపూర్తి కాలేదు అని లెనిన్ భావించాడు.

విప్లవకర శక్తిగా, వలసదేశాల బూర్జువావర్గం యొక్క పాత్ర ఏమిటి? అనే అంశం ఈ వివాదం ద్వారా తలఎత్తే ప్రధాన సమస్య.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవ స్వభావాన్ని గురించి ప్రస్తావిస్తూ లెనిన్ ఇలా అంటాడు.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవం రెండు నమూనాలలో సాగవచ్చు. కాంగ్రెసు నాయకత్వంలో సాగేది ఒకటి, కార్మిక కర్షక నాయకత్వాన సాగేది మరొకటి. "బూర్జువావర్గ నాయకత్వాన సాగే బూర్జువా విప్లవం అసంపూర్తి విప్లవంగానే మిగిలిపోగలదు. (ఉచ్చితంగా చెప్పాలంటే ఇది విప్లవంకాదు సంస్కరణ): కార్మికవర్గం, రైతాంగాల నాయకత్వానసాగే విప్లవమే నిజమైన విప్లవం కాగలదు" (లెనిన్-రష్యన్ విప్లవం యొక్క, పటుత్వం - బలహీనత - 12 వ వాల్యూం 357 వ పేజి).

వలసవాదంపై లెనిన్ సూత్రీకరణలలోని ప్రధాన అంశమూ ఇదే.

లెనిన్ ఇలా అంటాడు :

వలస దేశాలలో విప్లవం సహజంగానే జాతీయ విమోచనోద్యమ స్వభావాన్ని సంతరించుకుంటుంది. అది బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశలో ఉంటుంది.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవ దశను అధిగమించి, సరాసరి సామాజిక విప్లవదశకు పయనించవచ్చునని యం.యన్ రాయి చేసిన వాదనను లెనిన్ వ్యతిరేకించాడు. లెనిన్ ఇలా అన్నాడు: "ప్రతి జాతీయ ఉద్యమం తప్పనిసరిగా బూర్జువా ప్రజాతంత్ర విప్లవంగా ఉంటుంది ఏమంటే వెనుకబడిన దేశాలలో ప్రజలలో అత్యధికులు రైతాంగం, వీరు బూర్జువా పెట్టుబడిదారీ సంబంధాలకు ప్రాతినిధ్యం వహిస్తారు. (వలస సమస్యపై కమిషన్‌కు సమర్పించిన నివేదిక.)

ప్రాచ్య దేశాలలో పనిచేస్తున్న కార్యకర్తల నుద్దేశించి ప్రసంగిస్తూ లెనిన్ ఇలా అన్నాడు: "ఈ ప్రజలలో తప్పనిసరిగా బూర్జువా జాతీయవాదం ప్రజ్వరిల్లుతుంది. అది తప్పనిసరి. చారిత్రకంగా ఇందుకు సమర్థన ఉంది. కనుక ఈ ఉద్యమ పునాదిపై మీరు ఆధారపడాలి" (ప్రాచ్యదేశ ప్రజలలోని కమ్యూనిస్టు సంస్థల అఖిల రష్యన్ రెండవ మహాసభలో ప్రసంగం) అంతేకాదు, జాతీయోద్యమం తొలిరోజులలో బూర్జువావర్గమే నాయకత్వం వహిస్తుంది (లెనిన్— స్వయం నిర్ణయాధికారం కొరకై జాతులహక్కు 20 వ వాల్యూం, 409 పేజి)

అదే సమయంలో, బూర్జువా జాతీయవాదం పాత్రను అతిశయం చేయరాదని లెనిన్ హెచ్చరించాడు. కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ, జాతీయోద్యమాన్ని "కార్మికుల వర్గ పోరాట దృష్ట్యా" పరిశీలించాలి. లెనిన్ ఇలా రాశాడు "పీడితజాతుల బూర్జువావర్గం, దోపిడీదారునికి వ్యతిరేకంగా పోరాడుతుంది కనుక, మేము ఎల్లప్పుడూ, మిగతా వారందరికంటె ఎక్కువగా దోపిడీదారుని వ్యతిరేకిస్తాము కనుక, వారిని బలపరుస్తాము. అయితే, పీడిత జాతుల బూర్జువావర్గం, తన బూర్జువా జాతీయవాద కోర్కెలకే నిలబడుతుంది కనుక, వారిని మేము వ్యతిరేకిస్తాము (అదే పుస్తకం 411-412).

లెనిన్ దృష్టిలో బూర్జువావర్గం పరిమిత దృష్టిలో మాత్రమే విప్లవకర పాత్రను వహిస్తుంది, కాగా వారు, సామ్రాజ్య వ్యతిరేక విప్లవ పరిపూర్తిలో వస్తుగతంగా ఆసక్తి కలిగి ఉన్నారు. కనుకనే వారు జాతీయ పోరాటంలో పాల్గొంటారు. ఆ దృష్ట్యా వారు విప్లవకరపాత్ర నిర్వర్తిస్తారు. కాని వారు అస్థిరమైనవారు. ఏమంటే జాతీయ బూర్జువావర్గం, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాకు అంటిపెట్టుకుని ఉంటారు. వారు అభివృద్ధి నిరోధకులతోను, సామ్రాజ్యవాదంతోను, సామాజిక పోరాటం తీవ్రమైన కొద్దీ, రాజీపడటానికి సిద్ధపడతారు కనుక, వారు సామ్రాజ్య వ్యతిరేక స్వభావం కలిగి ఉన్నప్పటికీ, వారికి ద్వంద్వ స్వభావం ఉంది

ఈ ధోరణి స్వభావం ఏమంటే అది జాతీయవాదం(సామ్రాజ్య వ్యతిరేకం), కాని పూర్తిగా విప్లవకరం కాదు, సంస్కరణవాద పూరితం (లెనిన్ వ్రాసిన వలస దేశాలపై సూత్రీకరణ, మరియు కొమింటర్న్ నాల్గవసభ ఆమోదించిన ప్రాచ్య దేశాలపై సూత్రీకరణ)

కనుక లెనిన్, కమ్యూనిస్టులకు ఇచ్చిన సలహా ఏమంటే, బూర్జువా ప్రజా స్వామ్యానికి షరతులతో కూడిన తోడ్పాటు ఇవ్వవలసిందని సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో జాతీయ బూర్జువావర్గం పాల్గొన్న మేరకు, దానిని కమ్యూనిస్టులు బల పరచటం సరైనదే కాగా కార్మికవర్గం, రైతాంగం అధికాధికంగా జాతియోద్యమంలో పాల్గొనటం ప్రారంభించి, తమ వర్గ పోరాటాన్ని తీవ్రతరం చేసిన కొద్దీ, జాతీయ బూర్జువావర్గ ఊగిసలాటలు తీవ్రతరమౌతాయి (ప్రాచ్యదేశాలపై సూత్రీకరణ పత్రం).

కనుక జాతీయ బూర్జువావర్గంతో కమ్యూనిస్టుల మైత్రి తప్పనిసరిగా తాత్కాలికంగానే ఉంటుంది జాతీయోద్యమంతో కమ్యూనిస్టు ఉద్యమం లీనం కారాదని లెనిన్ హెచ్చరిస్తాడు అన్ని పరిస్థితులలోను, "అతి ప్రాథమిక రూపంలో సైతం, కార్మికోద్యమంయొక్క స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకోవాలి" (వలసల సమస్యపై లెనిన్ ముసాయిదా పత్రం).

అంతేకాదు, ఈ విప్లవదశ బూర్జువా ప్రజాతంత్ర స్వభావాన్ని కలిగి ఉంటి కనుక ఆ పరిమితులనుదాటి కమ్యూనిస్టులు వ్యవహరించరాదు ఆ పరిమితులకు లోబడే, ఉద్యమంలో నూతన స్వభావాన్ని చొప్పించడానికి ప్రయత్నించాలి.

విప్లవ చోదకశక్తులుగా, బూర్జువావర్గానికి, రైతాంగానికిగల వత్యాసాన్ని లెనిన్ స్పష్టంగా పేర్కొన్నాడు తాను ఊహించిన, కొత్తతరహా విప్లవం కార్మిక వర్గం, బూర్జువావర్గాల ఐక్యతపైగాక, కార్మిక, రైతువర్గాల ఐక్యతపై ఆధారపడి ఉండాలని లెనిన్ స్పష్టంగా పేర్కొన్నాడు (31 వ వాల్యూం-555 పేజి)

బూర్జువా ప్రజాతంత్ర మార్గం కంటె భిన్నమైన, విప్లవ ప్రజాతంత్ర మార్గంగా ఇది ఉంటుంది. ఈ విప్లవ ప్రజాతంత్రం, పెట్టుబడిదారీ యేతర పంథాను ఎన్నుకుంటుంది." అభివృద్ధి చెందిన దేశాల కార్మికవర్గం తోడ్పాటుతో, సోవియట్ వ్యవస్థవైపు మొగ్గుచూపుతుంది కొన్ని నిర్దిష్టమైన దశలను అధిగమించి, పెట్టుబడిదారీ దశగుండా పయనించకుండానే, కమ్యూనిజంలోకి అభివృద్ధి చెందుతుంది" (వలస సమస్యపై కమిషన్‌కు ఇచ్చిన నివేదిక).

ఈ విధమైన కొత్తతరహా ప్రజాతంత్ర విప్లవం, అంతర్జాతీయ కార్మికోద్యమంతో మైత్రిని ఏర్పరచుకుంటుంది ఆ విధంగా ప్రపంచ విప్లవ క్రమంలో ఇదొక అవినాభావ శక్తి అవుతుంది

ముగింపుగా చెప్పాలంటే వెనుకబడిన దేశాలలో సైతం, కమ్యూనిస్టులు సామాజిక విప్లవ తాళం చెవులు, బూర్జువావర్గానికి, స్వాధీనం చేయరు. బూర్జువా వర్గ అనుచరవర్గంగా వారు ఉండరాదు. ఏ పరిస్థితిలోను వారు తమ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకుంటూ ఉండాలి.

కనుక జాతీయ బూర్జువావర్గానికి ద్వంద్వ స్వభావమున్నదనే సూత్రీకరణ బూర్జువా జాతీయవాదం, జాతియవాద సంస్కరణవాద స్వభావాన్ని కలిగి ఉందనే సూత్రీకరణ, లెనిన్ ఆలోచనలలోని కీలకాంశాలని స్పష్టం.

## కమ్యూనిస్టు ఉద్యమం – బలం – బలహీనత

ఈ బూర్జువా జాతీయవాదం యొక్క వస్తుగత వ్యక్తీకరణ గాంధేయవాదం. బిపిన్‌చంద్ర, ఆయన అనుచరులు భావించినట్లు, గాంధేయవాదం సర్వసమగ్ర విప్లవకర ధోరణికాదు ఈ వాదన – లెనిన్ బోధనలకు పూర్తిగా వ్యతిరేకమైనది. (ఆధునిక భారతదేశంలో జాతీయవాదం, వలసవాదం. 311-16. ఈ సమీక్షకు ఆధారమైన పుస్తకంలో 164 వ పేజి).

లెనిన్ సూచన మేరకే కొమింటర్న్ ఆధ్వర్యంలో భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ నిర్మాణానికి ప్రయత్నాలు జరిగాయి. 1925 లో అఖిలభారత పార్టీ ఆవిర్భావంతో ఈ ప్రయత్నాలు ఫలించాయి. మొదటి నుండి భారతీయ కమ్యూనిస్టులు, లెనిన్ మార్గదర్శక సూత్రాలనే అనుసరిస్తూ వచ్చారు శ్రమజీవులలో స్వతంత్ర ఆలోచనా మార్గాన్ని రేకెత్తించటానికి ప్రయత్నిస్తూ వచ్చారు. భారత కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలోనే, కార్మికులు, కర్షకులు, జాతీయోద్యమంలో అంతర్భాగంగానే, ఒక స్వతంత్ర శక్తిగా ఆవిర్భవించారు.

కార్మిక కర్షక ప్రయోజనాలకు, తమ ఆలోచనలో ప్రథమస్థానం ఇస్తూ, కమ్యూనిస్టులు జాతియ విమోచనోద్యమం ఎదుట నూతన కార్యక్రమాన్ని, నూతన విప్లవ కార్యకలాపాల పథకాన్ని ఆవిష్కరించారు.

బూర్జువావర్గ నాయకత్వంలోని కాంగ్రెసు ఉద్యమం, ఆవిష్కరించిన నమూనా అసంపూర్ణమైనది. దాని లక్ష్యం రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించటం మాత్రమే. ఇందుకు ప్రతిగా కమ్యూనిస్టులు జాతీయ విమోచనకై ఒక కొత్త నమూనాను ప్రజల ముందుంచారు. ఈ నమూనాలో, రాజకీయ స్వాతంత్ర్యంతో పాటు, తీవ్ర స్వభావంగల భూ సంస్కరణలు ఆర్థిక స్వాతంత్ర్యం, పరిశ్రమల జాతీయకరణ, కార్మికులకు కనీస వేతనంలాంటి కోర్కెలను చేర్చారు. అనగా, బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశ పరిమితులను అధిగమించకుండానే, ఈ కార్యక్రమం, వీలైనంతవరకు, కార్మిక, కర్షక ప్రయోజనాలను అందులో ఇమడ్చటానికి కృషి చేసింది.

కాంగ్రెసు ఉద్యమం, అహింసా పోరాట రూపాన్ని ఆదర్శీకరించింది కాగా కమ్యూనిస్టుపార్టీ శాంతియుత, శాంతేతర పోరాట మార్గాలను మిశ్రితం చేయవలసిందిగా ప్రజలను కోరింది. దేశంలో మొట్టమొదటిసారిగా కార్మికుల సాధారణ

సమ్మె, వర్గప్రాతిపదికపై సమరశీల రైతాంగ పోరాటాలు అనే భావనను ప్రవేశ పెట్టింది.

కాంగ్రెసు ఉద్యమం ప్రవేశపెట్టిన వర్గ పొందికకు భిన్నమైన వర్గ పొందికను కమ్యూనిసు ఉద్యమం, ప్రచారం చేసింది. కాంగ్రెసు ఉద్యమానికి అగ్రభాగాన, జాతీయ బూర్జువావర్గం ఉన్నది. వారి వర్గ ప్రయోజనాల దృష్ట్యానే, కార్మికులను, రైతులను జాతీయోద్యమంలోకి ఆకర్షించాలని వారు ప్రయత్నించారు.

అదే సమయంలో, జాతీయోద్యమంపై కార్మికులు, కర్షకులు తమ పెత్తనాన్ని స్థాపించకుండా వారు నిరంతరం జాగ్రత్తపడుతూనే ఉన్నారు. ఈ వర్గాల విప్లవ చైతన్యాన్ని నిత్యం అదుపులో ఉంచుతూ, బూర్జువా వర్గ ప్రయోజనాలకు వారు లోబడి ఉండేటట్లు చూడటానికి వారు నిరంతరం ప్రయత్నిస్తూనే ఉన్నారు. ఇందుకు ప్రతిగా, కమ్యూనిస్టుపార్టీ, కార్మిక, కర్షక ఐక్యతా నినాదం ఇచ్చింది. ప్రజాతంత్ర విప్లవ పరిపూర్తికై వారి విప్లవకర శక్తియుక్తులను పూర్తిగా బైటికి తీసుకువచ్చింది.

అంతేకాదు. కాంగ్రెస్ ఉద్యమ లక్ష్యం, పెట్టుబడిదారీ అభివృద్ధి పంథా. కమ్యూనిస్టుపార్టీ పెట్టుబడిదారీ యేతర పంథాను ప్రచారం చేసింది. ఈ పంథా పెక్కు మధ్యంతర దశలను అధిగమించిన మీదట, చిట్టచివరకు, సోషలిస్టు దశను చేరుకోవటం సాధ్యం చేస్తుంది.

జాతీయ బూర్జువావర్గ నాయకత్వాన సర్వంసహాధికార, ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను స్థాపించటం కాంగ్రెస్ ఉద్యమలక్ష్యం అందుకు ప్రత్యామ్నాయంగా, కమ్యూనిస్టుపార్టీ విప్లవ ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరచాలనే లక్ష్యం ప్రకటించింది, కార్మిక, కర్షకమైత్రి, ఈ ప్రభుత్వానికి మూలాధారంగా ఉంటుంది.

అంతేకాదు. కాంగ్రెస్ ఉద్యమం జాతీయోద్యమం, కమ్యూనిస్టుపార్టీ, జాతీయ విమోచనా సమస్యను, కార్మికవర్గ అంతర్జాతీయత దృష్ట్యా పరిశీలించింది. కనుక, భారత జాతీయోద్యమం, ఈ అంతర్జాతీయ కార్మికోద్యమంలో అనుబంధం కలిగి ఉండాలని నొక్కిచెప్పింది. ముఖ్యంగా సోవియట్ ప్రభుత్వంతో అన్ని రంగాలలోనూ సహకారం ఉండాలని కోరింది. ఏమంటే, అంతర్జాతీయ కార్మిక వర్గంయొక్క సృజనశీలతకు అత్యున్నత పరాకాష్ఠ సోవియట్ ప్రభుత్వం. నిజానికి, భారతదేశ విముక్తి పోరాటం ఏదో విడివడిన ఘటన కాదని, ప్రపంచ విప్లవ క్రమంతో అవినాభావంగా పెనవేసుకున్న భావన అని, కమ్యూనిస్టుపార్టీ అతి దృఢంగా, పట్టువిడుపులులేకుండా ప్రచారం చేసింది.

లెనినిస్టు మార్గదర్శక సూత్రాలలో మరో అంశం ఉంది. కొమింటర్న్ నాలుగవ కాంగ్రెస్ వరకు ఇది అమలులో ఉంది. బూర్జువా జాతీయ వాదానికి షరతులతో కూడిన తోడ్పాటును ఇస్తూ వారితో కలిసి సామ్రాజ్య వ్యతిరేక ఐక్య సంఘటనను ఏర్పరచడమే ఈ అంశం. కొమింటర్న్ సూచనమేరకు. భారతీయ కమ్యూనిస్టులు, కాంగ్రెస్ లోపలనే ఉంటూ, తమ స్వతంత్ర విధానాన్ని అనుస రించటం ద్వారా, జాతీయ విమోచనోద్యమాన్ని ప్రభావితం చేయడానికి ప్రయ త్నించారు. కాగా లెనిన్ మరణంతో మార్పు వచ్చింది. జాతీయ బూర్జువావర్గ పాత్రను అంచనా వేయటంలో, కొమింటర్న్ పిడివాద ఆలోచనా విధానంతో కొట్టుకుపోయింది. 1928లో కొమింటర్న్ ఆరవ మహాసభ ఆమోదించిన వలస దేశాల పత్రంలో ఇది స్పష్టంగా వ్యక్తమైంది ఈ పిడివాద అవగాహనకు అడుగు గున సామ్రాజ్యవాదానికి, జాతీయ బూర్జువావర్గానికి మధ్యగల అంతర్వైరుధ్యం అంతటితో అంతరించి పోయిందనే పొరపాటు భావన ఒకటున్నది. ఇది ఒక పొర పాటు నిర్ణయానికి త్రోవతీసింది. "సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో బూర్జువా వర్గం గణనీయమైన శక్తి ఇక కానేకాదు" అని భావించటం జరిగింది.

భారత్ లాంటి దేశంలో. ముఖ్యంగా జాతీయోద్యమ ప్రధాన ప్రవాహం, బూర్జువావర్గ నాయకత్వంలో ఉన్న దేశంలో, ఈ ఆలోచనా ధోరణి. సమస్యను గందరగోళపరచి. కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలను పక్కదోవ పట్టించటానికి ఎంతగానో కారణమైంది. ఒక ఉదాహరణ చూద్దాం. జాతీయ బూర్జువావర్గం అభి వృద్ధి నిరోధకవర్గంగా మారిందనే ఊహపై ఆధారపడి, కమ్యూనిస్టుపార్టీ, ఆ వర్గం నాయకత్వం వహించిన కాంగ్రెస్ ఉద్యమం నుండి దూరంగా ఉంది. అది "విప్లవ కర స్వభావం కలిగి లేదు" అనే సాకుతో, 1930-31లో గాంధీజీ నిర్వహించిన, శాసనోల్లంఘన కార్యక్రమంలో కమ్యూనిస్టుపార్టీ పాల్గొనలేదు. (నిందితుల సాధా రణ ప్రకటన. యం. అహ్మద్. కమ్యూనిస్టులు బోనులో నుండి సామ్రాజ్య వాదంపై సవాలు విసిరారు 84వ పేజీ)

ఈ నిర్ణయం తీవ్రమైన హానిచేసింది. కమ్యూనిస్టుపార్టీ పురోగతిని అరి కట్టింది. కాగా, కొమింటర్న్ ఏడవ కాంగ్రెస్, ఈ పిడివాద ధోరణి ప్రమాదాన్ని కొంత పసిగట్టింది. ఆ కాంగ్రెసు ఆమోదించిన ప్రధాన పత్రాలలో ఈ ఛాయ లున్నాయి. భారత కమ్యూనిస్టుపార్టీని, కాంగ్రెసు ఉద్యమంలో చేరవలసిందిగా, అంతర్జాతీయ కాంగ్రెసు సలహా ఇచ్చింది కాంగ్రెసుకు చెందిన సంస్కరణవాద జాతీయ నాయకులతో కలిసి పనిచేయవలసిందిగా కోరింది. ఈ దశలో కమ్యూనిస్టు పార్టీ తన స్వంత కృషి ద్వారా కూడా, బూర్జువా జాతీయవాదం పట్ల అంతకు ముందున్న పిడివాదాన్ని అధిగమించడానికి కృషిచేసింది. ఈ కృషి ద్వారా బల పడ్డది.

కాగా, కొమింటర్న్ ఆరవ కాంగ్రెసులో ఆమోదించబడిన వలస దేశాల పత్రంలో, జాతీయ బూర్జువా వర్గం పాత్రపై ఒంటెత్తు వ్యాఖ్యానం వుండనే వున్నది. తత్ఫలితంగా ఏర్పడిన పిడివాదం, కమ్యూనిస్టుపార్టీ అవలంబించిన సాధారణ విధానాన్ని ప్రభావితం చేస్తూనే ఉంది. ఫలితంగా బూర్జువా వర్గం సామ్రాజ్యవాదం పట్ల ఊగిసలాట ప్రదర్శించినప్పుడల్లా, ఇది అంతిమ లొంగు బాటు అనే ధోరణి తలఎత్తింది. భారతదేశంలో 1947 రాజకీయాధికార మార్పిడి సందర్భంగా, ఈ ధోరణి అతి నగ్నంగా వ్యక్తమయింది. రాజకీయాధికార మార్పిడి ఫలితంగా జాతీయ బూర్జువావర్గ ప్రభుత్వం ఏర్పడ్డది. కాగా, పైన వివరించిన ఒంటెత్తు ధోరణి ఫలితంగా, మనం సాధించుకున్న స్వరాజ్యం బూటకం అని ప్రకటించాము 1951 లో ఆమోదింపబడిన పార్టీ కార్యక్రమంలో, భారత దేశం, అర్ధ వలస దేశంగా పేర్కొనబడ్డది. ఇదే పిడివాద ధోరణి ఫలితంగా, నెహ్రూను పదే పదే విమర్శించాము.

నిజమే ఇవన్నీ పొరపాట్లే. ఇవన్నీ కమ్యూనిస్టు ఉద్యమ పురోగతిని ఎంతగానో నిరోధించాయి.

కాగా గుర్తుంచుకోవలసిన అంశం ఏమంటే, ఈ పొరపాట్లను మార్క్సిస్టు-లెనినిసు సూత్రాల ప్రాతిపదికపై సవరించుకునే కృషి, కమ్యూనిస్టు ఉద్యమంలో నుండే అంతరంగంగా ప్రారంభమయింది. 1954 మధుర పార్టీ కాంగ్రెసులోను, 1956 పాల్ఘాట్ కాంగ్రెసులోను, 1947 రాజకీయాధికార మార్పిడి సమస్య పదే పదే చర్చనీయాంశమయింది. జాతీయ బూర్జువా వర్గం పాత్రను గురించి తీవ్ర చర్చలు జరిగాయి.

కమ్యూనిస్టుపార్టీ చేసిన తప్పులు చాలా తీవ్రమయినవే. వీటివల్ల జరిగిన హానిని తక్కువ అంచనా వేయటం పొరపాటు అవుతుంది.

కాగా, ఈ పొరపాట్లు జరిగినప్పటికీ, జాతీయోద్యమం ఎదుట, కమ్యూనిస్టు పార్టీ ఆవిష్కరించిన నమూనా, చారిత్రకంగా చూస్తే ఎంతో ప్రాధాన్యం కలిగి ఉంది. కాంగ్రెసు ప్రతిపాదించిన బూర్జువా ప్రజాస్వామ్య నమూనా కంటె, విప్లవ ప్రజాస్వామ్య నమూనా సరికొత్తది

నెహ్రూ అనుసరించిన కుహనా వామపక్ష ధోరణి కంటె, కమ్యూనిస్టుపార్టీ ఆవిష్కరించినది నిజాయితీతో కూడిన వామపక్ష ధోరణి జాతీయోద్యమం ఎదుట నిజమయిన విప్లవకర ప్రత్యామ్నాయాన్ని ఆవిష్కరించటంలో, కమ్యూనిస్టుపార్టీ నిజంగానే మార్గదర్శక పాత్ర నిర్వర్తించింది.

ఈ సమీక్షకు మూలమయిన గ్రంధ రచయితలు, నెహ్రూ నమూనా, కొమింటర్న్ నమూనా కంటె ఉన్నతమయిందనే భ్రమలో ఉన్నారు. బూర్జువా

ప్రజాస్వామ్యానికి, విప్లవ ప్రజాస్వామ్యానికి గల వ్యత్యాసాన్ని వారు గుర్తించటం లేదు. నెహ్రూ ప్రతిపాదించిన కుహనా వామపక్ష ధోరణికి, కొమింటర్న్ రూపొందిన చిత్తశుద్ధితో కూడిన వామపక్ష ధోరణికి గల తేడాను గుర్తించటం లేదు.

కొమింటర్న్ నమూనా, నెహ్రూ నమూనా కంటె నిస్సంకోచంగా ఉన్నతమైంది. ఏమంటే ఈ నమూనాలో విప్లవానికి నాయకులు, కార్మిక, కర్షక వర్గాలు, వ్యవసాయ విప్లవం మూలకం, దాని పెట్టుబడిదారీయేతర పంథా కీలకాంశం, విప్లవ విజయానికి అత్యుత్తమ హామీ, కమ్యూనిస్టుపార్టీ యొక్క స్వతంత్రపాత్ర.

సరియైన ఈ నిర్ణయాలకు రాకుండా ఈ గ్రంథ రచయితలు పక్కమార్గాన పోతున్నారు అందుకు, వారి నయా మార్క్సిస్టు ఆలోచనా పద్ధతి, దురభిప్రాయ పూరిత పరిశోధన, కారణాలు, బూర్జువా జాతీయవాదం, వర్గరహిత సిద్ధాంతమనీ, (50 వ పేజీ), వ్యవసాయ విప్లవ నినాదం లేవదీయటమే అతిశయ విప్లవ ధోరణి అని (26 వ పేజీ) బూర్జువా ప్రజాతంత్ర దశలో, దున్నేవానికేభూమి నష్టపరిహారం లేకుండా జమీందారీల రద్దు వంటి నినాదాలు ఇవ్వరాదని, స్వతంత్ర పెట్టుబడిదారీ పంథా లేక గుత్తేతర పెట్టుబడిదారీ పంథా ఉన్నత స్థాయికి చెందిన పెట్టుబడిదారీ విధానానికి త్రోవ తీస్తుందని (389-90) నెహ్రూ అట్టి విధానానికి కట్టుబడి ఉన్నాడని, ఈ ఉన్నతమైన పెట్టుబడిదారీ మార్గం, ప్రజాతంత్ర విప్లవ కర్తవ్యాలను పరిపూర్తి చేస్తుందని భావించే పరిశోధక పండితుల. మార్క్సిస్టు భావనలు, విశ్వాసాలను గురించి, మనం సంశయం ప్రదర్శించటం అవసరం.

బిపిన్‌చంద్ర, ఆయన అనుచరులు కమ్యూనిస్టుపార్టీని కోరేదేమంటే, రెండు ముక్కల్లో చెప్పాలంటే, మీ స్వతంత్ర పాత్రను విసర్జించండి, జాతీయ బూర్జువా వర్గ అనుచరులుగా వ్యవహరించండి, నెహ్రూ ప్రశంసా పరుల గుంపులో చేరండి. సహజంగానే, ఈ పనులు కమ్యూనిస్టుపార్టీ చేయగలిగినవికావు. ఏమంటే అలా చేస్తే కమ్యూనిస్టుపార్టీ తన స్వతంత్రపాత్రను కోల్పోతుంది, కమ్యూనిస్టు పార్టీ అనేదే లేకుండా పోతుంది.



# విప్లవాభిమాని విక్టర్ హ్యూగో

నతాల్యా స్త్రఫనోవా

ఫ్రాన్స్‌ను విక్టర్ హ్యూగో ఆవహించాడని ఫ్రెంచ్ పత్రికలు ప్రశంసిస్తున్నాయి. ఈ సంవత్సరం హ్యూగో శత వర్ధంతి వత్సరం కాబట్టి వివిధ పత్రికలలో ఆయనపై సంఖ్యానేక వ్యాసాలు వచ్చాయి. 1985 సంవత్సరం ఆ మహా నవలా రచయితకూ, కవికీ అంకితం కాబడింది.

ఆయనపై అనేక వ్యాసాలు ప్రచురించారు; ప్రత్యేక సంచికలు తీశారు; ఆయన జీవితంపైనా, రచనలపైనా ప్రగాఢమైన పరిశోధనలు చేశారు; ఆయన జీవిత చరిత్రపై కొత్త గ్రంథాలు వెలువడ్డాయి; పాతవాటిని పునర్ముద్రించారు. ఆయన రచనలను ప్రత్యేక సంపుటాలుగా ప్రచురించారు; రచనలన్నింటినీ ముద్రించారు; మెట్రో స్టేషన్లలో ఆయనపైనా, ఆయన గ్రంథాలపైనా ప్రదర్శనలు నిర్వహించారు; రేడియోలో, టెలివిజన్‌లో ప్రత్యేక కార్యక్రమాలు ప్రసారం చేశారు; సినిమాలు నిర్మించారు; నాటకాలు ప్రదర్శించారు; ఆఖరుకు ఒక సంగీత కార్యక్రమం కూడా నిర్వహించారు.

ఆ మహా రచయితపట్ల ఫ్రెంచ్ ప్రజలకు గల కృతజ్ఞతా భావాన్ని ఇవన్నీ తెలియజేస్తున్నాయి. అంతేగాక, "లాహ్యూమనెటే" పత్రికలో జీన్‌పేరి యొ నార్డి అన్న మాటలను యివి ఇవి స్పష్టంగా నిరూపిస్తున్నాయి. ఆయన ఆ పత్రికలో ఇలా రాశారు: "విక్టర్ హ్యూగో మన జాతి అంతరాత్మకు శరీరంగా, ఆత్మగా వుంటున్నాడు."

ఇది చాలా ముఖ్యమైన, గణనీయమైన అంశం. ఎందుచేతనంటే, ఆయన మరణించి నూరేళ్ళయింది. ఈ నూరేళ్ళ కాలంలో ఆ మహారచయిత పట్లగల దృక్పథంలో గణనీయమైన మార్పులు వచ్చాయి

రెండో ప్రపంచయుద్ధ కాలంలో ఒకానొక ఫాసిస్టు వ్యతిరేక గెరిల్లా గ్రూపునకు విక్టర్ హ్యూగో పేరు పెట్టుకున్నారు. ఆయన కవిత్వంలోని కొన్ని పంక్తు

లను అజ్ఞాతంగా పనిచేసే ప్రతిఘటన దళాలు స్మరించుకునేవి కాగా నాజీ ఆక్రమణ సైన్యాలేమో విక్టర్ హ్యూగో విగ్రహాన్ని విధ్వంసం చేశాయి. పారిస్‌లో ఆయన పేరుగల చౌకులో ఆయన విగ్రహం వుండేది

విముక్తి తర్వాత కొన్నేళ్ళకు, 1950 తొలి సంవత్సరాలలో, అమెరికా సామ్రాజ్యవాద ప్రభావం పరాకాష్ఠకు చేరుకున్న సమయంలో, ఫ్రాన్స్ జాత్యభిమానాన్ని మళ్ళీ అవమాన పరచారు. విక్టర్ హ్యూగో విగ్రహం ధ్వంసం కాబడిన దిమ్మపైన ఫోర్ వాహనం శిల్పాన్ని పెట్టాలన్న దుర్బుద్ధిపుట్టింది ఒక పెద్ద మనిషికి. అంటే అమెరికా బలోపేత శక్తికి సంకేతంగా ఫోర్ వాహనాన్ని అక్కడ ప్రతిష్ఠించాలని ఫాసిస్టులు భావించారు. అప్పుడు ఫ్రెంచ్ కమ్యూనిస్టు కవి అయిన లూయీ ఆరగో వారికి సరైన సమాధానమిచ్చాడు. దోషులను శిక్షించాలంటూ విక్టర్ హ్యూగో రాసిన కవితా ఖండికలను లూయీ ఆరగో పునర్ ముద్రించి ఆ సంపుటికి ఉపోద్ఘాతం రాశాడు అమెరికా ఆరిక సహాయానికి ఫ్రాన్స్ కీర్తిని మార్పిడి చేయాలనుకున్న వారిని ఆయన తన ఉపోద్ఘాతంలో నిశితంగా విమర్శించాడు.

ఇటీవలి కాలంలో అంటే కేవలం 15 యేళ్ళ క్రితం స్కూళ్ళ పాఠ్యాంశాల పరిధినుండి హ్యూగో గ్రంథాలను బయటకులాగారు. ఫలితంగా సెకండరీ స్కూళ్ళ విద్యార్థులకు ఆయన రచనలు చదివే అవకాశాన్ని రద్దుచేశారు. 1985లో శత వర్ధంతి సంవత్సరంలో మాత్రమే ఆయన రచనలకు ఫ్రెంచ్ సాంప్రదాయ సాహిత్యంలో తిరిగి తగిన స్థానం లభించింది అయితే ఉన్నత పాఠశాల విద్యార్థులు తప్పనిసరిగా చదవాల్సిన గ్రంథాల జాబితాలో ఆయన నవల- "లేమిజరబుల్స్" చేర్చబడని మాట నిజం. (ఈ నవల "పేదలపాట్లు" పేరుతో తెలుగులో కూడా ప్రచురింపబడింది.)

మరి ఇన్ని అవరోధాలు వుంటే, ఫ్రెంచ్ జాతిని విక్టర్ హ్యూగో ఆవహించాడని ఎందుకు ప్రశంసించడం?

విస్మృతిలోనూ, కాల పరిధిలోనూ విక్టర్ హ్యూగో కీర్తికి ఒక్క నెపోలియన్ కీర్తి మాత్రమే సమానమైందని పీరజార్జిర్ అనే రచయిత అన్నారు. సాహిత్య పత్రికలో రాసిన వ్యాసంలో ఆయన పై విధంగా అన్నారు. వీరిద్దరి మధ్య పోలిక ఏమిటా అనిపిస్తుంది మొదట ఒకరేమో సైన్యాలను, దేశాలను శాసించే సైనిక నాయకుడు; మరొకరేమో మహా రచయిత. ఈయన ఆయుధాలు కలం, హృదయం, పరిశుద్ధమైన అంతరాత్మ, విక్టర్ హ్యూగో ప్రవాసజీవితం గడుపుతున్నప్పుడు యిలా అన్నాడు: "నాకు ఒకే ఒక శక్తి వున్నది - అది నా అంతరాత్మ. అది నాకు చాలు". విశ్లేషణలో తేలేదేమంటే నెపోలియన్ సాధించ

లేని దానిని విక్టర్ హ్యూగో సాధించాడని తెలుస్తుంది. విక్టర్ హ్యూగో యూరప్‌నేకాక యావత్ ప్రపంచాన్నే జయించాడు. శాంతిద్వారా పాలన అనే భావం వాస్తవమైందని ఆయన తన వ్యక్తిగత ఉదాహరణ ద్వారా నిరూపించాడు. శాంతి యావత్ నాగరికతకు ప్రయోజనదాయకమైందని, యుద్ధం నేరం వంటిదని విక్టర్ హ్యూగో భావించాడు. విక్టర్‌హ్యూగో అంటే "శాంతి యోధుడని" ఫ్రెంచ్ కమ్యూనిస్టు రచయిత ఫోరిమాండ్ బోంటే అన్నారు.

శత వర్ధంతి సందర్భంగా కుప్పతెప్పలుగా వ్యాస పరంపర అచ్చయినప్పటికీ, అనేక వివరణలు వెలుగులోకి వచ్చినప్పటికీ ఆ మహారచయిత జీవితంలోని కొన్ని ముఖ్యమైన ఘటనలను పత్రికలు పూర్తిగా విస్మరించాయి. ఉదాహరణకు శాంతికోసం ప్రజా పోరాటం జరపాలని ప్రప్రథమంగా వాదించింది విక్టర్ హ్యూగోయే ఈ అంశాన్ని ఫ్రెంచ్ పత్రికలు విస్మరించాయి. లోగడ అనేక మంది బుద్ధిజీవులు రక్తపాతం నుంచి ప్రజానీకాన్ని విముక్తం చేసే వుద్దేశంతో యుద్ధం, శాంతి సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించిన మాట వాస్తవం. ఈ సందర్భంగా అందరకూ తెలిసిన గ్రంథం ఇమ్మాన్యుయేల్ కాంట్ రచించిన "శాశ్వత శాంతి". రాజ్యాలమధ్య ఒప్పందాల ద్వారా శాంతిని సాధించవచ్చునని ఆయన అందులో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. అయితే విక్టర్ హ్యూగోకు ముందు కాలంనాటి యీ శాంతిదూతలందరూ శాంతి ప్రవక్తలందరూ నైరూప్య సిద్ధాంతాల నుంచి తమ అభిప్రాయాలకు రూపకల్పన యిచ్చినవారే.

యుద్ధానికి వ్యతిరేకంగా మాటల ద్వారానూ (వాఙ్మయం ద్వారానూ) చేతలద్వారానూ (ఆచరణ ద్వారానూ) పోరాడాలని గ్రహించిన వారిలో విక్టర్ హ్యూగో కూడా ఒకరు. విస్తృతమైన శాంతి వుద్యమంలోకి ఆయన ప్రజానీకాన్ని ఆకర్షించాడు. 1849లో పారిస్‌లో శాంతి మిత్రుల ప్రప్రథమ అంతర్జాతీయ మహాసభ జరిగింది. యూరప్ చరిత్రలో ఇది ప్రప్రథమం. ఆ మహాసభకు విక్టర్ హ్యూగోను ఏకగ్రీవంగా అధ్యక్షుడిగా యెన్నుకున్నారు. ఆయన ఆ సందర్భంగా చేసిన ప్రసంగంలో భవిష్యత్తులో విశ్వశాంతి తన సుందరరూపం ప్రదర్శిస్తుందనీ, సైన్యాలకూ, యుద్ధాలకు పెట్టే నిధులను రేపు దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని అధిగమించడానికి వ్యయం చేస్తారని అభిభాషించారు. ఒకనాడు చిత్రహింసలకు వినియోగించబడిన ఆయుధాలు నేడు మ్యూజియం వస్తువులుగా మారినట్లు, భవిష్యత్తులో ఫిరంగులను సైతం మ్యూజియం వస్తువులలో చేర్చుతారని, వాటిని చూచి ఇంత బర్బరత్వం ఎలా సాధ్యమైందని ప్రజలు విస్తుపోతారని విక్టర్ హ్యూగో ఉద్ఘాటించారు. అయితే ఇలాటి భవిష్యత్తుకు మార్గం చాలా సుదీర్ఘమైందని ఆయన గుర్తించాడు కాబట్టే యిలా అన్నాడు: "నిర్విరామ పోరాటం ద్వారా తప్ప ఈనాడు శాంతిని సాధించలేము."

శాంతికోసం సూత్రాలతో రాజీ పడాలన్నది ఆయన అభిప్రాయం కాదు. ప్రథమ అంతర్జాతీయ శాంతి మహాసభ జరిగిన 20 యేళ్ళకు లాసేన్‌లో జరిగిన ద్వితీయ మహాసభలో ప్రసంగిస్తూ ఆయన యిలా అన్నాడు: నిర్ద్వంద్వంగా "నిరంకుశత్వపాలనలోని శాంతి మనకక్కరలేదు; కరవాలం క్రింది శాంతి మనకక్కరలేదు; రాజదండం క్రింది శాంతి మనకక్కర్లేదు శాంతి యొక్క మొట్టమొదటి షరతు స్వేచ్ఛ" అయితే మరి దానినెలా సాధించడం? దానికి ఆయన ఇలా సమాధానమిచ్చాడు: "స్వేచ్ఛ (లేక విముక్తి) కోసం విప్లవం జరగాలి. అన్ని విప్లవాల్లోకి అతి ముఖ్యమైంది యుద్ధం. అదే అంతిమ యుద్ధం." శాంతిసాధనకు యుద్ధం అవసరం అనే యీ భావం మొదట మనకు కాస్త విడ్డూరంగా కనిపించవచ్చు. ఏమైనా విక్టర్ హ్యూగోకు ఎలాంటి భ్రమలులేవు. "శాంతియే అనివార్యమైన లక్ష్యం" అని ఆయన భావించాడు.

ఆ తర్వాత జరిగిన అన్ని శాంతి మహాసభల్లోనూ హ్యూగో ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ పాల్గొన్నాడు. యూరప్‌లో ఆనాడు లజ్జాకరమైన క్రిమియా యుద్ధం జరిగింది; గ్రీకుల, ఇతర స్లావ్ జాతుల జాతీయ విముక్తి వుద్యమాలు దారుణంగా అణచివేయబడ్డాయి. 1871 లో ప్రష్యాతో జరిగిన యుద్ధంలో ఫ్రాన్స్ అవమానకరంగా ఓటమిపాలయింది. నెపోలియన్-3 యీ యుద్ధంలో ఫ్రాన్స్ తరఫున తల దూర్చాడు. నెపోలియన్‌ను "రాజపాలకుడని" హ్యూగో అన్నాడు.

విద్వేషం పెచ్చరిల్లుతున్న పరిస్థితిలో శాంతికోసం వాదించడం కాస్త తెలివి మాలిన పనిగానే కనిపించింది అయినప్పటికీ హ్యూగో తన కష్టతరమైన పోరాటాన్ని కొనసాగించాడు తప్ప విరమించాడు కాదు. ఎందుచేతనంటే శాంతి పోరాడితే తప్ప దానిపాటికదేరాదని ఆయనకు తెలుసు. ఆయన ఇలా అన్నాడు: "శాంతి అంటే పైనుంచి బలవంతంగా రుద్దబడేదికాదు. శాంతి అన్నది ఫలితం." అయితే దురదృష్టవశాత్తూ ఆ మహా రచయిత జీవిత కాలంలో కానీ, ఆయన మరణానంతరం నూరేళ్ళకు కానీ మానవజాతి ఆ ఫలితాన్ని సాధించలేకపోయింది. ఏమైనా ఒకటి మాత్రం వాస్తవం. విక్టర్ హ్యూగోను అన్నివిధాలా ప్రపంచ శాంతి వ్యవస్థాపకుడిగా, ప్రపంచ శాంతి ప్రవచకుడిగా పరిగణించాలి. ఆనాడు ఆయన నాటిన శాంతి విత్తనం నేటికి మహావృక్షంగా పెరిగింది. అణ్వాయుధాల మంటలకు గురికాకూడదని భావించే ప్రజానీకం అంతా యీనాడు శాంతి వుద్యమంలో పాల్గొంటున్నది. మానవజాతి దృఢదీక్షతో శాంతికోసం పోరాడుతుంది. ఈపోరాటం విక్టర్ హ్యూగోకు, మన తరాలకు మధ్యగల ఆత్మిక బంధం.

ఆయనకు రాజకీయ స్థిరత్వంలేదని పత్రికలు అప్పుడప్పుడు హ్యూగోను నిందిస్తుంటాయి. యీ విమర్శకు హ్యూగో కాస్త అవకాశం కల్పించాడని మనం అంగీకరించాలి. బాల్యంలో ఆయన నిష్ఠాగరిష్ఠుడైన కాథలిక్. ఆయనను

బాల్యంలో ఒక మతగురువు సాకాడు. ఆ తర్వాత ఎంతో బాధగా ఆయన ఇలా అన్నాడు: "పొరపాటు అభిప్రాయాలు, అపోహలు నాకు ఏర్పడినాయంటే అందుకు నన్నుకాదు మతగురువులను నిందించాలి." అయితే 19 వ శతాబ్దంనాటి అల్లకల్లోల పరిస్థితుల ప్రభావం మూలంగా ఆయన తన అపోహలను వరుసగా అన్నింటిని ప్రక్షాళనం చేసుకున్నాడు. 1851 లో నెపోలియన్-3 జరిపిన రాజకీయ కుట్ర అనంతరం. అలెగ్జాండర్ హెర్జెన్ మాటల్లో చెపితే "హ్యూగో చివరకు సంపూర్ణ స్థాయికి ఎదిగాడు. సన్నీలను, తుపాకులను ఎదుర్కొంటున్న ప్రజలు విప్లవించాలని ఆయన పిలుపు యిచ్చాడు. ఆయన ఆ రాజకీయ కుట్రను నిరసిస్తూ ఫ్రాన్స్ వదలివెళ్ళిపోయాడు. తానక్కడ వుండి చేయగలిగిందేమీలేదని. వెళ్ళిపోయాడు."

సామ్రాజ్యం పతనమయ్యాక కానీ ఆ మహా రచయిత స్వదేశం తిరిగి వచ్చాడు కాదు. మూడవ రిపబ్లిక్ తొలి సంవత్సరాల నుంచీ ఆయన తీవ్రమైన సోషలిస్టుగానే వుండేవాడు కమ్యూనార్డులకు బేషరతుగా క్షమాదానం ప్రకటించాలని నిర్విరామ పోరాటం జరిపిన ఏకైక సెనెటర్ ఆయనే. మొత్తం మూడు విప్లవాలను-1830 విప్లవం, 1848 విప్లవం, 1871 విప్లవం- విక్టర్ హ్యూగో చూశాడు. అయితే అన్నివేళలా ఆయన అభిప్రాయాలు దోషరహితమైనవని చెప్పలేము. కొన్ని సందర్భాలలో, ఆయనే స్వయంగా అంగీకరించినట్లు. "గత సంవత్సరంలోలాగా రాజకీయ మార్గాన్ని ఎంపిక చేసుకున్నాను." ఆయన రాజకీయ పరిణామంలో ప్రగాఢమైన అంతర్గతతర్కం వుండింది. జీవితంలో పైకిపోదామన్న ఆలోచనలు కానీ, రాజకీయ లబ్ధికానీ ఆయన రాజకీయ పరిణామాన్ని నిర్ణయించాయి కాదు. పైపెచ్చు, ఆయన్ను ఎల్లవేళలా వామపక్షం దిశగా నడిపించింది దురూహతో కూడిన ఆలోచనేమీ కాదు; తన కాలంనాటి ప్రతిఘటనకు ప్రతిస్పందించిన తన హృదయంలో నుంచి సుదృఢమైన, ఉదారవంతమైన హృదయంలో నుంచి వచ్చిన ఆవేశమే ఆయన్ను వామపక్షం దిశగా నడిపించింది.

ఆయన నవల "హంచ్ బ్యాక్ ఆఫ్ నాటర్‌డామ్"కు 1830 విప్లవం ప్రేరణ యిచ్చింది. ఆ నవలలో ప్రప్రథమంగా ప్రజలు మహాబలీయమైన శక్తిగా కనిపించారు. 1848 విప్లవం "లేమిజరబుల్స్" అనే నవలకు ఉత్తేజం యిచ్చింది. ఇందులో సద్గుణసంపన్నులైన పాత్రలకు అవమాన గాయాలు తగులుతాయి. అన్యాయానికి వ్యతిరేకంగా మాట్లాడినప్పుడు కానీ, రాసినప్పుడు కానీ ఆయన నిరంతరం మహా ఉదారంగా "మంచితనం అనే విత్తనాలను" నాటేవాడు. ఇందుకు ఉదాహరణ ఇందిరాగాంధీ తన స్మృతుల్లో అన్నమాటలే. తనను ప్రగాఢంగా ప్రభావితం చేసిన ఒకానొక గ్రంథం "లేమిజరబుల్స్" అనీ ఆ గ్రంథం తన

సామాజికతత్వాన్ని బాగా ప్రభావితం చేసిందనీ ఆమె అన్నారు. పేదరికం సమస్యలను అవగాహన చేసుకోడానికి ఆ పుస్తకం వుపయోగపడిందన్నారు.

## వైవిధ్యపూరిత వ్యక్తిత్వం

ఇంతకుమునుపే చెప్పినట్లు, విక్టర్ హ్యూగో కార్యకలాపాలు సాహిత్యానికి మాత్రమే పరిమితం కాలేదు. ఆయన తరుచుగా చేసిన రాజకీయ ప్రసంగాలు ఆయనకు జాతీయస్థాయి గుర్తింపు తెచ్చాయి. అన్ని రూపాల్లోని పీడనకు వ్యతిరేకంగా ఆయన తన గళం ఎత్తాడు.

అమెరికాలో దక్షిణ ప్రాంతంలోని నీగ్రోల విముక్తి కోసం జాన్ బ్రౌన్ అనే శ్వేతజాతీయుడు వీరోచితంగా పోరాడాడు. అందుకుగాను ఆయనకు 1859లో ఉరిశిక్ష విధించారు. అప్పుడు జాన్ బ్రౌన్‌ను క్షమించాలని కోరుతూ విక్టర్ హ్యూగో అమెరికా ప్రభుత్వానికి విజ్ఞప్తి పత్రం పంపాడు ఆయన్ను ఉరితీయడమంటే స్పార్టకస్‌ను జార్జ్ వాషింగ్టన్ చంపినట్లే కాగలదని హ్యూగో హెచ్చరించాడు.

1861 లో లూయీ నెపోలియన్ తన సైన్యాలను మెక్సికోకు పంపాడు. ఆస్ట్రియా యువరాజు మాక్సిమిలన్‌ను ఆ ప్రజలపై రుద్దాలన్నది నెపోలియన్ అభిప్రాయం దాడిదార్లపై మెక్సికో ప్రజలు వీరోచితంగా పోరాడారు. మెక్సికో రక్షణకై పోరాడినవారు ఫ్రెంచ్ సైనికులను యిలా నిలదీసి ప్రశ్నించారు. "అసలు మీరెవరు? ఒక క్రూరపాలకుని సైనికులు. మీ పక్షాన నెపోలియన్ వున్నాడు. మా పక్షాన విక్టర్ హ్యూగో వున్నాడు." ఆ మహా రచయిత మెక్సికన్లకు లేఖ రాస్తూ అందులో వారి పట్ల తన సంఘీభావం ప్రకటించాడు స్వేచ్ఛకోసం పోరాడిన ప్రతిఒక్కరినీ బలపరచినట్లే ఆయన మెక్సికన్లనూ బలపరచాడు.

1866 లో క్రెటే ద్వీపం ప్రజలు ఒటోమన్ సామ్రాజ్యపాలనకు వ్యతిరేకంగా తిరగబడ్డారు తమ దేశాన్ని స్వతంత్ర దేశంగా ప్రకటించుకున్నారు. గ్రీస్‌తో కలసి వుంటామని స్పష్టం చేశారు. టర్కీ దళాలను సైతం క్రెటే ద్వీపవాసులు గట్టిగా ప్రతిఘటించారు. తమ విముక్తి పోరాటాన్ని బలపరచవలసిందిగా విక్టర్ హ్యూగోను కోరుతూ ఆ ద్వీపవాసులు ఆయనకొక సందేశం పంపారు. "విక్టర్ హ్యూగోకు క్రెటే ద్వీపవాసులు" అని వుత్తరం పైన రాశారు.

స్పానిష్ వలసపాలకులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసిన తమకు తోడ్పాటు ఇవ్వాల్సిందిగా 1870 లో క్యూబా మహిళలు చేసిన విజ్ఞప్తికి విక్టర్ హ్యూగో యిలా సమాధానమిచ్చారు: "ఇతర దేశాలపై దురాక్రమణ జరిపే హక్కు యే దేశానికీలేదు. ఒక మనిషిపై ఇతర మనిషికి యాజమాన్య హక్కు లేనట్లే, యే దేశం పైనా యితర దేశానికి యాజమాన్య హక్కు లేదు."

విక్టర్ హ్యూగోకు సైన్యాలు లేవు; ఆయుధాలులేవు. అయినప్పటికీ ప్రజలంతా ఆయన సహాయం కోసమే అర్థించేవారు ఆయన్ను "జాతియొక్క అంతరాత్మ"గా పరిగణించేవారంటే అందులో అర్థంలేకపోలేదు. ఆయన "మానవ జాతి దూత" అని రోమారోలా అన్నారు.

దళితులకు సంఘీభావంగా హ్యూగో చేసిన విజ్ఞప్తులపట్ల వివిధవర్గాల్లో బ్రహ్మాండమైన తోడ్పాటు లభించడమేకాక, పాలకవర్గాలపట్ల విద్వేషాన్ని, క్రోధాన్ని ఆయన విజ్ఞప్తులు సృష్టించాయంటే అతిశయోక్తి కాదు.

పారిస్ కమ్యూన్‌లో పాల్గొన్న కమ్యూనార్డుల సంరక్షణార్థం ప్రప్రథమంగా గళం విప్పింది విక్టర్ హ్యూగోయే. కమ్యూన్ ప్రకటనకు ముందే ఆయన బెల్జియంకు ప్రవాసం వెళ్ళవలసి వచ్చింది. కమ్యూన్ కార్యకలాపాలకు సంబంధించిన తప్పుడు వార్తలు ఆయనకు అందాయి. అందువల్ల ఆ ప్రప్రథమ శ్రామిక విజయం పట్ల ఆయనకుగల అభిప్రాయం వస్తుగతమైందికాదు, అయినప్పటికీ ఆయన కమ్యూనార్డులపట్ల సంఘీభావం ప్రకటించాడు. ఫ్రాన్స్‌నుంచి తప్పించుకున్న కమ్యూనార్డులకు రక్షణ కల్పించడానికి బెల్జియం ప్రభుత్వం తిరస్కరించింది. అప్పుడు విక్టర్ హ్యూగో ప్రభుత్వాన్ని లక్ష్యపెట్టకుండా ఇలా అన్నాడు ధైర్యంగా. "బెల్జియం ప్రభుత్వం నిరాకరించిన వారికి రక్షణ నేనిస్తాను. ఎక్కడ ? బెల్జియంలోనే...." తన ఇంట్లోనే వుండాల్సిందిగా కమ్యూనార్డులను కోరాడు. అదేరాత్రి ఆయన ఇంటిపై దాడి జరిగింది. మరునటిరోజే హ్యూగోను బెల్జియం నుంచి బహిష్కరించారు. అయితే ఆ తర్వాత కొన్నాళ్ళకే బెల్జియం ప్రభుత్వం కమ్యూనార్డులకు తన సరిహద్దుల ద్వారాలు తెరవక తప్పలేదు. హ్యూగో తన లక్ష్యాన్ని సాధించాడు. విప్లవకారులపట్ల ఆయనకున్న అభిమానం అదీ.

అప్పటినుంచి కమ్యూనార్డులకు బేషరతుగా క్షమాదానం ప్రకటించాలంటూ నిర్విరామ పోరాటం కొనసాగించాడు. ప్రగతి నిరోధకశక్తులు వికటాట్టహాసం చేస్తున్న సమయంలో అలాటి కృషి చేయడానికి గొప్ప సాహసం అవసరం. ఆయనకా సాహసం వుండింది. కమ్యూన్ సజీవంగావున్న రోజుల్లో ఆయన తన ఒకానొక లేఖలో యిలా రాశాడు: "నేను విప్లవకారుని విప్లవం గురించి తెలియకుండానే నేను విప్లవకారుని. కౌమార్య దశనుంచీ నేను రాజకీయాల్లో రాజరికవాదిని (రాయలిస్టు) సాహిత్యంలో విప్లవకారుని."

వాస్తవానికి ఆయన విప్లవకారుడే. ఎందుచేతనంటే ప్రజల రాజకీయ చైతన్యం పెంచడానికీ, ప్రజలలో నిరంతరం సామాజిక వాంఛలు మొగ్గ తొడగడానికీ ఆయన తన కళనూ, జీవితాన్ని అంకితం చేశాడు. ఆయన వక్తృత్వ ప్రతిభ, సాహితీ ప్రజ్ఞ అసామాన్యమైనవి. స్వేచ్ఛ, న్యాయం వగైరా ఉత్కృష్ట

భావాల ప్రచారాన్ని గొప్ప సాహితీ స్థాయికి తీసుకెళ్ళాడు. దోషులను శిక్షించాలంటూ హ్యూగో రాసిన కవితా ఖండికలు "పోరాట యోధుల చేతుల్లో బైబిల్" వంటివని రోమారోలా అన్నాడంటే అందులో అర్థం లేకపోలేదు. విక్టర్ హ్యూగో శృంఖలా బద్ధుడైన మహాశక్తిసంపన్నుడని ఎమిలీజోలా ప్రశంసించారు.

"మామూలు మందను మహాప్రజగా మార్చడానికి" విక్టర్ హ్యూగో తన ప్రతిభాసంపత్తిని వెచ్చించాడు. ఆయన మరణించినప్పుడు ప్రజలు విశేష సంఖ్యలో వచ్చి ఆయన భౌతికకాయం అంతిమయాత్రలో పాల్గొన్నారు. వాల్టేర్ మరణానంతరం ఎవరి అంతిమయాత్రలోనూ అంతమంది జనం పాల్గొనలేదు.

ఆయనది దయార్ద్ర హృదయం; తన పౌర విముక్త ధర్మానికి అది నిరంతరం ప్రతిస్పందించేది. ఆయన మాతృభూమిని అమితంగా ప్రేమించేవాడు. కొంతమంది ఫ్రెంచ్ రచయితలు తమ మాతృభూమిపై ఫిర్యాదులు చేసినవారున్నారు ఉదాహరణకు ఎడ్మండ్ డీ గోన్కోర్ట్ ఇలా ఫిర్యాదు చేశాడు: "ఫ్రెంచ్ పౌరుడిగా వున్నందుకు నేను విసిగివేసారిపోయాను. కళాకారునికి శాంతి దొరికే మరోదేశం వెళ్ళాలనుకుంటున్నాను." అవును మరి. ఇంత తరుచుగా విప్లవాలు సంభవించని దేశం కావాలి ఆయనకు! విక్టర్ హ్యూగో మనసులో ఇలాంటి నీచమైన వూహ చొరబడివుండజాలదు. అది ఆయన తత్వానికి వ్యతిరేకం. ఆయన ప్రవాస జీవితంలోని చేదును సొంతం రుచి చూశాడు. ఆయన ఇలా రాశాడు: "నా బలహీనతను క్షమించండి. నేను నా దేశాన్ని అభిమానిస్తాను, అభినందిస్తాను." ఫ్రాన్స్ తనను గురించి గర్వించేలానే హ్యూగో ఎల్లప్పుడూ వ్యవహరించాడు. ఫ్రాన్స్ యొక్క ప్రగతిశీల రాజకీయ పరిణామానికి ఆయన సజీవ ప్రతీకగా వుండేవాడు. విప్లవాలచే నిరంతరం పునీతమైన, పునరుజ్జీవం చెందిన మాతృభూమి హృదయానికీ, ఆత్మకూ ఆయన సజీవ ప్రతిమ. ★

# పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రభుత్వ యాజమాన్య అవకాశాలు

విల్లీ జెర్నెన్
*బోర్డు అధ్యక్షవర్గం, కార్యవర్గ సభ్యుడు*
*జర్మన్ కమ్యూనిస్టు పార్టీ (డి. కె. పి)*

ప్రజాస్వామ్యం, సామాజిక పురోగతిలో మలుపు తీసుకురావడానికి ఆర్థిక వ్యవస్థలోని కొన్ని రంగాలను ప్రజాస్వామ్యయుత అజమాయిషీ క్రింద ప్రభుత్వానికి అప్పగించాలన్న డిమాండ్ జర్మన్ కమ్యూనిస్టు పార్టీ (డి.కె.పి) కార్యక్రమ పంథాలో కీలకాంశంగా వుంది. ఈ రంగాలను ప్రైవేట్ పెట్టుబడిదారీ యాజమాన్యం నుంచి ఉపసంహరించి, ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు బదలాయించాలని కోరుతున్నది. ఒక్క కమ్యూనిస్టులు మాత్రమేకాదు: ఇది దీర్ఘకాలంగా కార్మికవర్గ కోర్కెగా వుంది. ఫాసిజం నుండి దేశం విముక్తి అయిన అనంతరం, జర్మన్ ట్రేడ్ యూనియన్‌ల సమాఖ్య కార్యక్రమంలో, అనేక వ్యక్తిగత ట్రేడ్ యూనియన్‌ల మూలపత్రాలలో అది రాయబడింది.

అయితే, పెట్టుబడిదారీ వ్యవస్థ వికసించటం, జీవన ప్రమాణాలు శీఘ్రంగా పెరగడం, 1950 దశకంలో ఉపాధి అవకాశాలు సాపేక్షికంగా హెచ్చుస్థాయిలో వుండడంతో ఈ సమస్య వివాదరహితమైంది; తన సంక్షోభాలతో, నిరుద్యోగంతో తట్టుకోగల సమర్థత పెట్టుబడిదారీ వ్యవస్థకు ఉన్నట్లు కన్పించింది; ఆ మాట కొస్తే, బూర్జువా ప్రచారం ఇంకెంత మాత్రమూ "పెట్టుబడిదారీ వ్యవస్థ" అని మాట్లాడటంలేదు. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌లోని సామాజిక వ్యవస్థను "సాంఘిక మార్కెట్ ఆర్థిక వ్యవస్థ" అని, "స్వేచ్ఛా మార్కెట్ ఆర్థిక వ్యవస్థ" అని, "సంపన్న సమాజం" అని సైతం పిలవసాగారు.

ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యజమాన్యం, స్వేచ్ఛా విపణి అని పిలవబడేది ఆర్థిక పురోగతికి ప్రాతిపదిక అని విశ్వసించే భ్రమకు శ్రమజీవులు లోనైనారు. ఈ భావనను మితవాదులే (కన్సర్వేటివ్‌లు) గాక, సోషల్ డెమొక్రాటిక్ నాయకులు కూడా బలపరిచారు. విస్తృత ప్రజాబాహుళ్యం ఆలోచనపై యిదంతా పనిచేసింది. ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యాజమాన్యం "పవిత్రమైన ఆవు" అయింది; జాతీయకరణ డిమాండ్‌ను త్రోసిపుచ్చబడటమే గాక, "రాజ్యాంగ వ్యతిరేక" మైనదిగా ప్రజలు పరిగణించారు.

గత అనేక సంవత్సరాలుగా పెట్టుబడిదారీవ్యవస్థ అభివృద్ధి తిరిగి సంక్షోభ క్రమాలలో చిక్కుకుంది. ప్రజల నిరుద్యోగం పెరుగుతున్నది. వీటితో ప్రజల ఆలోచనలలో ఖచ్చితమైన మార్పు వచ్చింది; ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు యాజమాన్యం మీద ఆధారపడిన ఆర్థిక వ్యవస్థ "స్వయం స్వస్థత శక్తుల"పై అనుమానాలు పెరుగుతున్నాయి; ముఖ్యంగా ట్రేడ్ యూనియన్ క్రియాశీలురైన పారిశ్రామిక కార్మికులు, ఉద్యోగులలో సందేహాస్పద వైఖరులు పొడచూపుతున్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ సంక్షోభం వల్ల బాగా దెబ్బతిన్న ఉక్కు, నౌకా నిర్మాణం, సముద్రయాన రవాణా పరిశ్రమలలో ఇది బాగా కనిపిస్తున్నది.

ఆ కారణంగా, ఆర్థిక వ్యవస్థ కొన్ని రంగాలపై ప్రైవేటు పెట్టుబడిదారీ యాజమాన్య వ్యవస్థలను అంతం చేయాలని ట్రేడ్ యూనియన్‌లు తిరిగి కోరుతున్నాయి. ఉదాహరణకు, ప్రభుత్వ సంస్థల, రవాణా, కమ్యూనికేషన్‌ల ఉద్యోగుల ట్రేడ్ యూనియన్ 9వ మహాసభ ప్రైవేటు యాజమాన్యంలోని సముద్రయాన రవాణా సంస్థల యాజమాన్యాన్ని ప్రభుత్వానికి బదలాయించాలని డిమాండ్ చేసింది; అలాగే లోహ పరిశ్రమ కార్మికుల ట్రేడ్ యూనియన్ 14వ మహాసభ (1983) కీలక పరిశ్రమలను, మార్కెట్‌పై ఆధిపత్యం చెలాయిస్తున్న కార్పొరేషన్‌లను జాతీయం చేయాలని డిమాండ్ చేసింది; ఉక్కు పరిశ్రమను జాతీయం చేయాల్సిన అవసరాన్ని ప్రత్యేకించి వక్కాణించింది; ఇతర పరిశ్రమలలోని సంస్థల విధానాలపై కీలక ప్రభావం కలుగజేసేందుకు ట్రేడ్ యూనియన్‌లకు అవకాశం కల్పించాలని కోరింది.

ఈ సమస్యపై జర్మన్ సోషల్ డెమొక్రాటిక్ పార్టీ (ఎస్ పి. డి) లో తీవ్రమైన విభజనవచ్చింది. యువసోషలిస్టులు, వేతన-కార్మికుల అధ్యయన గ్రూపు ఈ భావనకు అనుకూలతను ప్రకటించగా, పార్టీ నాయకత్వం దీనికి వ్యతిరేకంగా గట్టి వైఖరి తీసుకుంది. ఎస్సెన్‌లో జరిగిన ఈ పార్టీ మహాసభలో (1984) గ్రూపు ఛైర్మన్ ఆర్: డ్రెస్లర్ ప్రసంగిస్తూ, "ఉక్కు ఉత్పత్తి, బొగ్గు త్రవ్వకం

పరిశ్రమ. నౌకా నిర్మాణ కేంద్రాలలో పాత ఉత్పత్తి వ్యవస్థలు విఫలమైనందున వీటి విషయంలో రాజకీయ చర్య అవసరమైనందున. జాతీయకరణ డిమాండ్ చేయాల్సివచ్చిందని..." వాదించారు. పరిశ్రమ అభివృద్ధి ఒక యాజమాన్య సిద్ధాంతం వల్ల స్తంభించి పోతున్నట్లు కొందరు విశ్వసిస్తున్నందున. మొత్తం రంగాల వినాశనానికి సంబంధించిన విషయాలను, ఇంధనం, ముడి పదార్థాల సరఫరా హరించుకుపోతున్న విషయాలను వాటాదారుల విచక్షణకు విడిచిపెట్టడం ఇంకెంతమాత్రమూ సముచితంగా వుండదు; పైగా లక్షలాది శ్రామికప్రజల జీవనోపాధి వీటిపై ఆధారపడి వుంది. పాత పారిశ్రామిక ప్రాంతాల వ్యవస్థను సురక్షితంగా పునరుద్ధరించటం, వాటికి భవిష్యత్ కలుగజేయటం రాజకీయ కర్తవ్యం."

అయితే ఎస్. పి. డి. డిప్యూటీ చైర్మన్ జె. రావ్ పార్టీ ఆర్థిక విధానంపై సమర్పించిన నివేదికలో అటువంటి కోర్కెలను తిరస్కరించారు. ఆయన ఇంకా ఇలా అన్నారు: "యాజమాన్య పద్ధతిపై వాదనలు వామపక్షశక్తుల్లో పాక్షికంగా పునరుద్ధరణ పొందినట్లు కనిపిస్తున్నది....యాజమాన్య రూపంలో మార్పు ఏ ఒక్క వ్యవస్థాగత సమస్యనూ పరిష్కరించకపోగా, వాస్తవంలో అంతిమంగా నెరవేరలేనటువంటి ఆశలను మాత్రమే రేకెత్తిస్తాయి". కీలక పరిశ్రమలను జాతీయం చేయాలని కోరే తీర్మానాన్ని భూస్థాపితం చేయడానికి, ఆయన తదుపరి ప్రసంగించిన ఎస్. పి. డి. నాయకత్వం దాదాపుగా అంతా ప్రయత్నించింది.

ప్రజాతంత్ర అజమాయిషీ క్రింద కొన్ని ఆర్థిక విభాగాలను జాతీయం చేయాలని దృఢంగా కోరుతున్న కమ్యూనిస్టులకు దానికిగల శక్తి సామర్థ్యాలు, దానికుండే పరిమితులు రెండూ తెలుసు. పెట్టుబడిదారీ వ్యవస్థ కింద కొన్ని సముదాయాలు, పరిశ్రమలు ప్రభుత్వానికి బదలాయించడం, దోపిడీ వ్యవస్థ అంటువ్యాధులన్నిటినీ ఏ విధంగానూ పారద్రోలలేదు; అయితే, పెట్టుబడిదారీ దోపిడీ వ్యవస్థను అంతంచేసే కృషి జయప్రదం కావడానికి పరిస్థితులను సృష్టించేందుకు యిది సహాయపడగలదని మేము భావిస్తున్నాం.

ప్రైవేటు పెట్టుబడిదారీ వ్యవస్థచే, అంతకన్నా మించి గుత్త పెట్టుబడిదారులచే, బూర్జువా రాజ్యాంగ చట్టం పరిధిలో ఆర్థిక వ్యవస్థ సారం నిర్ణయించబడుతుండగా జాతీయం చేయబడిన పరిశ్రమలు పెట్టుబడిదారీ పరిశ్రమలుగానో, లేక ప్రభుత్వ పెట్టుబడిదారీ పరిశ్రమలుగానో కొనసాగుతాయి; అంతే పెట్టుబడిదారీ ఆర్థిక సూత్రాలకు లోబడే అవి పనిచేయాల్సి వుంటుంది. ఈ వాస్తవాన్ని ఏంగెల్స్ తన యాంటీ డూరింగ్ గ్రంథంలో చాలా శక్తివంతంగా నిర్ధారించారు. పారిశ్రామిక సంస్థలు జాయింటు స్టాక్ కంపెనీలుగా పరివర్తన చెందటం గానీ, లేక వాటి యాజమాన్యం ప్రభుత్వం క్రిందకు బదలాయింపు కావటం గానీ

ఉత్పత్తి శక్తుల పెట్టుబడిదారీ స్వభావాన్ని తొలగించదని ఆయన చెప్పాడు. ఆయన ఇలా చెప్పారు. ; ఆధునిక రాజ్యాంగ యంత్రం "కార్మికులు, అలాగే వ్యక్తిగత పెట్టుబడిదారుల చొరబాటుకు వ్యతిరేకంగా, పెట్టుబడిదారీ తరహా ఉత్పత్తికి వలసిన స్థూల బాహ్య పరిస్థితులకు మద్దతునిచ్చే నిమిత్తం బూర్జువా సమాజం చేపటిన సంస్థ మాత్రమే. ఆధునిక రాజ్యాంగ యంత్రం, ఏ రూపంలో వున్నప్పటికీ, అది ప్రధానంగా పెట్టుబడిదారీ యంత్రం, పెట్టుబడిదారుల రాజ్యం, మొత్తం జాతీయ పెట్టుబడికి స్పష్టమైన ప్రతిరూపం. ఉత్పత్తి శక్తులను స్వాధీనం చేసుకునేందుకు అది ఎంతగా ముందుకు సాగితే, వాస్తవానికి అది అంతగా జాతీయ పెట్టుబడిదారీ అవుతుంది. అంతగా పౌరులను దోచుకుంటుంది కార్మికులు వేతన కార్మికులు గానే - శ్రామికవర్గం గానే వుంటారు. పెట్టుబడిదారీ సంబంధాలు తొలగిపోవు. అయితే అది ఒక పరాకాష్ఠకు తీసుకురాబడతాయి."

అలా తీసుకురాబడటంతో అది తలక్రిందులౌతుందని కూడా ఏంగెల్స్ వక్కాణించారు. "ఉత్పత్తి శక్తులపై ప్రభుత్వ యాజమాన్యం సంఘర్షణకు పరిష్కారం కాదు, అయితే ఆ పరిష్కారానికి అంశీభూతమైన సాంకేతిక పరిస్థితులు అందులో దాగివుంటాయి. ఆధునిక ఉత్పత్తి శక్తుల సామాజిక స్వభావాన్ని ఆచరణాత్మకంగా గుర్తించటంలోనే ఈ పరిష్కారం ఇమిడివుంది. అందువల్ల, ఉత్పత్తి సాధనాల సామాజికీకరణ స్వభావంతో ఉత్పత్తి, స్వాయత్తం, మార్పిడి పద్ధతులను సంలీనం చేయటంలో ఆ పరిష్కారం వుంది. మొత్తంగా సమాజం తప్ప మరెవ్వరూ అజమాయిషీ చేయలేనంతగా పెరిగిన ఉత్పత్తి శక్తుల యాజమాన్యాన్ని సమాజం బహిరంగంగా, ప్రత్యక్షంగా తీసుకోవడం ద్వారా మాత్రమే యిది జరుగుతుంది."

ఉత్పత్తి సాధనాలు అంతిమంగా జాయింటు స్టాక్ కంపెనీల యాజమాన్య శక్తిసామర్థ్యాలను మించిపోతాయన్న భావనతో ఏంగెల్స్, వాటిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవటం ఆర్థికంగా అనివార్యమౌతుందని పేర్కొన్నారు. అందువల్ల "....దీనిని అమలులోకి తెచ్చేది ఈనాటి ప్రభుత్వమైనా అది ఆర్థిక పురోగతే. సమాజం తనంతటతానుగా ఉత్పత్తి శక్తులన్నింటినీ స్వాధీనం చేసుకునేందుకు మరొక ప్రాథమిక చర్యను సాధించినట్లే అవుతుంది."

ఉత్పత్తి సామాజిక స్వభావానికి, పెట్టుబడిదారీ తరహా స్వాయత్తానికి మధ్యగల వైరుధ్యాన్ని సోషలిజం మాత్రమే పరిష్కరించగలదు; పెట్టుబడిదారీ వ్యవస్థలోని ప్రాథమిక వైరుధ్యం వల్ల ఉద్భవించిన చికిత్సకు సాధ్యంకాని దాని లోపాలను సోషలిజం రూపుమాపుతుంది. ఇతర శ్రమజీవులతో మైత్రితో కార్మిక వర్గ రాజకీయాధికార స్థాపన దీనికి తప్పనిసరి నియమం. అంటే పూర్తిగా కొత్త

తరహా రాజ్యాన్ని స్థాపించటం. ప్రాథమిక ఉత్పత్తి సాధనాలన్నింటినీ ప్రభుత్వ ఆస్తిగా, లేక ఆర్థిక వ్యవస్థలోని కొన్ని రంగాలను సహకార ఆస్తిగా మార్చడం అది మాత్రమే శ్రమజీవుల సౌకర్యం నిమిత్తం ఆర్థిక వ్యవస్థ, సమాజ సమతూక అభివృద్ధికి ప్రాతిపదిక అవుతుంది.

డి. కె. పి. సూత్రబద్ధ విధానాన్ని నిర్ణయించే సూత్రబద్ధ వైఖరి యిదీ. పెట్టుబడిదారీ వ్యవస్థక్రింద గల ప్రభుత్వరంగ సంస్థలు ఇప్పటికే "సోషలిజం అంశ" అనే మితవాద-అవకాశవాద అభిప్రాయాలను కూడా మేము దృఢంగా తిరస్కరిస్తున్నాం. యాజమాన్యంలో కార్మికవర్గ ప్రజాతంత్రయుత భాగస్వామ్యం లేకుండా, దాని అజమాయిషీ లేకుండా బడా పెట్టుబడి ఆర్థిక, రాజకీయ అధికారం క్రింద కేవలం జాతీయకరణ నుండి ముఖ్యమైన లాభాలేవో పొందగలమని శ్రమజీవులు ఆశించజాలరు. ఎఫ్. ఆర్. జి లో పనిచేస్తున్న ప్రభుత్వరంగ సంస్థలనుండి అసంఖ్యాక ఉదాహరణలు యివ్వవచ్చు.

ఉదాహరణకు, ఓల్క్స్ వాగన్ ప్రధానంగా ప్రభుత్వం చేతులలోనే వుంది. దానిని పాక్షికంగా తిరిగి ప్రైవేటు రంగానికి కటబెట్టిన తర్వాత కూడా దాని స్థిర పెట్టుబడిలో 40 శాతం ప్రభుత్వం క్రిందనే వుంది. (సగం ఫెడరేషన్‌కు, మిగతాది లోయర్ సాక్సోనీకి చెందుతుంది). ప్రత్యేక డిక్రీ ప్రకారం వాటాదారుల సార్వత్రిక సమావేశంలో ప్రభుత్వానికే మెజారిటీ ఓటు వుంది. అయినప్పటికీ ఓల్క్స్ వాగన్ ఏ యితర పెట్టుబడిదారీ సంస్థ వలెనే, యితర పెద్ద కార్ల ఉత్పత్తిదారులవలె నడుస్తున్నది. ధరలు పెంచడానికి మార్కెట్‌పై తనకు గల బలమైన స్థితిని అది బరితెగించి ఉపయోగించుకుంటున్నది; సిబ్బందిని బర్తరఫ్ చేస్తున్నది. వేతన కోతలతో పనిగంటలు తగ్గిస్తున్నది.

విద్యుచ్ఛక్తి పరిశ్రమలో కూడ పరిస్థితి యింతే ఇందులో పెద్దభాగం ప్రభుత్వం చేతిలో లేక దాని అజమాయిషీలో వుంది. ఉత్పత్తిలో కొంత ప్రభుత్వమే వాడుకుంటున్నందున, ప్రత్యేక చట్ట నిబంధన ద్వారా గవర్నింగ్ బాడీలలో ఓట్లు కేటాయించుకున్నందున బడా పెట్టుబడికి కూడా ప్రత్యక్ష ప్రాతినిధ్యం వున్నప్పటికీ విద్యుదుత్పాదన రంగం ప్రభుత్వ రంగంలో సమర్థవంతమైన భాగమే. ప్రభుత్వం వాటాలు కలిగి వుండటం-తరచూ యిది క్లిష్టమైన ఏర్పాటుగా వుంటుంది. - వల్ల ఇంధన పరిశ్రమలోని యితర రంగాలపై కూడా ప్రభుత్వం బలమైన పట్టు కలిగివుంది. అంటే, గోధుమవర్ణ బొగ్గు త్రవ్వకం వసతులలో అత్యధికం పరోక్షంగా ప్రభుత్వమే కలిగివుంది. సార్ బొగ్గు (ఫెడరేషన్, సార్‌లాండ్ యాజమాన్యం) ప్రభుత్వానికి ప్రత్యక్షంగా. పరోక్షంగా ప్రాతినిధ్యం వున్న రుహార్ కొహిలి జాయింటు-స్టాక్ కంపెనీలు గట్టిబొగ్గు త్రవ్వకంలో అత్యధిక భాగంపై అజమాయిషీ కలిగివున్నాయి. అయితే పెట్టుబడులలో

ప్రభుత్వ వాటాను. దాని పలుకుబడినీ ప్రభుత్వం విద్యుదుత్పాదక సముదాయాలలో పనిచేసేవారి ప్రయోజనం కొరకుగాని, లేక శ్రమజీవులకు సౌకర్యం కలిగించే ఇంధన విధానం అమలుకు గానీ వినియోగించబడటం లేదు. తద్భిన్నంగా, విద్యుచ్ఛక్తి సాధారణ వినిమయదారులు_కార్మికులు, ఉద్యోగులు, రైతులు, చేతి వృత్తులవారు అధిక ఛార్జీలతో దోచుకోబడుతున్నారు. విద్యుచ్ఛక్తి, ఉత్పాదక సంస్థల సిబ్బంది నుండి రాబట్టిన లాభంలో కొంతభాగం పరిశ్రమలకు అనుమతించే తక్కువ రేట్ల రూపేణా బడా పెట్టుబడిదారుల బ్యాంకు ఖాతాలకు మళ్ళించబడుతున్నది.

ఆర్థిక రంగాలను జాతీయం చేసినంత మాత్రాన సరిపోదని ఈ రెండు ఉదాహరణలు చాటిచెబుతున్నాయి. వాటి యాజమాన్యం అజమాయిషీలో కార్మికవర్గానికి వాటి సంఘాలకు శక్తివంతమైన భాగస్వామ్యం కల్పించబడినప్పుడు మాత్రమే దానిని శ్రమజీవుల ప్రయోజనాల కొరకు ఉపయోగించవచ్చు; తద్వారా మాత్రమే. ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న పరిశ్రమలలోని శ్రామికుల, ట్రేడ్ యూనియన్‌ల ద్వారా ప్రాతినిధ్యం వహించే మొత్తం కార్మికవర్గ ప్రయోజనాలను కాపాడవచ్చు.

అందువల్ల కమ్యూనిస్టులమైన మేము జాతీయకరణ డిమాండ్‌కే పరిమితం కాము; దానితో పాటుగా కార్మికుల ప్రజాతంత్ర అజమాయిషీని డిమాండ్ చేస్తూ వుంటాం. ఉదాహరణకు ఉక్కు పరిశ్రమకు సంబంధించి డి కె. పి. కార్యక్రమం ఇలా చెబుతోంది · ఉక్కు కర్మాగారాలను స్వాధీనం చేసుకోవాలి. ప్రజాతంత్ర అజమాయిషీ క్రింద జాతీయం చేయాలి వాటి యజమానులు లోగడ స్వీకరించిన సబ్సిడీలను పరిహారం చెల్లింపులో సర్దుబాటు చేయాలి గనులు, లోహ పరిశ్రమ యాజమాన్యంలో సిబ్బంది భాగస్వామ్యాన్ని విస్తరించాలని, సూపర్వయిజరీ కౌన్సిల్‌లో సముదాయాల ట్రేడ్ యూనియన్‌ల ప్రతినిధులకు మెజారిటీ హామీ కల్పించాలని, వారి ప్రయోజనాలన్నింటినీ పరిరక్షించే, కార్మికుల పోరాటాన్ని బలపరిచే హక్కు వుండాలని కార్యక్రమం వక్కాణిస్తోంది. ఈ ప్రతినిధులు కార్మికులకు జవాబుదారీగా వుండాలి వారి కార్యకలాపాలు అసంతృప్తిగా వున్నప్పుడు ఈ ప్రతినిధులను తొలగించే హక్కు శ్రామికులకు వుండాలి

వాస్తవానికి ఇందులోని ముఖ్యాంశం కార్మికులకు యాజమాన్యంలో భాగస్వామ్యం వుండే ప్రభుత్వరంగ ఉక్కు కర్మాగారాలలో పెట్టుబడులు పెట్టడం. ఉత్పత్తి, ఉపాధి ప్రణాళికపై ప్రజాతంత్ర అజమాయిషీ నెలకొల్పడం, తద్వారా కార్మికుల సామూహిక బర్తరఫ్‌లను సాధించడం. క్రమబద్ధంగా ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని ప్రవేశపెట్టడాన్ని, దానిని సాంఘిక పురోగతితో (తక్కువ పనిగంటలు

మరింత మానవతా దృష్టితో కూడిన పని పరిస్థితులు, ఉన్నత వేతనాలు, మేళవించటాన్ని సాధించటం లోపభూయిష్ట పద్ధతుల్లో పెట్టుబడులు పెట్టడాన్ని నిరోధించటం, వెచ్చించకుండా వున్న ధనాన్ని కొత్త ఉద్యోగాలు, అప్రెంటీస్ షిప్‌లు సృష్టించడానికి వినియోగించడాన్ని అనుమతించటం అటువంటి ప్రణాళిక ఆ ప్రాంత, స్థానిక అధికారుల అవసరాలకు అనుగుణంగా వుండాలి. పరిసర వాతావరణంపై ప్రతికూల ప్రభావాలతో పరిశ్రమ మరింతగా కేంద్రీకరణ పొందటాన్ని నివారించాలి సాపేక్షికంగా ఉత్పత్తి, సదుపాయాల వికేంద్రీకరణను ప్రోత్సహించాలి; ప్రభుత్వం యిచ్చే సబ్సిడీలపై వాటి సామాజిక ప్రభావం దృష్టి నుండి అజమాయిషీ వుండాలి; కొద్ది బృహత్తర సంస్థల చేతిలో అధికారం కేంద్రీకృతం కావడాన్ని నిలుపుచేయాలి.

అయినా ఆర్థిక వ్యవస్థలోని కొన్ని రంగాలను ప్రజాతంత్ర అజమాయిషీ క్రింద ప్రభుత్వానికి బదలాయించడం సోషలిజం కానేకాదు. లేక "సోషలిజం అంశ" కానేకాదు; అటువంటి అజమాయిషీ వున్నప్పటికీ పెట్టుబడిదారీ వ్యవస్థ చట్టాలను రద్దుచేయటం, జన్మతహా వచ్చిన దాని లోపాలను అధిగమించడం అసాధ్యం అయినప్పటికీ, జాతీయకరణ శ్రమజీవు లెదుర్కొంటున్న అనేక సమస్యలను సడలించవచ్చు. మొత్తంమీద వారి పోరాటానికి పరిస్థితులు మెరుగుపడతాయి. ఎందువల్లనంటే ప్రభుత్వరంగ పరిశ్రమల్లో సాధించిన విజయాలు ఆర్థిక వ్యవస్థలోని యితర రంగాల కార్మికులకు ధైర్యాన్నిస్తాయి.

అందువల్ల, ఏదో ఒక రంగం జాతీయకరణపై చర్చ జరిగే సందర్భంలో కమ్యూనిస్టులమైన మేము ప్రభుత్వరంగ పరిశ్రమలు "సోషలిజం అంశ" అనే మితవాద అవకాశవాద భ్రమలను వ్యతిరేకించటమే గాక, అది సోషలిజాన్ని చేరువ చేయదు గనుక పెట్టుబడిదారీ వ్యవస్థక్రింద జాతీయకరణ కొరకు పోరాడవలసిన అవసరం లేదని నిరాకరించే అతివాద వాగాడంబర దృక్పథాన్ని కూడా అంతే గట్టిగా తిరస్కరిస్తాం.

పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన సమస్యలు, ముఖ్యంగా నిరుద్యోగ సమస్య ప్రజాతంత్ర అజమాయిషీ క్రింద పనిచేసే ప్రభుత్వరంగ పరిశ్రమలలో ఎందువల్ల సడలుతుందో మనం స్పష్టంగా చూదాం.

ప్రభుత్వ బడ్జెట్ విధాన ప్రభావం ఉత్పత్తి స్వభావం, పరిమాణం విషయంలో ప్రైవేట్ గుత్తపెట్టుబడిదారీ రంగంకన్నా ప్రభుత్వరంగంపై వెనువెంటనే కనిపిస్తుంది. ఒక తరహా ఉత్పత్తిని ఆపుచేసి, సమాజానికి అవసరమైన మరో తరహా ఉత్పత్తిని ప్రైవేటురంగం చేబట్టేటట్టు చేయాలంటే అది పరోక్ష చర్యల ద్వారానే, నిర్దిష్టమైన ద్రవ్య, పన్నుల తగ్గింపు, సబ్సిడీలవంటి ద్వారానే అంతే

అధికలాభాలు ఆర్జించే అవకాశంతో ప్రలోభపెట్టడం ద్వారానే సాధ్యపడుతుంది. తద్భిన్నంగా, ప్రభుత్వరంగానికి అవసరమైన నిధులు ప్రభుత్వబడ్జెట్ నుండే నేరుగా వస్తున్నందున ప్రభుత్వ ఆదేశంద్వారా వాటి ఉత్పత్తిని అవసరమైనట్లుగా మరల్చవచ్చు. ప్రత్యక్షంగా లేక ప్రభుత్వ బ్యాంకులద్వారా ప్రభుత్వ ఉత్తర్వులను ఈ పరిశ్రమలముందు పెట్టొచ్చు. ఖజానానుండి వచ్చే నిధుల వినియోగంతో, లాభాల రూపంలో ప్రైవేటు గుత్తపెట్టుబడిదారీ బ్యాంకులకు ఆర్జనఅంతా మరల్చ బడదు కాబట్టి ఉపాధి అవకాశాలు ఉన్నతస్థాయిలో వుంటాయి. అంతేగాక, బ్యాంకింగ్ రంగాన్ని పాక్షికంగా జాతీయంచేసినా ప్రభుత్వ ఆర్థిక విధానాలపై బ్యాంకుల పలుకుబడిని కొంతమేరకు అదుపులో పెట్టడం సాధ్యమౌతుంది.

పెట్టుబడిదారీ వ్యవస్థలో సైతం, జాతీయం చేయబడిన సంస్థలను ప్రైవేటు పెట్టుబడిదారీ సంస్థలలో పనిచేసే లాభార్జన సూత్రాలకు భిన్నమైన సూత్రాలపై నిర్వహించవచ్చు. వెచ్చించిన పెట్టుబడికి ఏ దామాషాలో లాభం వస్తుందన్నది ప్రైవేటు వ్యాపారంలో ప్రధానాంశం; ప్రభుత్వరంగ పరిశ్రమలలో లాభార్జన స్థాయిని నిర్ణయించటంలో అది కల్పిస్తున్న సామాజిక సదుపాయం కొలబద్దను లెక్కలోకి తీసుకోవలసి వుంటుంది. ఉదాహరణకు, మూత నెదుర్కొంటున్న ఒక నౌకాశ్రయం వద్ద పరిసర వాతావరణ పరిరక్షణ పరికరాల ఉత్పత్తిని చేపట్టినట్లయితే, ఆ పరిశ్రమ లాభనష్టాల పట్టికలో ప్రభుత్వం దిగువ అంశాలను చేర్చవలసి వుంటుంది. ఈ విధంగా కానట్లయితే, పరిసర వాతావరణ ప్రతికూల పర్యవసానాలను తొలగించ టానికి వెచ్చించవలసిన సొమ్ము, నిరుద్యోగ సదుపాయాలకు (ఎందుకంటే పరిశ్రమ మూతబడితే కార్మికులు వీధుల పాలౌతారుకదా) చెల్లింపు నిమిత్తం అయ్యే వ్యయం, వారు పనిలో ఉన్నట్లయితే వారి వేతనాలపై పన్నురూపంలో ఖజానాకు వచ్చే గణనీయమైన జమలు.

ప్రైవేటు పరిశ్రమలకు భిన్నంగా ప్రభుత్వరంగ పరిశ్రమలు తమ కార్య కలాపాలలో రాజకీయ అలాగే ఆర్థిక అంశాల ప్రభావానికి లోనవుతుంటాయి. అందువల్ల, వాటిని ఎట్టి లాభాలులేకుండా (కొంతకాలమైనప్పటికీ) ప్రభుత్వ బడ్జెట్ సబ్సిడీలతో నడుపవచ్చు; అవి ఎట్టి లాభం ఆర్జించినా దానిని పనిపరిస్థితుల మెరుగుదలకు, ముఖ్యంగా పని గంటల తగ్గింపునకు ఉపయోగించవచ్చు; ఆ విధంగా ఉత్పత్తి కార్యస్థానాల సంఖ్యను పెంచవచ్చు.

ఇటువంటి దృక్పథాలను మేము వెల్లడించేటపుడు, అవి కేవలం అవకాశాలు మాత్రమేనని మాకు తెలుసు. కార్మికవర్గం, దాని ట్రేడ్‌యూనియన్‌లు తగినంత ఒత్తిడితెచ్చి, ప్రజాతంత్ర అజమాయిషీని, ముఖ్యంగా యాజమాన్యంలో పొంద

గలిగినమేరకు ఆ ప్రభుత్వరంగ పరిశ్రమలను నడిపేవారు ఆ విధంగా వ్యవహరించుతారు. ఈ అంశాలున్నప్పుడే అది సాధ్యం.

జాతీయం చేయబడిన పరిశ్రమల శక్తిసామర్థ్యాలు అసలు వినియోగించబడుతున్నాయా, అలా అయితే ఏ మేరకు అన్నది వర్గశక్తుల బలాబలాలపై, కార్మిక వర్గంలో వుండే చైతన్యం, నిర్మాణం, పోరాట సంసిద్ధతపై, అంతకన్నామించి అటువంటి పరిశ్రమలను కలిగివున్న ప్రభుత్వాన్ని అజమాయిషీ చేస్తున్న శక్తులపై ఆధారపడి వుంటుంది. కార్మికవర్గం, ఇతర గుత్తవ్యతిరేక శక్తుల పలుకుబడి ఎక్కువగా వున్నట్లయితే, ప్రభుత్వరంగ ఫ్యాక్టరీలు, పరిశ్రమల శక్తిసామర్థ్యాలు ప్రజాతంత్ర అజమాయిషీక్రింద మరింత విస్తృతంగా ముందుకు వస్తాయి.

అంతేగాక, సామాజిక ఒత్తిడిని ప్రైవేటు కార్పొరేషన్‌లపైకంటే ప్రభుత్వం పైన, ప్రభుత్వరంగ పరిశ్రమలపైన మరింత విజయవంతంగా ఇటువంటప్పుడు వినియోగించవచ్చు. పెట్టుబడిదారీ ప్రభుత్వం ఒక పారిశ్రామికవేత్తగా ఒత్తిడికి సాపేక్షికంగా సులువుగా లోనవుతుంది. ప్రైవేటు పారిశ్రామికవేత్తల యాజమాన్యం పెట్టుబడిదారీ ఆస్తిపై ఆధారపడివున్నందున తన ప్రతిపత్తి చట్టబద్ధతకు ధృవీకరణకు ఎటువంటి ఓటింగ్‌లోనూ పొందనవసరంలేదు. అందుకు భిన్నంగా, పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని పాలిస్తున్న పార్టీలు బూర్జువా పార్లమెంటరీ వ్యవస్థ క్రింద ఎన్నికల పరీక్షను ఎదుర్కొనవలసి వుంటుంది. తగినంత ఒత్తిడి తీసుకురాగలిగినట్లయితే పెట్టుబడిదారీ ప్రభుత్వంనుండి కొన్ని రాయితీలు రాబట్టేందుకు యిది పరిస్థితులను సృష్టిస్తుంది. అంతేగాక, కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్‌ల ఒత్తిడినుంచి తప్పించుకునేందుకు అంతర్జాతీయ గుత్తపెట్టుబడిదారీ సంస్థలవలే యిది ఇతరదేశాలకు తన కార్యకలాపాలను బదలాయించజాలదు.

జాతీయకరణ సమస్యపై ఎఫ్. ఆర్. జి. (పశ్చిమ జర్మనీ)లో ప్రస్తుతం సాగుతున్న చర్చలు సంక్షోభంవల్ల బాగా దెబ్బతిన్న పరిశ్రమల నెదుర్కొంటున్న సమస్యలు సహజంగానే ముందుపీటీన వున్నాయి. అయితే వర్గచైతన్యంగల శక్తులు ఈ సమస్యలకే పరిమితంకావడం తప్పిదమౌతుంది. అలా పరిమితమైనట్లయితే, "సంక్షోభభారాలను సమాజంలోని అన్ని గ్రూపులకూ సమానంగా పంపిణీచేయాలని" మాత్రమే కోరేవారి వైఖరినే వీరు చేబట్టే ప్రమాద ముందవొచ్చు. రాజకీయ, ఆర్థిక దృక్పథంనుండి కీలకమైనటువంటి కీలక రంగాలను ఏకకాలంలో జాతీయం చేయాలి అనేటటువంటి తీవ్రప్రభావంగల డిమాండ్‌లను ప్రస్తుత చర్చలో ముందుకు తీసుకరావడం ఎంతో విలువైనదిగా వుంటుంది. అందువల్లనే డి. కె. పి. కార్యక్రమం రాజ్యాంగంలోని 14, 15 ప్రకరణల కనుగుణంగా, అలాగే రాష్ట్రాల రాజ్యాంగాల కనుగుణంగా "ఆర్థిక వ్యవస్థలోని కీలకరంగాలను గుత్తపెట్టుబడి

వారుల యాజమాన్యంనుండి ప్రభుత్వరంగానికి ప్రజాతంత్ర అజమాయిషీక్రింద బదలాయించాలని డిమాండ్ చేస్తున్నది. ప్రధాన బ్యాంకులు, భీమాకంపెనీలు, ఇంధనం, ఉక్కుపరిశ్రమలు, అణుశక్తి, ఆయుధ పరిశ్రమలను జాతీయంచేయడాన్ని వాటిపై ప్రజాతంత్ర అజమాయిషీ నెలకొల్పడాన్ని సాధించడం ప్రధాన కర్తవ్యంగా డి. కె. పి. విశ్వసిస్తున్నది. జాతీయకరణ చర్యలు, ముఖ్యంగా నష్టపరిహారం చెల్లింపులు గుత్తపెట్టుబడి మరింత పెరిగేందుకు రాతీయకూడదు."

ప్రజాతంత్ర అజమాయిషీ క్రింద జాతీయకరణ కొరకు పోరాటాన్ని నిరాకరించేందుకు అతివాద వాగాడంబర వాదనలు చేసేవారు పరిగణనలోకి తీసుకోవలసిన ముఖ్యాంశాలలో ఒకటి- బడా పెట్టుబడినుండి, దాని ప్రయోజనాలను పరిరక్షించే రాజకీయవేత్తలనుండి వస్తున్న ఎదురుదాడి ఎఫ్. ఆర్. జి. లో ప్రభుత్వ యాజమాన్యం ఇప్పటివరకూ బడా పెట్టుబడి లాభాలు పెంచడానికే ప్రత్యక్షంగా, పరోక్షంగా ఉపయోగించబడుతున్నప్పటికీ జాతీయకరణ పథకాలను వారుతీవ్రంగాప్రతిఘటించారు. జాతీయకరణకై మరిన్ని చర్యలుతీసుకోవాలన్న పిలుపులు,కార్మికవర్గం దాని ట్రేడ్ యూనియన్లు సూచిస్తున్నట్లుగా ప్రజాతంత్రఅజమాయిషీ స్థాపనతో కూడినట్లయితే ప్రైవేటు యాజమాన్య "పవిత్రత" పైనే అనుమానాలు బయల్దేరతాయని, ప్రైవేటు యజమానులు లేకుండా జీవించాలని, వారు లేకుండా ఇంతకన్నా మెరుగైన జీవితం గడపవచ్చునని కార్మికులూ, ఉద్యోగులు తలపోస్తారేమోనని పాలకవర్గాలు భయపడుతున్నాయి. అధికారంలోని వారిలోని ఈ భయాలు పూర్తిగా నిరాధారమైనవేమీకాదు. కార్మికవర్గంలోని ఒక విభాగం కూడా పాల్గొన్న జాతీయకరణ చర్చ యొక్క అత్యంత ముఖ్యమైన ఫలితం ఏమంటే వర్గ చైతన్యాన్ని రూపొందించటంలో అది సానుకూల ప్రభావం కలుగజేసిందని కమ్యూనిస్టులమైన మేము విశ్వసిస్తున్నాం. మౌలిక సామాజిక పరివర్తనల కొరకు సోషలిజం కొరకు పోరాడేందుకు మరింత అనుకూల పరిస్థితులను యిది కల్పిస్తుంది. పెట్టుబడిదారీ దోపిడీ వ్యవస్థ లోపాలను నిర్మూలించటానికి సోషలిజం నిర్మాణ మొక్కటే మార్గం.

బడా పెట్టుబడి, రాజకీయాలలో దానికి ప్రాతినిధ్యం వహించే శక్తులు జాతీయకరణకొరకు ఎటువంటి చర్యలనైనా తిరస్కరించడమేగాక, లాభాలు ఆర్జిస్తున్న ప్రభుత్వ రంగంలోని పరిశ్రమలకు తిరిగి ప్రైవేటు రంగానికి అప్పగించాలని కోరుతున్నాయి. ఎఫ్ ఆర్ జి. లో 1950 దశకం చివరి భాగంలో ఈ క్రమం ఆరంభమైంది. "జనాభాలోని విస్తృత తరగతుల మధ్య పెట్టుబడి పంపిణీ" అనే ఊకదంపుడు మాటలతో, ప్రభుత్వరంగంలోని ప్రుస్సాగ్ కంపెనీ వాటాలు అమ్మివేయబడినాయి. దానితో దాని జాయింటుస్టాకు పెట్టుబడిలో

78 శాతం ప్రైవేటు యాజమాన్యంలోకి బదిలీ అయింది. అలాగే వార్క్స్‌వాగన్ కూడా పాక్షికంగా తిరిగి ప్రైవేటు రంగానికి అప్పగించబడింది: దాని పెట్టుబడిలో 60 శాతం "చిన్న వాటాల" రూపంలో ప్రైవేటు వ్యక్తులకు విక్రయించబడింది. 1965 లో ఫెడరల్ ప్రభుత్వం ఫెబాహోల్డింగ్ కంపెనీని యిదే రీతిలో పునర్వ్యవస్థీకరించింది; దానితో దాని పెట్టుబడిలో ఫెడరేషన్ వాటా 36 శాతానికి పడిపోయింది. లుఫ్తాన్సా విషయంలో కూడా ఇటువంటి చర్యలే తలపెటబడుతున్నాయి. బాన్ మితవాద మిశ్రమ ప్రభుత్వం తుదకు ప్రజా వినియోగ సర్వీసులను కూడా, ముఖ్యంగా పారిశుద్ధ్యం తొలగింపును ప్రైవేటు రంగానికి అప్పగించజూస్తున్నది. ఇది ఈ రంగంలో పనిచేస్తున్నవారి పని భారాన్ని తీవ్రంగా పెంచే కఠిన చర్యలకు దారితీస్తుంది, ఛార్జీలను గణనీయంగా పెంచుతుంది; ఈ సేవలకు శ్రమజీవులు డబ్బు చెల్లించుకోవలసివస్తుంది.

ప్రస్తుతమున్న అవరోధాలను ఎదుర్కొంటూ, జాతీయకరణ చర్యల అమలుకొరకు, ప్రజాతంత్ర అజమాయిషీ స్థాపన కొరకు కార్మికవర్గం, దాని ట్రేడ్ యూనియన్‌లు ఎంతో గట్టిగా కృషిచేయాల్సి వుంటుందని పైన చెప్పిన విషయాలు తేటతెల్లం చేస్తున్నాయి. ఈ చర్యలు చేబట్టాల్సిన అవసరాన్ని పరిశ్రమలు, సంస్థలకు సంబంధించిన కార్మికులు, ఉద్యోగులలో అత్యధిక సంఖ్యాకులేగాని, మొత్తం కార్మికవర్గంలోని మెజారిటీ కూడా అవగాహన చేసుకునేటట్లు చేసి, ఈ డిమాండ్ సాధనకు ముమ్మర పోరాటానికి వారిని సమీకరించగలిగినప్పుడు మాత్రమే ఈ కర్తవ్యం నెరవేరుతుంది. 

# ప్రజాదరణ పొందిన గ్రీక్ కమ్యూనిస్టుల దినపత్రిక

—వ్లదీమిర్ షెలిపిన్

*వరల్డ్ మార్క్సిస్టురివ్యూ స్టాఫ్ సభ్యుడు*

గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ దినపత్రిక అయిన *రిజోస్పాస్టిస్*, గ్రీక్ ఉదయం. సాయంత్రం పత్రికలన్నింటిలోకి అత్యంత ఎక్కువ ప్రజాదరణగల పత్రిక అని ఇటీవల ఒక రిపోర్టు తెలియజేసింది. దీని రోజువారీ, ఆదివారం సంచికలు అత్యంత విస్తృతమైన సర్క్యులేషన్ కలిగి వున్నాయి. చట్టరీత్యా బహిరంగంగా గత 11 ఏళ్ళుగా మాత్రమే ప్రచురించబడుతున్న ఒక వార్తాపత్రికకు యిది గొప్ప విజయం.

ఈ విజయానికి గడచిన బాట సుదీర్ఘమైనది. కఠోరమైనది. రిజోస్పాస్టిస్ అంటే అర్థం "ప్రగతిశీలి" అని అర్థం. ఈ శతాబ్దారంభంలో దీనికి నాంది ప్రస్తావన జరిగింది. గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ సంస్థాపనకు పూర్వం ఇదొక ప్రగతిశీల వార్తాపత్రికగా ప్రారంభించబడింది. 87 సంవత్సరాలకు పూర్వం పార్టీ కేంద్ర కమిటీ పత్రిక అయింది. నాటినుండీ అది గ్రీక్ కమ్యూనిస్టుల ప్రచార, ఆందోళన, ప్రజాబాహుళ్య నిర్మాణ సాధనంగా పనిచేస్తున్నది.

దేశాన్ని అభివృద్ధి నిరోధక నియంతృత్వ ప్రభుత్వాలు పరిపాలించిన అనేక దశాబ్దాలపాటు, రిజోస్పాస్టిస్ చిన్న పరిమాణంలో, ఒక మోస్తరు రూపురేఖలతో రహస్యంగా ముద్రించబడింది; అయినా అది ఎల్లప్పుడూ ప్రజలను పోరాటానికి ప్రేరేపించటానికి గ్రీస్‌లోని అతి మారుమూలలకు కూడా చేరుతూ వచ్చింది.

నాజీ ఆక్రమణ నుండి దేశం విముక్తి పొందిన 40 వ వార్షికోత్సవ వేడుక సందర్భంలో దాని వీరోచిత పుటల్లో ఒకటి ప్రజలకు వెల్లడిచేయబడింది. కలిటీ అనే ఏథెన్స్ జిల్లా మున్సిపల్ కౌన్సిల్ గత వసంతకాలంలో నిద్రాణంగా వుండే

స్కార్పి వీధిలో ఒక చిన్న ఇల్లు కొన్నది. ఆ కథ చెప్పడానికి అక్కడొక సమావేశం జరిగింది. అదేమంటే, 1942 నుండి 1944 అక్టోబరు వరకూ ఆ ఇంటి భూగర్భ గృహంలో కమ్యూనిస్టుల ముద్రణాలయం పనిచేసింది – అదే వారి రహస్య ముద్రణాలయం రిజోస్పాస్టిస్‌తోపాటు. జాతీయ విముక్తి సంఘటన పత్రిక అయిన "స్వేచ్ఛా గ్రీస్" పోరాట కరపత్రాలూ అది ముద్రించింది.

దండయాత్రికుల, వారి స్థానిక తొత్తుల కనులముందే ఈ పని అంతా సాగుతుండేది. ముద్రాపక సిబ్బంది స్వచ్ఛమైన గాలి పీల్చుకోవడానికి సైతం బయటకు రాకుండా వారాలతరబడి ఆ భూత గృహంలోనే ఉండేవారు. విద్యుచ్ఛక్తితో నడిచే విక్టోరియా బ్రాండ్ యంత్రం తొలుత కాలితోనడిచే యంత్రంగా మార్చబడింది శబ్దాన్ని మరింతగా తగ్గించేందుకు చేతితో త్రిప్పే యంత్రంగా మార్పు చేయబడింది. ముద్రణాలయం గూర్చి తెలిసిన కొద్దిమంది ఆ విషయాన్ని తమ కుటుంబ సభ్యులకు సైతం తెలియనివ్వకుండా రహస్యంగా వుంచారు. నాజీసైన్యం గెస్టాపోచే పట్టుబడిన, చిత్రహింసలకు గురైన కమ్యూనిస్టులెవరూ పత్రికను బయట పెట్టలేదు.

యుద్ధానంతరం, పార్టీ ముద్రణాలయాన్ని తుప్పుపట్టిపోకుండా అక్కడే భద్రపరిచింది; మరీ ఇటీవలనే, ఏథెన్స్‌లోని చిన్నచిన్న పాత గృహాలు కూలిపోయే ప్రమాదాన్ని ఎదుర్కొనే స్థితికి రావడంతో పాత భూతగృహాన్ని తెరవాలని, ప్రతిఘటన ముద్రణాలయ మ్యూజియంను స్కార్పి వీధిలో నెలకొల్పాలని నిర్ణయించబడింది. నాజీలకు, వారి అభివృద్ధి నిరోధక ముఠాలకు వ్యతిరేకంగా పోరాటంలో బ్రతికి బయటపడినవారికి దూరమైన కమ్యూనిస్టు ముద్రణాలయ వీరులకు కృతజ్ఞతా పూర్వకంగా ఈ మ్యూజియం నెలకొల్పాలని నిర్ణయం జరిగింది.

1974 లో పాశవిక సైనిక నియంతృత్వం పతనం కావడంతో పత్రికకు క్రొత్త అవకాశాలు ఆవిష్కరించాయి. అది ఆర్జించుకున్న గొప్ప నైతిక పలుకుబడితో రహస్య జీవితం నుండి బయటకు వచ్చింది. నూతన జీవన విధానానికి మారడం అంత సులువైనదేమీ కాదు అని గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు, పత్రిక ప్రధాన సంపాదకుడు అయిన తనాస్సిస్ కార్టెరోస్ నాతో అన్నారు గ్రీక్ ప్రమాణాల ప్రకారం సబబైన పెద్ద పరిమాణంలో మేము దినపత్రికను వెలువరించాలంటే మాకు నిజమైన ముద్రణాలయం అవసరం; నిపుణులైన పనివారి కొరత కూడా మాకు వుంది మమ్మెదుర్కొన్న సమస్యల పరిష్కారానికి వ్యవధి పట్టింది. రిజోస్పాస్టిస్, మూడేళ్ళ క్రితం మాత్రమే తన స్వంత ముద్రణాలయాన్ని ఏర్పరుచుకుంది; తన స్వంత సంపాదక కార్యాలయాలలోకి మారింది; పార్టీచే శిక్షణ ఇవ్వబడిన, పార్టీకి అంకితులైన స్త్రీ, పురుషులు సంపాదక విభాగంలో పనిచేస్తున్నారు.

విరాళాలు, వేలాది గంటల "అరుణ సుబోత్నిక్‌లు" (స్వచ్ఛంద పని దినాలు) పార్టీ కార్యాలయ నిర్మాణానికి సహాయపడినాయి గ్రీక్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ యంత్రాంగం ఇప్పుడీ భవనంలో ఉంది. ఇది పెద్ద అధునాతన భవనం ఏథెన్స్ భూగృహంలో పెరిస్పాస్ స్టేషన్ ప్రక్కనే ఇ వుంది. నిరంతరాయంగా కార్లు తిరుగుతూ వుండే బజారులో యిది వుంది.. రెండోవైపున భూమి పైగా వెళ్ళే మెట్రో రైలుమార్గాల ఆవల పారిశ్రామిక కర్మాగారాల భవనాలు వున్నాయి. యువకుల బృందం ఎల్లప్పుడూ ద్వారాలవద్ద డ్యూటీలో వుంటుంది. నిఘాతో వుండవలసిన సమయం ఇంకా గతించలేదు.

సంపాదక విభాగ కార్యాలయాలు, ముద్రణాలయం ఈ భవనంలో ఒకవైపు వుంది అది అంత విశాలమయినదేమి కాదు; పాత్రికేయులు మెసలడానికి తగినంతగా లేదు; అయినా వారు తమ వార్తలు రాయగలుగుతున్నారు దేశంలోని వివిధ ప్రాంతాలలో గల పత్రికా విలేకరులతో నిరంతర సంబంధం కలిగివుంటున్నారు. ఏథెన్స్ వార్తా సంస్థ, టాస్, అసోసియేటెడ్ ప్రెస్‌లనుండి టెలిప్రింటర్ ద్వారా అంతర్జాతీయ సమాచారం స్వీకరిస్తున్నారు. మాస్కో, అనేక యితర సోషలిస్టు రాజధానులలో, అలాగే పారిస్, న్యూయార్క్, బ్రస్సెల్స్, లండన్‌లలో పత్రికకు స్వంత విదేశీ విలేకరులున్నారు.

ముద్రణాలయ అధినేత, పార్టీ ముద్రణాలయాల నిర్వహణలో ప్రసిద్ధుడైన డిమిట్రియోస్ ఇపికారిడిస్ నాకు ముద్రణా విభాగాలన్నింటినీ చూపారు; అవి నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. అందులో 170 మంది పనిచేస్తున్నారు వారు ప్రధానంగా కమ్యూనిస్టులు, యువ కమ్యూనిస్టులు, గ్రీస్‌లో అత్యంత ఆధునికమైన ముద్రణా వసతులను ఫోటో సెట్టింగ్, అత్యంత వేగంగా నడిచే బహుళవర్ణ ముద్రణా యంత్రాలను వారు నిర్వహిస్తున్నారు. ఈ ముద్రణాలయం రిజోస్పాస్టిస్‌ని, గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ ఇతర పత్రికలను వెలువరించటమేగాక, యువజన వారపత్రిక *ఒడిజిటిస్*‌ను యితర ఆర్డర్లను ముద్రిస్తున్నది.

రిజోస్పాటిస్ ప్రస్తుతం గ్రీస్‌లోని అన్ని వార్తాపత్రికా దుకాణాలలో అమ్మబడుతున్నది. దాని ప్రకటన బోర్డులు ప్రధాన వీధులలో కనిపిస్తుంటాయి. మంచి అభిరుచితో వెలువరించబడుతున్న ఆదివారం సంచికను వేలాది పార్టీ క్రియాశీలురు పరిసర ప్రాంతాలలో కార్మికులు, ఉద్యోగులు, చేతివృత్తులవారు నివసించే ప్రాంతాలలో ఇంటింటికీ తిరిగి అందజేస్తుంటారు. పనిదినాలలో స్వచ్ఛంద పంపిణీదారులను పొద్దుపొడిచేసరికి ఫ్యాక్టరీ ద్వారాలవద్ద మనం చూస్తాం. శ్రమజీవులకు ఉదయాన్నే అందే తొలి సమాచారం ఈ సత్యవాణియే.

"పదార్థ సరఫరా సమస్యలేమైనా వున్నాయా?" అని పత్రిక ఫైనాన్షియల్ డైరెక్టర్ కె. నికోల్డ్‌సాస్‌ని అడిగాను.

"బూర్జువా పత్రికలవలె ఏదేమైనా లాభం ఆర్జించాలని మేము భావించం. పత్రిక ధర ఎల్లప్పుడూ చట్టబద్ధ కనీస స్థాయిలో వుంచబడుతున్నది. అమ్మకాల కమిషన్‌పై పనిచేసే న్యూస్‌స్టాండ్ నిర్వాహకులు సహజంగానే ఆకర్షణీయమయిన ప్రచురణలపట్ల ఆసక్తి చూపుతారు. అంతేగాక, వారిలో అందరూ రాజకీయంగా కమ్యూనిస్టుపార్టీ పట్ల సానుభూతి వున్నవారు కాదు. అందులో, అమ్ముడుపోని కాపీలు ఇప్పటికీ పెద్ద సంఖ్యలోనే ఉంటున్నాయి. అది నికర నష్టం అవుతున్నాయి. డబ్బు చెల్లించి చేసే వ్యాపార ప్రకటనలు మేము అతిగా చేయం. అంతేగాక ప్రైవేటు వ్యాపారులు తమ ప్రకటనలు మాకు ఇవ్వడానికి కూడా ఆసక్తి చూపరు.

"అయినప్పటికీ, రిజోస్పాస్టిస్‌కు ఆర్థిక నష్టం సాపేక్షికంగా తక్కువగానే వుంటున్నది. దానిని భర్తీ చేయటానికి పార్టీ సహాయపడుతోంది. ఇదే సందర్భంలో పత్రికకు సహాయపడుతున్న కమ్యూనిస్టులు, సానుభూతిపరుల గూర్చి మనం మంచి మాట చెప్పుకోవాలి. వీరు సాధారణంగా సాధారణ సగటు ఆదాయాలవారే. వీరు వివిధ కారణాల రీత్యా, పోరాటంలో, చిత్రహింసల ఛాంబర్‌లలో చంపబడిన వారిమిత్రులు, బంధువుల సంస్మరిస్తూ చిన్న చిన్న ప్రకటనలను, వాటితోపాటే నగదు పంపుతుంటారు. ఇదిలా ఉండగా న్యూస్‌ప్రింట్, ముద్రణా ఇంకు, వగైరా ధరలు పెరుగుతున్నప్పటికీ, పత్రిక ఖర్చులు బూర్జువా పత్రికల ఖర్చులకన్నా తక్కువగానే ఉంటున్నాయి. పాత్రికేయులూ, ముద్రణా కార్మికులూ పార్టీ నిర్ణయించిన కొద్దిపాటి వేతనాలు పొందుతున్నారు. అప్పుడప్పుడు జీతాలు లేకుండా కూడా పనిచేస్తుంటారు. తమ జీవిత కృషి అయిన పత్రికా నిర్వహణకు విరామ కాలాన్ని సైతం వెచ్చిస్తున్నారు."

ప్రజల్లో చైతన్యయుత ఆలోచనలు రేకెత్తించే మందుగా రిజోస్పాస్టిస్ పని చేస్తున్నది. రివిజనిస్టులు చీలిక కార్యకలాపాలతో తప్పుత్రోవ పట్టిన అనేకమంది సుప్రసిద్ధ యోధులను పార్టీ పతాకం క్రింద అది ఐక్యపరిచింది; ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ పలుకుబడి సంపాదించటానికి, మహిళలు, యువకుల పోరాటాలు పెంపొందించటానికి అది సహాయపడింది. ప్రజాతంత్ర శక్తులు జరిపే ప్రతి వర్గ పోరాటాన్ని తేక కార్యాచరణను రిజోస్పాస్టిస్ బలపరుస్తున్నది; దాని క్రియాశీల తోడ్పాటు తరచూ విజయం పొందుతున్నది.

ఏ విస్తృత స్థాయి రాజకీయ కార్యాచరణకైనా ఆందోళనకారునిగా, నిరాతగా వార్తాపత్రిక పనిచేస్తున్నది. జరుగనున్న ప్రదర్శనల విషయంపై వ్యాసాలు, ప్రముఖ ప్రజానాయకులతో, తరచూ కమ్యూనిస్టులే కానటువంటి నిష్ణాతులైన ప్రముఖులతో ఇంటర్వ్యూలను, దేశంలో వివిధ ప్రాంతాల్లో సన్నాహాలపై పురోగతి వార్తలను ప్రచురిస్తున్నది. అంతేగాక, సమావేశం జరిగే ఖచ్చితమైన స్థలం, సమయం, అందులో పాల్గొనే వారి పేర్లతో నిర్దిష్ట కార్యాచరణ పథకాన్ని వెల్లడి చేస్తున్నది.

ఉదాహరణకు, ఈ ఏడాది గ్రీస్‌లో జరిగిన 10 రోజుల శాంతి కార్యాచరణ కాలంలో బాలలు, వయోజనులు చేతులు చేతులు పట్టుకుని రెండు వరుసలలో గొలుసులాగా యాక్రో పాలెస్‌ని చుట్టివేసిన ఆగసు 6 న అలాగే చేసింది. "నక్షత్ర యుద్ధం వద్దు" "బాల్కన్స్‌ని అణ్వస్త్ర రహిత మండలంగా మార్చండి", "మధ్యధరా సముద్రం శాంతి సాగరంగా వుండాలి" అన్న ఆ పదిరోజుల కార్యాచరణ నినాదాలను రిజోస్పాస్టిస్ దేశవ్యాప్తంగా విస్తృత ప్రచారం చేసింది. "యాక్రో పాలిస్ విజ్ఞాపన"గా పిలవబడిన ప్రజా ఉద్యమంలో చేరిన యుద్ధ వ్యతిరేక ఉద్యమ ప్రతినిధులు, మహిళా, యువజన సంఘాల ప్రతినిధులూ అన్ని రకాల అణు పరీక్షలపై సోవియట్ యూనియన్ ఏకపక్షంగా మారిటోరియం ప్రకటించటాన్ని హర్షించారు; వాటిని పత్రిక ప్రచురించింది.

రిజోస్పాస్టిస్‌లో ప్రచురించబడే లోతైన వాదనలతో కూడిన వ్యాసాలు కార్మికవర్గ పాఠకులలోనే గాక, శ్రమజీవులలోని విస్తృత తరగతులలో క్రియాశీల ఆసక్తి కలిగిస్తాయి; రాజకీయ ప్రత్యర్థుల గౌరవాన్ని సైతం పొందుతాయి. కోర్టు ఇంజంక్షన్‌ల ద్వారా పత్రికను బలహీన పరచాలనే ప్రయత్నాలు పదేపదే విఫలమైనాయి. పత్రికపై ప్రారంభించబడిన ఏ ఒక్క కేసు కూడా గెలవలేదని సంపాదక కార్యాలయంలో నాకు చెప్పారు.

సంవత్సరం క్రితం రిజోస్పాస్టిస్ తన బహిరంగ ప్రచురణ దశమ వార్షికోత్సవం జరుపుకుంది. ఈ సందర్భంగా పార్టీ భవనంలోని ఆడిటోరియంలో వరుసగా ఐదురాత్రులు జరిగిన సమావేశాలకులో వెయ్యిమంది పట్టే ఆ హాలు ప్రతిరోజూ కిటకిటలాడింది విస్తృత పరిధిలో జరిగిన చర్చలు పత్రిక నిలకడగా మెరుగుపడుతూ ప్రయాణించిన గొప్పమార్గాన్ని చాటిచెప్పడానికి, దాని బలహీనతలు, ఇబ్బందులు వెలుగులోనికి తేవడానికి సహాయపడినాయి. అనేక నిర్దిష్టమైన వ్యాఖ్యలు, ప్రతిపాదనలు చేయబడినాయి. చర్చలపై ముగింపు సమీక్షచేస్తూ గ్రీస్ కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి చారిలోస్ ఫ్లోరాకిస్ ఇలా చెప్పారు :

"మా రిజోస్పాస్టిస్ పత్రిక, మా పార్టీ స్వభావం, విధానాన్ని అత్యంత బాధ్యతాయుతంగా, సుస్పష్టంగా, నచ్చే పద్ధతిలో ప్రతిబింబించాలని, శ్రమజీవులకు సాధ్యమైనంత సంపూర్తిగా సమాచారాన్ని అందజేయాలని, వారి పోరాట వస్తువుపై, నిజమైన మార్పుల అర్థంపై, సోషలిజం ధ్యేయాలపై, మా సమాజంలో ప్రగతిశీలమైన, ప్రజాతంత్రయుతమైన దానంతటిపై వెలుగు ప్రసారించాలని మేము కోరుకుంటున్నాం".

తమ దేశాన్ని ప్రేమించే, జాతీయ స్వాతంత్ర్యాన్ని, ఉద్రిక్తోపశమనను అభిలషించే గ్రీక్ పాత్రికేయులందరినీ ఉద్దేశించి ఆయన ఇలా అన్నారు : అణు యుద్ధం వల్ల రాగల సర్వవినాశనం గూర్చిన సత్యం ప్రజలకు తెలియజేయండి; బాల్కన్ ద్వీపకల్పం, మధ్యధరా సముద్రాలను అణ్వస్త్రరహిత మండలంగా మార్చేందుకు సహాయపడండి; భువిపై శాంతి, అంతర్జాతీయ సహకారం విజయం పొందటానికై పోరాడండి.

పార్టీ పత్రిక ముందుంచిన బాధ్యతాయుత కర్తవ్యాన్ని నెరవేర్చటానికి రిజోస్పాస్టిస్, దాని సంపాదక, ముద్రణా కార్మికుల సముదాయం శక్తివంచన లేకుండా పాటుపడుతున్నది.



# 1930 దశకం -
# స్మృతులు నాటి రాజకీయాలు

వై. వి. కృష్ణారావు

మా స్వగ్రామం కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకా, పెద్దఅవుటపల్లి. 1928లో వివిధ రాష్ట్రాలలో సైమన్ కమిషన్ సంచారం, దానికి వ్యతిరేకంగా పెల్లుబికిన నిరసనోద్యమంలో లాఠీఛార్జీలు, పోలీసు కాల్పులతో దేశం అంతా అట్టుడికిపోయింది. 1929లో మహాత్మాగాంధీ ఖద్దరు నిధి కోసం దేశం అంతటా పర్యటించారు. ఆ సందర్భంగా ఏప్రిల్ 7 నుండి 16 వరకు పశ్చిమ, తూర్పు కృష్ణా జిల్లాలలో పర్యటించారు. ఆ సందర్భంగా విజయవాడ నుండి నూజివీడు వైపు వెళ్ళే సందర్భంలో గాంధీగారి నిర్ణీత కార్యక్రమంలో లేకపోయినా మా గ్రామంలోని కాంగ్రెస్ నాయకులు అయాచితుల సీతారామశాస్త్రి, అవుటపల్లి సూర్యనారాయణ తదితరులు మహాత్మాగాంధీకి మా గ్రామంవద్ద స్వాగతం ఇవ్వటానికి నిర్ణయించారు గ్రామంలోని కాంగ్రెస్‌వాదులు. కొందరు స్త్రీలు కలిసి మా గ్రామంకు ఆనుకొని వున్న గ్రాండ్‌ట్రంకు రోడ్డుమీదికి వెళ్తున్నప్పుడు నేను కూడా వారిని అనుసరించాను. అప్పటికి నాకు 14 సంవత్సరాలు. ఉదయమే విజయవాడ నుంచి బయలుదేరిన గాంధీగారి కారు వెనుక రాష్ట్ర జిల్లా నాయకులు తమ తమ కార్లలో వచ్చారు. ఈ బృందం 9-30 గంటల ప్రాంతంలో మా గ్రామం వద్దకు రాగా అక్కడ పోగయిన జనం మహాత్మాగాంధీకి జై, భారతమాతాకు జై అనే నినాదాలు యిచ్చారు. గాంధీగారి కారు ఆగింది. కారునుండి దిగివచ్చి ఆయన క్లుప్తంగా 6, 7 నిమిషములు ఉపన్యసించారు. తెల్లవారి బానిసత్వంలో మనం పడుతున్న బాధలు, స్వాతంత్ర్య పోరాటాన్ని, ఖద్దరు ఉద్యమాన్ని గురించి వివరించి, చివరిలో ఖద్దరు నిధికి విరాళాలకై విజ్ఞప్తి చేశారు. అక్కడకు వచ్చిన స్త్రీలకు ఆభరణాలు ఇవ్వవలసిందిగా విజ్ఞప్తి చేశారు. అప్పటికప్పుడే కొందరు స్త్రీలు తమ తమ ఆభరణాలు వంటినుండి తీసియిచ్చారు. మరి కొందరు కొంత డబ్బును విరాళంగా ఇచ్చారు.

గాంధీగారి ఉపన్యాసం గ్రామ ప్రజలతో పాటు నన్నూ ఎంతో ప్రభావితుడ్ని చేసింది నా జీవిత పథాన్నే మార్చింది. నేను దేశ స్వాతంత్ర్య పోరాటం వైపు ఆకర్షింప బడడానికి గాంధీగారి ఉపన్యాసమే కారణం. ఆ రోజునే నేను మా ఇంట్లో వున్న రాట్నం మా అమ్మగారితో చెప్పి బాగు చేయించి నూలు వడకటం ప్రారంభించాను. అలా వడికిన నూలుతో ధోవతులు నేయించి కట్టుకోవటం మొదలు పెట్టాను దేశం నలుమూలలా జరిగినట్లే మా గ్రామంలో కూడా కల్లు దుకాణాల ముందు పికెటింగు జరిగింది.

1930 జవవరి 26న గాంధీగారు ప్రారంభించిన దండి ఉప్పు సత్యాగ్రహం యాత్రతో దేశం అంతటా ఉప్పు చట్టాలను ధిక్కరించడం ప్రారంభమైంది. కొన్ని గ్రామాలవారు సముద్రపు నీరును తెచ్చి ఉడకబెట్టి ఉప్పును తయారు చేసేవారు. కాని మా గ్రామంలో చవిటి భూములు వుండుట వలన భూమి పై పొరను తెచ్చి నీటిలో ఉడకబెట్టి ఉప్పును తయారు చేశారు మా గ్రామంలోని కొందరు కాంగ్రెసు నాయకులు.

నేను కూడా ఆ విధంగానే చవిటి భూమి పై పొరను తెచ్చి మా స్నేహితుని ఇంటివద్ద ఉప్పును తయారు చేశాను. దానిని చూచి నేను ఎంతో విజయం సాధించినట్లు గర్వపడ్డాను. ఆ రోజున నా సంతోషానికి మేరలేదు. తరువాత ఒక రోజున మలబారు పోలీసులు వచ్చి గ్రామంలో కాంగ్రెస్‌గా పేరుపడ్డ వారిపై లాఠీలు ప్రయోగించి ఇళ్ళలో వున్న రాట్నాలు విరగ్గొట్టి వీర విహారం చేసి వెళ్ళారు.

దేశంలోని యువకులు, కాంగ్రెసువారు, అతివాదులు చేసిన ఆందోళనను ప్రకటించిన నిరసనను పెడచెవిని పెట్టి, కర్కశ బ్రిటీషు ప్రభుత్వం యువకిశోరాలైన సర్దార్ భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురులను 1931 మార్చి 23న (కరాచీ కాంగ్రెసు మహాసభకు కొద్దిరోజులు ముందుగా) లాహోర్ సెంట్రల్ జైలులో నిర్ణీత సమయానికి ముందుగానే ఉరితీశారు. తెల్లవారే సరికి దేశమంతా ఈ వార్త దావానలం లాగా వ్యాపించింది. 24న దేశమంతటా నిరసన దినం పాటించబడింది. కోపోద్రిక్తులైన ప్రజలు అనేక నగరాలలో ప్రదర్శనలు, ఊరేగింపులు, హర్తాళ్ళు జరిపారు. మా గ్రామంలో కూడా ఆ రోజు సాయంత్రం నిరసన ఊరేగింపు జరిగింది. ఊరేగింపులో సర్దార్ భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు ఫోటోను పట్టుకొని ముందుండి నడిచే అదృష్టం నాకు కలిగింది ఊరేగింపు తరువాత బ్రిటిష్‌వారి నిరంకుశత్వాన్ని, అమానుషత్వాన్ని తీవ్రంగా ఖండిస్తూ ఒక బహిరంగసభ కూడా జరిగింది.

తరువాత కొద్ది నెలలకే బ్రిటిష్ ప్రధాని రామ్‌సే మేక్‌డానాల్డు ప్రకటించిన కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా, ఎర్రవాడ జైలులో మహాత్మాగాంధీ 1932

సెప్టెంబరు 20న నిరసన వ్రతం ప్రారంభించారు. ఆ సందర్భంలోనే మా గ్రామం లోని ప్రజలంతా "భారతీయులంతా ఒకటే" అని చాటిచెప్తూ హరిజనులు, సవర్ణ హిందువులు సంయుక్తంగా భోజనాలు చేశాం. ఆ తరువాత బహిరంగసభ కూడా జరిగింది. దానిలో నేను కూడా పాల్గొన్నాను.

ఈ కాలంలోనే బ్రాహ్మణ ఆధిపత్యానికి వ్యతిరేకత వివిధ కులాలలో ఒక తిరుగుబాటు ఉద్యమంగా వ్యాప్తి చెందింది. కమ్మ బ్రాహ్మణ, నాయీ బ్రాహ్మణ, సంఘాలు ఏర్పడటంతో బాటు, స్వకుల పౌరోహిత్యం ముందుకు వచ్చింది దీనిని బలపరుస్తూ వుండేవాడిని. 1934 తెన్నేరులో జరిగిన కృష్ణాజిల్లా కమ్మ మహాజన సభకు కూడా హాజరయ్యాను.

నేను గన్నవరం హైస్కూలులో విద్యార్థిగా ఉన్నప్పుడు 1934 జనవరి 16న బీహార్‌లో ఒక పెద్ద భూకంపం సంభవించింది. దీనిలో సుమారు 20.000 మంది ప్రజలు చనిపోవటం, కోట్లకొలది ఆస్తులకు నష్టం వాటిల్లడం జరిగింది. బీహారు భూకంప బాధితులకు సహాయ సహకారాలు అందివ్వడానికి బాబూ రాజేంద్రప్రసాద్ నాయకత్వంలో ఒక కేంద్ర సహాయ కమిటీ ఏర్పడింది. దేశం నలుమూలలనుండి కాంగ్రెసు విరాళాలు ప్రోగుచేయటం ప్రారంభించింది బ్రిటిషు వైస్రాయి అధ్యక్షతన మరొక కమిటి వుంది. రాజభక్తులందరూ వైస్రాయి కమిటీకి విరాళాలు పంపేవారు. దానికి పోటీగా దేశ భక్తులంతా విరివిగా విరాళాలు కాంగ్రెసు కమిటీకి పంపేవారు. మా గ్రామం నుంచి కూడా కొంతడబ్బు పాత బట్టలు పోగుచేసి విరాళంగా కాంగ్రెసు కమిటీకి పంపాం. ఈ కార్యక్రమంలో నేను చాలా చొరవగా పాల్గొన్నాను.

## పోలేపెద్ది నరసింహమూర్తితో పరిచయం

పోలేపెద్ది నరసింహమూర్తి అత్తగారిది మాస్వగ్రామమే. నరసింహమూర్తి గారు బెనారస్‌లో చదువుకుంటూ వేసవి కాలంలోను, ఇతర సందర్భాలలోను మా గ్రామం వస్తూ ఉండేవాడు వారి బావమరుదులు పిన మామగారు మా గ్రామంలో ముఖ్య కాంగ్రెసువాదులు, వారి ఇంటికి నేను తరుచూ వెళ్తూఉండేవాడిని. అందు వల్ల క్రమక్రమంగా నరసింహమూర్తిగారితో నాకు పరిచయం ఏర్పడింది. వీరు తరుచుగా సోవియట్ రష్యాను గురించి, సోషలిస్టు విప్లవం గురించి చెప్తుండేవారు. ఈ విధంగా నాలో ప్రప్రథమంగా అతివాద సోషలిస్టు బీజాలు నాటింది పోలేపెద్ది నరసింహమూర్తి గారేనని చెప్పాలి. తరునాత కాకినాడలో జరిగిన ప్రథమ ఆంధ్ర కమ్యూనిస్టు మహాసభలో ఈయన కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

1935 లో భారత జాతీయ కాంగ్రెసుకు బాబూ రాజేంద్రప్రసాదు అధ్యక్షుడిగా ఎన్నుకోబడ్డారు. ఆయన ఆంధ్రదేశ సంచారానికి వచ్చారు. తెలప్రోలులో జరిగిన ఆయన బహిరంగసభకు నేను హాజరయ్యాను.

1936 మార్చిలో జరిగిన యస్.యస్.యల్.సి. పరీక్షలో నేను ఉత్తీర్ణుడ నయ్యాను. కాలేజీ చదువుకు వెళ్ళాలనే పట్టుదలతో ఉన్నాను. కాని మా తండ్రిగారు దానికి అంగీకరించలేదు. ఆయన ఆరోగ్యము అంత మంచిది కానందున అప్పటికే మా భూమిని కౌలుకు యివ్వడం జరిగింది. పైగా అవి ఆర్థిక మాంద్యపు రోజులు. బస్తా ధాన్యం అప్పటికి కూడా 3, 4 రూపాయలే వున్నది. మాకున్న కొద్దిపాటి భూవసతిపై ఆధారపడి కాలేజీ విద్య చెప్పించటం సాధ్యంగాదని మా తండ్రిగారి అభిప్రాయం. ఏమి చేయాలి? కాలేజీ చదువుకు వెళ్ళాలనే నా పట్టుదల. మా తండ్రిగారి అభ్యంతరం చూస్తున్న మా బావగారు (అక్కగారి భర్త) తాను ఖర్చులన్నీ భరించి నన్ను చదివిస్తానని చెప్పారు.

## కమ్యూనిస్టులతో సంబంధాలు

అపుడు బయలుదేరి గుంటూరు ఎ. సి. కాలేజీలో ఇంటరు చదవటానికి వెళ్ళాను. ఉండటానికి గుంటూరు కమ్మహాస్టలులో చేరాను. ఇక్కడ కమ్మ హాస్టలు గురించి కొద్దిగా చెప్పవలసి ఉంటుంది. ఆ రోజుల్లో కమ్మ హాస్టలు అతివాద భావాలకు నిలయం. మొగ్గలో ఉన్న కమ్యూనిస్టు ఉద్యమానికి పెట్టని కోట లాగా ఉండేది. కమ్యూనిస్టు నాయకులుగా పేరుపడ్డ అనేకమంది ఈ హాస్టలుకు తరుచు వచ్చిపోతూ ఉండేవారు.

నేను హాస్టలులో చేరేటప్పటికి మాకినేని బసవపున్నయ్య కూడా అదే హాస్టలులో ఉంటూ బి.ఏ. చదువుతూ ఉండేవారు. అప్పటికే కమ్యూనిస్టుగా ఉన్న తుమ్మల వెంకట్రామయ్యగారి తమ్ముడు తుమ్మల వెంకటసుబ్బయ్య కూడా అదే హాస్టలులో ఉండేవారు. నేను వారి గదిలోనే చేరాను. తెనాలిలో వుంటూ తరుచూ గుంటూరు వచ్చే తుమ్మల వెంకట్రామయ్యగారు తరచు మా గదికి కూడా వచ్చి మాకు మార్క్సిస్టు సాహిత్యం అందించేవారు. వారు నాకు యిచ్చిన అమ్మ నవల చదివి ఎంతో ప్రభావితుడిని అయ్యాను. ముఖ్యంగా పావెల్ పాత్ర నాపై చెరగని ముద్ర వేసింది. క్రమక్రమంగా నేను రహస్యంగా నడిపే 'కమ్యూనిస్టు' మాస పత్రికను, మద్రాసు నుండి హెచ్.డి. రాజా సంపాదకత్వాన వస్తున్న న్యూయేజ్ పత్రికను కూడా చదవటం ప్రారంభించాను. ఈ కాలంలోనే నాకు పులుపుల శివయ్యగారితో పరిచయం ఏర్పడింది. ఆయన అప్పటికే గుంటూరు జిల్లా పార్టీ ఆర్గనైజింగ్ సెక్రటరీ ఆయన అందించిన 'మీరట్ కుట్రకేసులో ముద్దాయిలైన

కమ్యూనిస్టులు యిచ్చిన వాఙ్మూలం (మీరట్ థీసిస్) సైక్లోసైల్ ప్రతిని కూడా చదివాను.

ఆ సంవత్సరమే (1936 అక్టోబరు 17, 18 తేదీలలో) గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ మహాసభకు అధ్యక్షత వహించేందుకు తన భార్య ఇద్దరు కుమార్తెలతో డాంగే గుంటూరు వచ్చారు. ఆ సందర్భంలోనే ఆయన మేధావుల నుద్దేశిస్తూ, కొత్తపేటలోని పొగాకు కంపెనీ హాలులో గతితార్కిక, చారిత్రక, భౌతికవాదాలపై మాట్లాడారు. ఆయన తన సుదీర్ఘ ఉపన్యాసంలో ధాతువుల మార్పు, అణువుల సంఖ్య కూర్పు వాటి మార్పులు గురించి సవివరంగా తెలియ చెప్పారు ఆ సభకు హాజరైన నాకు, ఈయన ఉపన్యాసం, గతితార్కిక, చారిత్రక భౌతిక వాదాలు అంటే ఏమిటో తెలుసుకొనేందుకు చాలా ఉపయోగపడింది. డాంగే ఉపన్యాసంతో సభకు వచ్చిన అనేకమంది ప్రభావితులైనట్లే నేను కూడా చాలా ప్రభావితుడినయ్యాను.

ఆ మరుసటిరోజే (అంటే 19 వ తేదీన) రాబోయే ఎన్నికల ప్రచార నిమిత్తం ఆంధ్ర దేశంలో విస్తృతంగా పర్యటిస్తున్న కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ గుంటూరు వచ్చారు స్వరాజ్ మైదానంలో (ఇప్పటి గాంధీ పార్కు) జరిగిన పెద్ద బహిరంగ సభలో ఆయన, ఆనాటి రాజకీయ పరిస్థితులు, దేశ స్వాతంత్ర్యం, సోషలిజం గురించి ఉద్రేకంగా గంభీరోపన్యాసం ఇచ్చారు. ఈయన మాటలు శ్రోతలందరినీ ఉర్రూతలూగించాయి.

ఈ విధంగా నేను రాజకీయాలలో చురుకుగా పాల్గొనటంతో నాకు గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శి గౌస్‌బేగ్‌తోను, కాంగ్రెసు ప్రముఖులైన నేతి చలపతి, డా॥ చలపతి, చావలి సూర్యనారాయణగార్లతోనూ పరిచయం ఏర్పడింది. క్రమక్రమంగా ఎన్నికల కార్యక్రమాన్ని నిర్ణయం చేసేందుకు జరిగే కాంగ్రెసు సభలకు కూడా హాజరవడం ప్రారంభించాను. అప్పటికే నాకు గుంటూరులో వున్న పులుపుల శివయ్య, రామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్య, దుర్గా కృష్ణమూర్తి, చతుర్వేదుల పార్థసారథి, మోడుమూడి వెంకటాచారి మొదలగు నాయకులు అందరితోను పరిచయం కలిగింది. వీరి ఆధ్వర్యంలో జరిగే మీటింగులు అన్నిటికీ నేను హాజరవుతూ ఉండేవాడిని.

## 1937 ఎన్నికలు

1936 చివరికి వచ్చేసరికి రాష్ట్రంలో ఎన్నికలవేడి బాగా అందుకుంది. అయితే ఈ ఎన్నికలలో 1935 వ రాజ్యాంగ చట్ట ప్రకారం కేవలం 10 రూ॥లు పైన శిస్తు చెల్లించేవారికి, చదువుకున్నవారికి మాత్రమే ఓటుహక్కుండేది. జనరల్

నియోజకవర్గాలతోపాటు కార్మిక, ముస్లిం, ఇండియ క్రిస్టియన్, ఆంగ్లో ఇండియన్ మహిళా నియోజకవర్గాలు విడిగా ఉండేది.

రాష్ట్రంలోని జమీందారులు, భూస్వాములు అప్పుడు అధికారంలోవున్న జసిస్‌పార్టీని బలపర్చారు. వీరికి వ్యతిరేకంగా సోషలిస్టులు, కమ్యూనిస్టులు, విద్యార్థులు, యువజనులు కాంగ్రెసు పార్టీని బలపర్చడం జరిగింది.

వీరంతా కాంగ్రెసును బలపర్చి పెద్ద ఎత్తున కాంగ్రెసు అభ్యర్థులకు ప్రచారం చేశారు.

గుంటూరు తెనాలి పట్టణ నియోజకవర్గానికి కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు దేశభక్త కొండా వెంకటప్పయ్యగారిని అభ్యర్థిగా నిర్ణయించింది. కాంగ్రెసు అభ్యర్థిత్వమునకు ప్రయత్నించిన నడింపల్లి నరసింహారావు టిక్కెట్టు రాకపోవడంతో స్వతంత్ర అభ్యర్థిగా పోటీకి దిగారు. తెనాలి గుంటూరు, సత్తెనపల్లి తాలూకాల రూరల్ నియోజకవర్గానికి జస్టిస్ పార్టీ తరుపున కొల్లి సత్యనారాయణ చౌదరి (అడ్వకేటు) పోటీ చేశారు. కాంగ్రెసు అభ్యర్థిగా చాపరాల కృష్ణ బ్రహ్మానందం గారు పోటీ చేశారు.

నర్సరావుపేట, వినుకొండ, పల్నాడు తాలూకాల నియోజకవర్గానికి జస్టిస్ పార్టీ తరపున ఆ పార్టీ ప్రముఖ నాయకుడైన జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కాంగ్రెసు తరపున కాసు బ్రహ్మానందరెడ్డి పెద్ద అన్నగారైన వెంకటరెడ్డిగారు పోటీ చేశారు.

నేను ఒక విద్యార్థి బృందాన్ని వెంటతీసుకొని పై రెండు నియోజకవర్గాలలో కాంగ్రెసు తరఫున ప్రచారం చేశాను గుంటూరు సంగడిగుంటలో ప్రచారం చేస్తున్న నా పైన నరసింహారావుగారి మనుషులు ఒకనాటి చేయి చేసుకున్నారు.

మేడికొండూరులో జస్టిస్ పార్టీకి, కాంగ్రెసుకి ఒకే జాయింట్ ప్లాట్‌ఫారం ఏర్పాటు చేశారు. కాంగ్రెసు తరపున నేను ఉపన్యసించాను జస్టిస్ పార్టీ తరపున అభ్యర్థి సత్యనారాయణగారు వస్తారని ప్రకటించారు కాని వారు రాలేదు.

ఈ ప్రచార సందర్భంలోనే చిలకలూరిపేటలో కాంగ్రెసు తరపున జరిగిన బహిరంగసభలో నేను ప్రధాన వక్తని.

నాదెండ్ల ఫిర్కాలో ప్రచారంచేస్తూ (కాలినడకన) నర్సారావుపేట చేరాం. పోలింగు రోజున వినుకొండ తాలూకా ముప్పాళ్ళ అనే గ్రామంకి వలంటీర్లుగా వెళ్ళాం. పోలింగు అయిన తరువాత సాయంకాలానికి వినుకొండ చేరాం. అప్పటికి మాకు ఇంటర్మీడియట్‌లో తెలుగు పాఠ్య అంశాలలో కవికోకిల గుర్రం జాషువా

కవి రచించిన ఫిర్దౌసి అనే ఖండ కావ్యం కూడా వుంది. అందువలన జాషువా కవిని కలవాలనే కుతూహలంతో వినుకొండ హైస్కూలులో తెలుగు పండిట్‌గా పని చేస్తున్న ఆయన్ని కలవడానికి కొంతమంది విద్యార్థులతో వెళ్ళాను. ఆయన మాతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడి ఆ కావ్యంలోని రెండు పద్యాలు చదివి వినిపించారు.

రాజమండ్రి, ఏలూరు, గుంటూరు కార్మిక నియోజక వర్గానికి రైల్వే కార్మిక నాయకుడైన వి. వి. నరసింహం కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేశారు. వీరి విజయానికి గుంటూరులోని కార్మికుల్లో ప్రచారం చేశాను. ఈ ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయాన్ని సాధించింది.

36 డిసెంబరులో జరిగిన ఫెయిజ్‌పూర్ కాంగ్రెసు మహాసభలో విడుదల చేసిన ఎన్నికల ప్రణాళికలో రైతాంగ కోర్కెలును చేర్చబడ్డాయి. దీనితో రైతాంగంలో పెద్ద ఎత్తున ఉత్సాహం పెల్లుబికి జమిందారులుతో నిండిన జస్టిస్ వారిని ఓడించి కాంగ్రెసును గెలిపించాలని కోర్కె సర్వత్రా వ్యక్తమైంది. రైతాంగం కాంగ్రెసుకే ఓటు వేశారు.

1937 ఎన్నికలలో కాంగ్రెసుకి మద్రాసు, ఇతర రాష్ట్రాలలో మంచి మెజారిటీ వచ్చింది. కాని కాంగ్రెసు కోరినట్లు గవర్నర్ తనకు 1935 రాజ్యాంగ చట్టప్రకారం సంక్రమించిన విచక్షణాధికారాలను ఉపయోగించనని ఎటువంటి హామీ ఇవ్వనందువల్ల వెంటనే కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడలేదు. మద్రాసులో ఈ అదను ఉపయోగించుకొని మద్రాసు గవర్నరు సర్ కూర్మా రెడ్డి నాయుడు నాయకత్వాన ఒక నడమంత్రపు మంత్రివర్గాన్ని ఏర్పాటుచేశారు. ఒంగోలు సమీపంలోనున్న కొత్తపట్నంలో వేసవి రాజకీయ పాఠశాల మే 1 నుండి ఏర్పాటు చేయబడింది. దీనికి హాజరవడానికి నేను రైలుకు ప్రయాణమవుతున్నాను. అసలే నా కాలేజి చదువుకు వ్యతిరేకంగా వున్న మా తండ్రిగారు నా రాజకీయ కార్యకలాపాలపట్ల ఆగ్రహించి, బాగా కోప్పడినందువల్ల నా ప్రయాణాన్ని ఎంతో బాధతో విరమించుకొన్నాను.

ఈ పాఠశాలను మద్రాసు ప్రభుత్వం నిషేధించి, విద్యార్థులపై క్రూరంగా లాఠిచార్జి జరిపి, కొందరిని అరెస్టు చేసింది. దీని వివరాలలోకి ఇక్కడ పోవడం లేదు. అరెస్టు చేసిన వారిలో కొందరిపై కేసులు పెట్టడం, వారిలో శిక్షలు పడ్డ కొందరిని గుంటూరు నుండి రాజమండ్రి జైలుకు రైలులో తీసుకువెళ్ళే సందర్భంలో నేను, మరికొందరు విద్యార్థులు, సోషలిస్టులు, తదితరులు స్టేషనుకు వెళ్ళి రాజమండ్రి వెళ్ళే కామ్రేడ్సుకు జై జై ధ్వానాలతో ఘనంగా వీడ్కోలు చెప్పాం.

# రైతు యాత్ర

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం 1937 జూలై 3 నుండి 1938, మార్చి 27 వరకు ఇచ్ఛాపురం నుండి మద్రాసుకు చరిత్రాత్మకమైన రైతు యాత్రను నడిపింది. దీనికి రాష్ట్ర సంఘ అధ్యక్షులు కీ॥ శే॥ కొమ్మారెడ్డి సత్యనారాయణగారు, ప్రముఖ రైతు నాయకుడు చలసాని వాసుదేవరావు నాయకత్వం వహించారు. ఈ యాత్రాదళం వచ్చే సమయానికి ఆయా జిల్లాలలో జిల్లా రైతు దళాలు కూడా పర్యటించి తాము పర్యటించిన గ్రామాలలోని సమస్యలపై రైతుల నుండి సేకరించిన మహజర్లు జిల్లా కలెక్టర్లకు అందజేయటం జరిగింది. గుంటూరు జిల్లా రైతు దళం జిల్లా కలెకరుకు ఆ విధంగా మహజర్లు అందజేసే రోజున నేను కూడా ఆ దళం వెంట కలెక్టరు ఆఫీసుకు వెళ్లాను.

## ఆనాడు విద్యాసంస్థలలోని పరిస్థితులు

ఆనాడు కాలేజీలు హైస్కూళ్ళుకూడ చాల తక్కువ. కాలేజీల విషయం చూస్తే మొత్తం ఆంధ్రరాష్ట్రంలో కేవలం విశాఖపట్టణంలో – ఆంధ్ర యూనివర్శిటీ ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల, మెడికల్ కాలేజీ, ఎ.వి.యస్. కళాశాల.

విజయనగరంలో – విజయనగరం రాజా కళాశాల

కాకినాడలో – పి. ఆర్. కళాశాల

రాజమండ్రిలో – గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల

బందరులో – హిందూకళాశాల, నోబుల్ కళాశాల (1938 వరకు వున్నది)

గుంటూరులో – ఏ. సి. కాలేజీ, హిందూకళాశాల

నెల్లూరులో – వి. ఆర్. కాలేజీ

అనంతపురంలో – గవర్నమెంటు కాలేజీ (మద్రాసు యూనివర్శిటీకి అనుబంధించబడింది) మాత్రమే వుండేవి.

ఈ కాలేజీలలో కేవలం ఆంధ్ర యూనివర్శిటీలోనున్న సైన్సు అండ్ ఆర్ట్సు కాలేజీ రాజమండ్రి, అనంతపురం కాలేజీలు మాత్రమే ప్రభుత్వ యాజమాన్యంలో వుండేవి. మిగిలిన కాలేజీలన్నీ ప్రయివేటు యాజమాన్యంలో వుండేవి. ఆనాటి విద్యాసంస్థలలో పరిస్థితి చూచినట్లయితే కమిటీవారు లేనిపోని నెపాలమీద విపరీతమైన జరిమానాలు విధించేవారు. సస్పెండ్ చేసేవారు. కష్టాల నెదుర్కొం టానికి ఏర్పడ్డ యూనియన్లను దౌర్జన్యంగా అణచివేసేవారు. అందులో పాల్గొన్న విద్యార్థులందరిని క్రూరంగా ఒత్తిడిచేసి క్షమాపణ పుచ్చుకోవడం, నిరంకుశమైన నియమాలుపెట్టి విద్యార్థులు తమ కష్టాలు అధికారులకు – సంఘంద్వారా కాకుండా

వ్యక్తిగతంగా, నేరుగా కాకుండా లెక్చరర్ల ద్వారా, వ్రాతలద్వారా కాకుండా మాట ద్వారా చెప్పుకోమనేవారు విద్యార్థి సంఘములను ఏర్పడకుండా చేయడం మొదలైన నిరంకుశ చర్యలకు పరిపాలక బృందం పాల్పడేది. విద్యార్థులు కాలేజీలో చేరే టప్పుడు కాలేజి పరిపాలకులచే నియమించబడిన (కాలేజీ సంస్థకు సంబంధించిన పెద్దలచే కూడిన) ఒక కమిటీ సిఫార్సు లేనిదే చేర్చుకొనేవారుకాదు. విద్యార్థులు యింకా కొన్ని కఠినమైన నిబంధనలకు లోనుగావలసి వచ్చేది.

## 14 వ ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభ

హెచ్చుగావుండే ట్యూషన్‌ఫీజు రద్దు చేయాలని, పరీక్షలకు పంపబడేముందు వుండే వడపోత పరీక్ష విధానాన్ని రద్దు చేయాలని, కాలేజీలలోవున్న స్పోర్ట్సు మొదలైన వివిధ కమిటీలలో విద్యార్థులకు ప్రాతినిధ్యముండాలని విద్యా నిబంధనలు సవరించాలని ఆనాటి విద్యార్థులప్రధానమైన కోర్కెలు. వీటిని గురించి పోరాడేందుకే విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, బందరు వద్దనున్న చిట్టిగూడూరు సంస్కృత కళాశాల మొదలైనచోట్ల స్థానికంగా విద్యార్థి సంఘాల ఏర్పడ్డాయి. అప్పటికి 1936 లో లక్నోలో జరిగిన అఖిల భారత విద్యార్థి సంఘం ఏర్పాటైంది. 1936లో విశాఖపట్నం మెడికల్ కాలేజి విద్యార్థులు ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘం పేరుతో వ్యవహరిస్తూ, దానిని అఖిలభారత సంఘానికి అనుబంధించారు. రాష్ట్రంలోవున్న అన్ని విద్యార్థి సంఘాలను సమన్వయపరుస్తూ విద్యార్థి ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోవాలని రాష్ట్ర విద్యార్థి సంఘాన్ని ఏర్పరచి సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగానూ విద్యార్థుల హక్కులకొరకు పోరాడాలని నిర్ణయించటం జరిగింది. ఈ మహాసభను గుంటూరులో ఏర్పాటు చేయటానికి నాటం నరసింహారావు కార్యదర్శిగా ఒక ఆహ్వాన సంఘం ఏర్పడింది. అందులో నేను కూడా వున్నాను. ఈ మహాసభకు అధ్యక్షుడిగా యస్ యస్. బాట్లీవాలా (మీరట్ కుట్రకేసు నింది తుడు. ప్రముఖ కమ్యూనిస్టు) సు శ్రీమతి హాజరాబేగం గారిని ప్రారంభకులుగాను ఆహ్వానించడం జరిగింది. ఈ మహాసభ 1937 ఆగస్టు 27, 28 తేదీలలో జరిగింది. ఈ సందర్భంగా బాట్లీవాలా ఆంధ్రదేశంలో విస్తృతంగా పర్యటించి అనేక విద్యార్థి సభల్లో ఉపన్యసించారు. వేరే హాలు ఎక్కడ లభ్యం కానందున ఈ విద్యార్థి మహాసభ కమ్మ హాస్టలులోనే జరిగింది. విశాఖపట్నం, కాకినాడ, బందరు, చిట్టి గూడూరు మొదలగు ప్రదేశాలు నుండి దాదాపు 100 మంది ప్రతినిధులు హాజ రయ్యారని నాకు జ్ఞాపకం.

ఈ మహాసభకు విశాఖనుంచి కుప్పా వెంకటరామశాస్త్రి, గద్దె రామ కోటేశ్వరరావులతో కూడిన పెద్ద ప్రతినిధివర్గం వచ్చింది. తీర్మానాల్లో ఆనాటి విద్యార్థి సమస్యల మీద, సామ్రాజ్యవాదుల పాలనకు వ్యతిరేకంగా దేశ

స్వాతంత్ర్యం కోసం డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగానూ తీర్మానాలు చేయటం జరిగింది. ఇంకా ఆనాడు ఉన్న అనేక విద్యార్థి సమస్యల మీద కూడా తీర్మానాలు ఆమోదించటం జరిగింది ఈ మహాసభలో రాష్ట్ర విద్యార్థి సంఘానికి కార్యదర్శిగా మాకినేని బసవపున్నయ్య ఎన్నుకోబడ్డారు. జాయింటు కార్యదర్శులుగా నేను, కాట్రగడ్డ రాజగోపాలరావు, విశాఖ నుంచి ఒకరు ఎన్నుకోబడ్డారు. ఈ మహాసభను మొదట్లో ప్రథమ రాష్ట్ర విద్యార్థి మహాసభగా ప్రకటించారు. కాని అంతకు ముందు 13 రాష్ట్ర విద్యార్థి మహాసభలు జరిగివుండడంవల్ల కొనసాగింపుగా దీనిని 14వ విద్యార్థి మహాసభగా పిలవడం జరిగింది.

ఈ విద్యార్థి మహాసభ తరువాత రాష్ట్ర విద్యార్థి ఉద్యమం ఒక మలుపు తీసుకుంది. అనేక హైస్కూల్సులోను, అంతవరకు విద్యార్థి సంఘాలు ఏర్పడని కాలేజీలలోనూ విద్యార్థి సంఘాలు ఏర్పడ్డాయి. జిల్లా విద్యార్థి మహాసభలు జరిగి జిల్లా విద్యార్థి సంఘాలు ఏర్పడ్డాయి.

గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి, విశాఖపట్టణం జిల్లాలలో జిల్లా సంఘాలు ఏర్పడ్డాయి.

## చరిత్రాత్మక ఎ. సి. కాలేజి విద్యార్థుల సమ్మె

ఆ రోజుల్లో ఇంగ్లీషువారి పరిపాలనలో అమలులోనున్న బానిస విద్యా విధానం, దాని లక్ష్యమేమిటో మనకు తెలుసు. విద్యాభివృద్ధి చేయాలనికాదు ఇంగ్లీషు పాలకుల ఉద్దేశ్యం. ఎంతో కష్టపడి, డబ్బు వెచ్చించి ఎలాగో చదువుకుందామని ముందుకు వస్తున్న విద్యార్థులను కూడా కాలేజి అధికారులు అనేక విధాల హింసించేవారు. వారి చదువులకు అడ్డంకులు కల్పించేవారు.

ఆ రోజుల్లో విద్యార్థులను పబ్లిక్ పరీక్షలకు పంపే ముందుగా డిశంబరు మాసంలో సెలక్షన్ పరీక్ష పేర ఒక ప్రత్యేక పరీక్షను పెట్టేవారు. దీనికి పంపే ముందుగా విద్యార్థులకు సంవత్సరం మొత్తం మీద చదవాల్సిన పాఠ్యాంశాలను ఆదరా, బాదరా 4మాసాలలోనే చెప్పేవారు. రోజుకు రెండు పరీక్షలుండేవి. విద్యార్థు లందరినీ పరీక్షకు పంపకుండా, పంపినవారిలో నూటికి ఏ 30 మందో ప్యాసయితే అదే తమ గొప్పఅని చెప్పుకునేవారు విద్యాలయ అధికారులు. ఈ విధంగా పబ్లిక్ పరీక్షలలో పెద్ద వడపోత జరుగుతుంటే దానికి ముందు మరొక వడపోత. ఇది విద్యార్థుల అభివృద్ధికి పెద్ద ఆటంకంగా తయారైంది. విద్యార్థులందరిని పబ్లిక్ పరీక్షలకు పంపకుండా వడపోసే ఈ డిటెన్షన్ విధానం హైస్కూళ్ళు, కాలేజీలు అన్ని విద్యాసంస్థలలోనూ ఉండేవి. విద్యార్థుల పాలిటికి ఇదొక పెనుభూతంగా తయారైంది.

తమ మామూలు పద్ధతి ప్రకారం ఏ. సి. కాలేజి అధికారులు 1937 డిశంబరులో ఇంటరు, బి ఏ. సీనియర్ క్లాసు విద్యార్థులకు సెలక్షన్ పరీక్షలు పెట్టారు. అందులో కొందరిని డిటెయిన్ చేసి, మరికొందరు పబ్లిక్ పరీక్షకు హాజరవడానికి సెలకు అయినట్లు నోటీసు బోర్డులో పేర్ల జాబితాను ప్రకటించారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ అనుబంధ కళాశాలలన్నింటిలోనూ ఆ ఏడాది దాదాపు 1000 మంది వరకు విద్యార్థులు ఈ విధంగా డిటెయిన్ చేయబడ్డట్టు నాకు గుర్తు.

అప్పటికే గుంటూరులో జరిగిన రాష్ట్ర విద్యార్థి మహాసభ విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదని నిషేధించుతున్న మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సులోని 8వ నిబంధన పోవాలని, సెలక్షన్ పరీక్షలు పెట్టి విద్యార్థులను పబ్లిక్ పరీక్షలకు పంపకుండా వడపోతపోసే దారుణమైన డిటెన్షన్ విధానం పోవాలని, వీటిని విద్యార్థి లోకమంతా ప్రతిఘటించాలని పిలుపు యిచ్చింది.

ఏ.సి. కాలేజి విద్యార్థులకు కాలేజికి సంబంధించిన మరికొన్ని సమస్యలు కూడా వున్నాయి. డిటెన్షన్ విధానం పోవాలని, కాలేజికి సంబంధించిన ఇతర సమస్యల పైన సమ్మె పిలుపు యివ్వాలని కాలేజి విద్యార్థి సంఘం నిర్ణయించింది. ఆమేరకు విద్యార్థుల కోర్కెల పత్రాన్ని కాలేజి ప్రిన్సిపాలుకు అందజేయటం జరిగింది. కాలేజి అధికారులు ఆ కోర్కెలకు అంగీకరించనందున డిశంబరులో సమ్మె ప్రారంభమైంది. ఆంధ్ర రాష్ట్రంలో డిటెన్షన్ విధానం పోవాలని జరిగిన మొట్ట మొదటి చరిత్రాత్మక సమ్మె ఇది.

## కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడనయ్యాను

అప్పటికి ఏ సి. కాలేజి విద్యార్థులలో కమ్యూనిస్టు పార్టీ చురుకుగా పని చేస్తోంది. మాకినేని బసవపున్నయ్య, నాళం నరసింహారావు, డి. వి అప్పారావు మొదలగువారు అంతకుముందే పార్టీ సభ్యులు. నేను మరికొందరు ఏ. సి. కాలేజి విద్యార్థులు 1937 లోనే కమ్యూనిస్టు పార్టీలో చేరటం జరిగింది.

అప్పుడు కమ్యూనిస్టుపార్టీపై నిషేధం వున్నది. రహస్య పార్టీకొకి ఎవరినంటే వారిని చేర్చుకొనేవారు కాదు. ప్రతి వ్యక్తియొక్క కార్యకలాపాలు, రాజకీయ అభిప్రాయాలు వగైరా పరిశీలించిన మీదట ఇద్దరు పార్టీ ముఖ్యులు బలపర్చితేనే పార్టీ సభ్యత్వం ఇవ్వబడేది మొదట ఆక్జిలరి సెల్లులలో పెట్టి సంతృప్తి కలిగితేనే సభ్యత్వం యిచ్చేవారు. నేను, కమ్మ హాస్టలులో వుంటున్న తుమ్మల వెంకట సుబ్బయ్య, సి. యల్. నారాయణ ఒక సెల్లులో వుండేవారమని నాకు జ్ఞాపకం. మాకినేని బసవపున్నయ్య, పుచ్చలపల్లి శివయ్యగార్లు నన్ను కమ్యూనిస్టుపార్టీ సభ్యునిగా తీసుకొన్నారు.

సమ్మె జయప్రదంగా నిర్వహించడానికి కార్యాచరణ కమిటీ ఒకటి ఏర్పడింది. అందులో నేను ఒక సభ్యుడను. కాలేజీ సమ్మె 10 రోజులు జరిగింది.

కాలేజీ విద్యార్థులలో ఎక్కువమంది సమ్మెను హృదయపూర్వకంగా బలపరిచారు. అయితే అది క్రిష్టియన్ కాలేజీ కావడం, కాలేజీకి చెందిన హాస్టల్సులో వుండే క్రిష్టియన్ విద్యార్థులు ఈ సమ్మెలో చేరడం అంత తేలిక కాదు. అటువారు, సమ్మెను బలపర్చని మరికొంచరు విద్యార్థులు కాలేజీకి హాజరు కాకుండా నివారించడానికిగాను కాలేజీకి వున్న రెండు గేట్ల వద్ద సమ్మె చేస్తున్న విద్యార్థులు పికెటింగ్ చేసేవారు. కాలేజీ ప్రిన్సిపాలు, ముఖ్యంగా బర్సారుగా వున్న సైప్స్ ఈ సమ్మెను భగ్నం చేయజూచారు. ఎవరూ లోపలికి పోకుండా నివారించడానికి గేట్లకు అడ్డంగా మేము పడుకునేవాళ్ళం. ఒకరిద్దరు మమ్ములను త్రొక్కుకుంటూ వెళ్ళినా ఎక్కువమంది అలా చేసేవారు కాదు.

కమ్మ హాస్టలులో దాదాపు 110 మంది వరకు విద్యార్థులుండేవారు. కమ్మ హాస్టలు ఆ రోజులలో కమ్యూనిస్టుపార్టీ రాజకీయాలకు కేంద్రము. పార్టీ నాయకులు గుంటూరు ఎవరు వచ్చినా, కమ్మ హాస్టలులోనే వసతి సౌకర్యాలు ఏర్పాటు చేయబడేవి. అఖిల భారత సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్ 1937 డిశంబరులో ఆంధ్ర రాష్ట్ర పర్యటనకు వచ్చినపుడు, ఆయన, ఆయనతోపాటు వచ్చిన పుచ్చలపల్లి సుందరయ్యగార్లకు కమ్మ హాస్టలులోనే వసతి ఏర్పాటు చేశాం. సుందరయ్యగారితో పరిచయం నాకు అప్పుడే.

కమ్మ హాస్టలు విద్యార్థులు ఎ. సి. కాలేజీ సమ్మె సందర్భంలో ప్రముఖ పాత్ర వహించారు. ఉదయం 8-00 గంటలకే భోజనాలు ముగించుకొని, పికెటింగుకు కాలేజీ గేట్ల వద్ద తయారుగా వుండేవారు.

ఒకరోజున బర్సార్ సైప్స్ నేను, మరికొందరు విద్యార్థులు అడ్డంగా పడుకొన్న గేటునుండి లోపలికి పోవాలని తన కారును మా మీదకు నడిపాడు. సైప్స్ కారు బంపర్ దెబ్బ నాకు తగిలింది కూడా. అయినా ఎవరూ చలించలేదు. విద్యార్థి సంఘాలకు జై, సైప్స్ గోబాక్ అనే నినాదాలు మిన్నుముట్టాయి. దానితో తోక ముడిచాడు సైప్స్.

ఈ సమ్మె గుంటూరు పట్టణంలోని అన్ని వర్గాల ప్రజలలోనూ, రాష్ట్రంలోని విద్యార్థులందరిలోనూ పెద్ద సంచలనం కలిగించింది. పట్టణంలోని కొందరు కాంగ్రెసు నాయకులు, మరికొందరు ప్రముఖులు మా సమ్మెను బలపర్చారు. గుంటూరులోని హిందూ కాలేజీ, హిందూ హైస్కూలు విద్యార్థులు ఎ. సి. కాలేజీ విద్యార్థుల సమ్మెకు సానుభూతిగా సమ్మె చేశారు.

పట్టణ ప్రముఖులు కొందరు జోక్యం చేసుకొని కాలేజీ అధికారులతో రాయబారాలు జరిపారు. 10 రోజులు గడిచినా కాలేజీ విద్యార్థులలో పట్టుదల మరింత పెరిగిందేగాని, ఏమాత్రం సడలలేదు. కాలేజీ అధికారుల పాచికలు పారలేదు.

పట్టణ ప్రజానీకమంతా సానుభూతి చూపుతున్నారు. ఇక లాభంలేదని అధి కారులు దిగివచ్చి, విద్యార్థుల కోర్కెలన్నీ ఆమోదించారు. అంతకుముందు డిబెయిన్ చేసిన విద్యార్థులను కూడ పబ్లిక్ పరీక్షలకు పంపడానికి అంగీకరించారు. ఆ విధంగా ఎ.సి. కాలేజీ సమ్మె దిగ్విజయంగా ముగిసింది. ఈ సమ్మె రాష్ట్రం లోని విద్యార్థులందరినీ ఎంతో ఉత్సాహపరిచింది. ముందుకు ఉరికించింది డిటెన్షన్ విధానాన్ని వ్యతిరేకిస్తూ ఆ వెనువెంటనే కొన్ని కాలేజీలు, హైస్కూళ్ళలో విద్యా ర్థుల సమ్మెలు జరిగాయి. ఆ విధంగా గుంటూరు ఎ సి కాలేజీ విద్యార్థుల సమ్మె రాష్ట్ర విద్యార్థి ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్ళడానికి ఎంతగానో తోడ్పడింది. నిజంగా విద్యార్థి ఉద్యమంలో ఇది ఒక చరిత్రాత్మక సంఘటన అని చెప్పాలి

1936 డిసెంబరు–1937 జనవరి ప్రాంతాలలో ఎ. సి. కాలేజీకి ఎదురుగా వున్న టౌన్‌హాలులో నవ్యాంధ్ర సాహిత్య పరిషత్ సభలు జరిగాయి. మా తెలుగు ఉపాధ్యాయులు కీ శే. తెలికిచర్ల వెంకటరత్నంగారు ఈ సభా నిర్వాహకులు. రెండు రోజుల సభలకూ నేను పూర్తిగా హాజరైనాను.

వ్యావహారిక భాషా ప్రవర్తక కీ॥ శే॥ గిడుగు రామ్మూర్తిగారు, భాషకు, రాజకీయోద్యమాలకు గల సంబంధించి చేసిన మహోపన్యాసంగా నామీద ఎంతో ప్రభావం కలుగజేసింది. ఆయన ఇలా అన్నారు :

"పూర్వం మన దేశంలో ప్రజలను విజ్ఞానవంతులను చేయాలనే దృష్టి లేదు. ఆనాడు రాచరిక వ్యవస్థ ఉండేది. విద్య. బోధన కొందరికే పరిమితం. ఆ పరిస్థితులలో గ్రాంధిక భాష వృద్ధిఐంది, మన మిపుడు ప్రజాస్వామ్య యుగంలో ప్రవేశిస్తున్నాము. ప్రతి పౌరుడు దేశ భవిష్యత్తు తన భవిష్యత్తు ఆలోచించుకొని ఓటు చేయడం ఈ పద్ధతిలో మూలసూత్రం. కనుక ప్రజా భాష, ఉపన్యాస సాంప్ర దాయం అభివృద్ధి అవుతున్నాయి. కావాలి. ఇందుకు తగిన భాష వ్యావహారిక భాష.

"ప్రాచీన గ్రీకు నగర రాజ్యాలలో ఒక తరహా ప్రజాస్వామ్యం ఉండేది. కనుకనే డిమాస్థనీస్ లాంటి మహోపన్యాసకులు ఆనాడే గ్రీసులో ఉద్భవించారు. మన దేశంలో అలాంటి ప్రజాస్వామ్యం దాదాపు లేనందున, వ్యావహారిక భాష వృద్ధికాలేదు. అక్కడ కూడ పుట్టినా మధ్యలోనే అంతరించింది. భవిష్యత్తు అలా వుండబోదు, భవిష్యత్ ప్రజాస్వామ్య యుగానికి చెందనిది నా వ్యావహారిక భాషోద్యమం" అని మేఘగంభీరనాదంతో రామ్మూర్తిగారు చెప్పిన మాటలు నన్ను నాలాంటి యువకులను ఎంతో ప్రభావితం చేశాయి. రామ్మూర్తిగారి చారిత్రక దృష్టి నన్ను ఎంతో ఆకర్షించింది. ★

# ప్రజా పోరాటాలకు మార్గ నిర్దేశక సూత్రాలు

—డేవిడ్ మొరాయిస్

*సి. సి. పొలిటికల్ కమిషన్ సభ్యులు, బొలీవియా కమ్యూనిస్టుపార్టీ [సి. పి. బి.]*

బొలీవియా కమ్యూనిస్టుపార్టీ ఐదవ మహాసభ (1985 ఫిబ్రవరి) కష్టమైన క్లిష్టమైన పరిస్థితుల్లో ముఖ్యంగా దేశం ఎదుర్కొంటున్న అతి తీవ్రమయిన ఆర్థిక సంక్షోభ కాలంలో, ఆందోళనకరమయిన రాజకీయ సంక్షోభ సంకేతాలు ఏర్పడిన కాలంలో జరిగింది.

మహాసభ ఆమోదించిన రాజకీయ, నిర్మాణపరమయిన నిర్ణయాలు, అది ఆవిష్కరించిన అవకాశాలు, అది చూపించిన ఐక్యతల దృష్ట్యా బొలీవియా కమ్యూనిస్టు పార్టీ జీవనంలోను, ఈ దేశ శ్రామికవర్గ ఉద్యమ జీవనంలో ఈ మహాసభను ప్రముఖమయిన ఘట్టంగా అభివర్ణించగలం.

ప్రాంతీయ, ప్రత్యేక స్థానిక మహాసభలు మొత్తం 577 మంది ప్రతినిధులను ఎన్నుకున్నాయి. (*యునిడాడ్*, ఫిబ్రవరి 23, మార్చి 1, 1985

బొలీవియాలోని అనుబంధ, మిత్ర సంఘాలు పంపిన అభినందన సందేశాలు ప్రతినిధులలో మహోత్సాహాన్ని కలిగించాయి. ఈ మహాసభ, అన్ని సోషలిస్టు దేశాల సోదర పార్టీలతో సహా 50 కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీల నుండి వచ్చిన సందేశాలను, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాల ప్రాతిపదికపై వ్యక్తమయిన సంఘీభావానికి నిదర్శనంగా సుదీర్ఘ హర్షధ్వానాలతో ప్రతిస్పందించింది.

పదవీ విరమణ చేస్తున్న నాయకత్వం తరపున కేంద్ర కమిటీ ప్రథమ కార్యదర్శి జె. కొల్లె క్యూటో సమర్పించిన నివేదిక, ఆ తర్వాత జరిగిన చర్చ అంతర్జాతీయ పరిస్థితికి అధికతర ప్రాముఖ్యతను యిచ్చాయి. శాంతి, ప్రజా

స్వామ్యం, సామాజికాభ్యుదయం, సోషలిజాలకు పోరాడుతున్న శక్తుల విజయా లను- ఈ విజయాలు ప్రస్తుత యుగంలో ప్రత్యేకమయినవి—వక్తలు పేర్కొన్నారు. వారు, పెట్టుబడిదారీ వ్యవస్థలో వైరుధ్యాలు అత్యంత తీవ్రతరం కావడాన్ని విశ్లేషించారు. చరిత్ర పురోగమనాన్ని నిరోధించే ప్రయత్నంలో అణు మారణహోమం అంచులకు మానవజాతిని నెడుతున్న సామ్రాజ్యవాద ఉన్మత్త పథకాలను ఎండగట్టారు. యుద్ధ ప్రమాదాన్ని తొలగించడంలో సోవియట్ యూనియన్ పాత్రను, మొత్తంగా సోషలిస్టు సమాజ పాత్రను వారు నొక్కిచెప్పారు. శాంతికోసం, జాతీయ, సామాజిక విముక్తికోసం సర్వ ప్రజలు చేస్తున్న పోరాటం యొక్క ప్రాముఖ్యతను వక్కాణించారు.

శాంతిని పటిష్ఠ మొనర్చడంలోనూ, సామ్రాజ్యవాదం తెచ్చిపెటిన యుద్ధ ప్రమాదాన్ని, రోదసీ సైనికీకరణకు అదిచేసే ప్రయత్నాలను ప్రతిఘటించడం లోనూగల ప్రధాన ప్రాముఖ్యతలను గురైరిగిన ఒక పత్రాన్ని ఈ మహాసభ ఆమోదించింది. క్యూబా, నికరుగ్వా దేశాలపట్ల, ఎల్‌సాల్వడార్, గౌతమాల, చిలీ, యితర దేశాల ప్రజలపట్ల సంఘీభావాన్ని వ్యక్తంచేస్తూ మహాసభ తీర్మానా లను ఆమోదించింది. మాఖండంలోని దక్షిణ ప్రాంతంలో జరుగుతున్న ప్రజా తంత్రీకరణక్రమాన్ని ప్రత్యేకంగా గమనించారు.

విదేశీ రుణం అన్నది పాశవిక సామ్రాజ్యవాదుల దోపిడికి ఒక రూపం అని చెబుతూ అలాగే అసమానంగావున్న మార్పిడి. అంతర్జాతీయ ద్రవ్యసంస్థ (ఐ. యం. యఫ్) వత్తిడులను పేర్కొంటూ ప్రతినిధులు బహుళజాతి కంపెనీల, ఆర్థిక పెట్టుబడుదారులను సమిష్టిగా ప్రతిఘటించాల్సిన ఆవశ్యకత ఉన్నదనీ నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థను రూపొందించాల్సిన అవసరమున్నదనీ నిర్ధారించారు.

దక్షిణ అమెరికా కమ్యూనిస్టుపార్టీలు జరిపిన సమావేశాలను మహాసభ శ్లాఘించింది, ప్రపంచ స్థాయిలో ఇలాంటి సమావేశాలు జరగాలని ప్రకటించింది. తద్వారా, కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు దోహదపడాలన్న పార్టీ మనోభిప్రాయాన్ని ధృవీకరించింది.

నివేదిక, ప్రతినిధుల ప్రసంగాలు రెండూ, బి.సి.పి. నాల్గవ మహాసభనాటి నుండీ (1979) బొలీవియా అభివృద్ధికి చెందిన అంతర్గత రాజకీయ, ఆర్థిక అంశాలపై కేంద్రీకరించాయి. 1970 దశకం చివరలో బంజేర్ ప్రభుత్వ పతనంతర్వాత, ఈ నియంతృత్వాన్ని కాపాడడానికి జరిగిన ప్రయత్నాలు వైఫల్యం చెందిన తరువాత సంభవించిన ప్రజాతంత్ర మార్పులు ప్రధానంగా ప్రజా పోరాటాల ఫలితం అని ఇంతకు ముందు పార్టీచేసిన నిర్ధారణలను అవి ధృవీకరించాయి. సామాజిక

పునరుత్పత్తి వ్యవస్థ అంతటావున్న ఆర్థిక మాంద్యం, సంక్షోభాలు ఫాసిస్టు చట్రా లను మరింతగా విచ్ఛిన్నం చేశాయి. తత్పర్యవసానంగా వ్యతిరేక పరిణామం మరింతగా కొట్టవచ్చినట్టు కనపడింది. ద్రవ్యోల్బణం శరవేగంతో సాగింది. ప్రజల జీవన, పనిపరిస్థితులు విషమించాయి. దీనివల్ల తీవ్రమైన సామాజిక, రాజ కీయ ప్రభావం కలిగింది.

ఈ సంవత్సరాల్లో సంభవించిన రాజకీయక్రమాలు డెమోక్రటిక్ పాపులర్ యూనిటీ (డి.పి.యు.) సంఘటన (అక్టోబరు 1982 - నవంబరు 1984) పాలన రూపంగా పరాకాష్ఠకు చేరాయి.

బంజేర్ నియంతృత్వ ప్రతిఘటన క్రమంలో ఈ సంఘటన ఏర్పాటు చేయ పడింది. ఇందులో వామపక్ష నేషనలిస్టు రెవెల్యూషనరీ మూవ్‌మెంటు, కమ్యూనిస్టు పార్టీ, వామపక్ష రెవెల్యూషనరీ మూవ్‌మెంటు అలాగే కార్మికవర్గ, రైతాంగ, మధ్యతరగతి, బూర్జువాజీలోని ప్రజాతంత్ర విభాగాల ప్రయోజనాలను కాపాడాలను కొనే కొన్ని యితరపార్టీలు, గ్రూపులు వున్నాయి దాని యొక్క ప్రజానుకూల, ప్రజాతంత్ర, సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథం దాని కార్యక్రమంలో ప్రతిబిం బించింది. దేశంయొక్క వెనుకబాటు తనానికీ, పరాధీనతకు అమెరికా సామ్రాజ్య వాదం, స్వదేశంలోని భూస్వాములు కారణం అని ఇది విమర్శించింది. ప్రజలు తమ సార్వభౌమాధికారాన్ని పూర్తిగా వినియోగించేందుకు హామీ కల్పించేటటు వంటి, బొలీవియా జాతీయ విమోచనను, స్వతంత్ర ఆర్థిక అభివృద్ధిని, నిజమైన సామాజిక న్యాయాన్ని సాధించేందుకు వీలు కల్పించే రాజ్యాంగబద్ధమైన ప్రభు త్వాన్ని ఏర్పాటు చేయాలని ఈ కార్యక్రమం పిలుపు ఇచ్చింది.

డి.పి.యు. సంఘటన మూడు ఎన్నికల్లో గెలిచింది. అయితే అభివృద్ధి నిరో ధకులు, ఈ ప్రజాతంత్ర క్రమాన్ని వమ్ముచేయడానికి ప్రయత్నించారు ఇందుకై జరిగిన ప్రయత్నాలలో ఒకటి సైనిక ఫాసిస్టు తిరుగుబాటు. 1980 ఎన్నికల తరు వాత మత్తుమందుల దొంగరవాణాదారులతో కలిసిన గార్షియా మెజా నాయకత్వాన ఈ తిరుగుబాటు జరిగింది. సామ్రాజ్య వాదానికి జోహుకుందారుగా వుండి స్వదేశీ భూస్వాములమీద ఆధారపడేటటువంటి ప్రభుత్వాన్ని రుద్దారు. శ్రామిక ప్రజలపైన వారి ప్రజాతంత్ర, విప్లవ రాజకీయ సంస్థలు, ట్రేడ్ యూనియన్‌లు, రైతు, విద్యార్థి, మానవహక్కుల అసోసియేషన్లపైన జరిపిన దౌర్జన్యకాండ ప్రజా బాహుళ్యం యొక్క, డి పి యు.; యితర ప్రజా అనుకూలశక్తుల ఫాసిస్టు వ్యతిరేక ప్రతిఘటనను అణచలేకపోయింది, అంతర్జాతీయ ప్రగతిశక్తుల సంఘీభావ ఉద్యమం తోడ్పాటువున్న ఈ పోరాటం నియంతృత్వాన్ని ఏకాకిని చేయడానికి గార్షియామెజా ఆయన వారసులను ఓడించడానికి ఎంతగానో సహాయపడింది.

దీని ఫలితంగా డి.పి.యు కు అవకాశాలు గణనీయంగా పెరిగాయి. ప్రభుత్వ కార్యక్రమాన్ని రూపొందించడానికీ, దానిని అమలు పరచడానికి డి. పి. యు. కు అవకాశం కలిగింది. ప్రజా వ్యతిరేక పాలనకు ప్రత్యామ్నాయాన్ని అందజేయగలి గిన స్థితిలోనికి వచ్చింది.

డి.పి.యు. అధికారానికి రావడం అనివార్యం అనీ, దానిని నిరోధించడం సాధ్యం కాదని భీతిచెందిన ప్రయివేటు పారిశ్రామిక సంస్థలకు చెందిన భూస్వామ్య పక్షం. మితవాదపార్టీలు "ప్రజాతంత్ర సంస్థల ఏర్పాటుఅన్న పథకాన్ని ముందుం చాయి. తరువాత ఈ పథకాన్ని లెఫ్ట్ రెవెల్యూషనరీ మూవ్‌మెంట్ బలపరిచింది. 1980 ఎన్నికల ఫలితాలను గుర్తించాలని. వాటి ప్రాతిపదికమీద పార్లమెంటు సమావేశాన్ని ఏర్పాటు చేయాలనీ. ముగ్గురు అభ్యర్థులతో అత్యధిక సంఖ్యలో ఓట్లు వచ్చిన ఒక అభ్యర్థికి రిపబ్లిక్ అధ్యక్షపదవికి ఎన్నుకోవాలని ఈ పథకం పిలుపు యిచ్చింది.

కమ్యూనిస్టుపార్టీ ఈ పథకాన్ని తిరస్కరించింది. పార్లమెంటులో అభివృద్ధి నిరోధకుల ప్రాతినిధ్యం 1982 సంవత్సరంలోని రాజకీయ వాస్తవాలకు ఏ మాత్రం ప్రతిబింబంకాదనీ అది అభిప్రాయపడింది. కొత్తగా ఎన్నికలు జరిపించాలని ప్రతిపా దించింది. కమ్యూనిస్టుపార్టీ వైఖరిని లెఫ్ట్‌నేషనలిస్టు రెవెల్యూషనరీమూవ్‌మెంట్ బలపరిచింది.

అయితే ఆర్థిక సంక్షోభం మరింత విషమించింది. డి. పి. యు సంఘటన భవిష్యత్తు పాలనమీద ప్రజలు న్యాయబద్ధంగా ఆశలు పెట్టుకొన్నందువల్ల, దానికి తోడు సాధ్యమైనంత త్వరలో ఫాసిజాన్ని, మితవాద ఆధిపత్యాన్ని అంతం చేయా లన్న వాంఛ వారికి వుండడ మూలాని సంఘటన నాయకత్వం పునరాలోచించింది. పైగా సంస్థాగతమైన పరిష్కారాన్ని నైపుణ్యంతో ఉపయోగించుకోవాలని వీరు అభిప్రాయపడ్డారు. అందువల్ల పార్లమెంటును తక్షణం పిలువడానికి అంగీకరించా ల్సిన పరిస్థితి ఏర్పడింది. పార్లమెంటును పిలిచారు. డి.పి.యు. అభ్యర్థి హెర్నాన్ సైలెస్ జువాజో దేశాధినేతగా ఎన్నికయ్యాడు.

మా పార్టీ అభిప్రాయంలో డి.పి.యు. పాలన చారిత్రక ప్రాముఖ్యతగల వాస్తవం. అందువల్లనే దీని కార్యకలాపాల ఫలితాలపట్ల నివేదికతోనూ, ప్రసంగాల లోనూ ప్రత్యేక శ్రద్ధ కనపరచబడింది. ఈ విశ్లేషణలో మరో ముఖ్యమైన అంశం కూడా గమనించబడింది. అదేమంటే, డి.పి.యు. సంఘటన విజయాలు గుర్తించ డంతోపాటు మేము వున్న యిబ్బందులు, పరిష్కరించబడని సమస్యలు, వాటి కారణాలపై కేంద్రీకరించాము.

మంత్రివర్గం ఏర్పాటు సమయానికి, అంతకు పూర్వంవున్న ప్రభుత్వాల నుండి సంక్రమించిన ఆర్థిక సంక్షోభం మరింతగా విషమించిందని నివేదిక పేర్కొన్నది. నివేదిక యింకా ఇలా తెలియజేసింది. ఉత్పత్తి రంగంలో పెట్టుబడులు పెట్టేందుకు ప్రైవేటురంగం తిరస్కరించింది పెద్ద ఎత్తున పెట్టుబడులు తరలిపోయాయి. అక్రమవ్యాపారం మునుపెన్నడూ లేనటువంటి ప్రమాణాలకు చేరుకున్నది. చట్టా వ్యాపారం శృతిమించిపోయింది. ప్రభుత్వ యంత్రాంగం పూర్తిగా స్తంభించిపోయింది.

డి పి యు. కార్యక్రమం అమలు పరచడం ప్రారంభం కావడంతో వివిధ శక్తుల పునఃపొందిక ప్రారంభమైంది; వివిధ వర్గాలు, పార్టీలు, ప్రజాసంస్థలు వివిధ అభిప్రాయాలను లేదా పరస్పర వైరుధ్యంగల అభిప్రాయాలను వ్యక్తీకరించడం ప్రారంభించా : సైద్దాంతిక పోరాటం ఉధృతమైంది. ప్రభుత్వ ఆర్థిక విధాన పరిమితులు జాప్యపు స్వభావం బయటపడ్డాయి. సంక్షోభం కారణంగా యిబ్బందుల పాలవుతున్న ప్రజలు తమ డిమాండ్లను చేయడం కొనసాగించారు.

సత్వర పరిష్కారం ఆవశ్యకమన్న అంశాన్ని అంగీకరిస్తూనే ప్రభుత్వ పదేపదే దానిని వాయిదా వేసింది. సంక్షోభాన్ని అంతం చేయడానికీ, ఉత్పత్తిని మెరుగుపరచడానికి వీలుగా ఆర్థిక, ద్రవ్యపరమైన చర్యలు తీసుకొనడానికి సంబంధించి స్పష్టమైన పథకం లేకపోయిందని నివేదిక పేర్కొన్నది.

తీసుకోబడిన చర్యలు పూర్తిగా సాంప్రదాయకమైనవి (ఏవో కొన్నిమినహా) డి.పి.యు కార్యక్రమ మార్గనిర్దేశక సూత్రాలకు ఏమాత్రం సంబంధించినవికావు ; దీనివల్ల "పెసో" విలువ మరింత పడిపోయింది. కొనుగోలుశక్తి, జీవన ప్రమాణాలు మరింతగా పడిపోయాయి. భూస్వామ్యపక్షాల లాభాలు మరింతగా పెరగడానికి ఇవి ఉపయోగపడినాయి. ఇది మొదటగా చూసేవారికి కొంత విచిత్రంగానే వుంది.

కమ్యూనిస్టుపార్టీ సూచించిన కొన్ని చర్యలు ఆమోదించబడినప్పటికీ పన్నులు, ఆర్థిక, విదేశీమారక చర్యలకు సంబంధించి ప్రభుత్వ యంత్రాంగం ప్రదర్శించిన అసమర్థతవల్ల మొత్తంగా వేతన విధానంపై ప్రతికూలమైన ప్రభావం కలుగచేశాయి. ప్రధాన ఆర్థిక సాధనాలను అజమాయిషీచేసే, ఈ సంక్షోభాన్ని తగ్గించి, అధిగమించే, ఉత్పత్తిని అధికంచేసే, ఆర్థికాభివృద్ధి నూతన పద్ధతికి పరిస్థితులను సృష్టించే లక్ష్యంగల తన విధానాన్ని ప్రభుత్వం నిజంగా అమలుపరచలేదు. దానిని అమలుపరచే అవకాశాలు, ఆయా శక్తుల విభజనలోవున్న వైరుధ్యాలు అననుకూల మార్పుల కారణంగా, క్రమేణా తగ్గిపోయాయి.

ఈ ఆర్థిక సంక్షోభం రాజకీయ సంక్షోభంతో అతి సన్నిహితంగా ముడిబడి వుంది. పైపెచ్చు, ప్రజాతంత్ర, ప్రజానురంజక, సామ్రాజ్యవాద వ్యతిరేక కార్యక్రమాన్ని అమలుపరచడానికి వీలుగా ప్రభుత్వాన్ని సంస్కరించాల్సిన ఆవశ్యకత

వున్నది. ఇది అమలుపరచబడక పోయినందున పరాధీన పెట్టుబడిదారీ విధానం యొక్క కాలంచెల్లిన పరిపాలనా యంత్రాంగాలు ప్రభుత్వ ప్రయత్నాలను దెబ్బ తీసే మరో అంశంగా తయారయినాయి.

డి. పి. యు. కార్యక్రమం అమలుకై మహత్తరంగా ఉధృతం చేయ బడిన పోరాటం నేపథ్యంలో, ప్రభుత్వం ఆమోదించిన ఆర్థికచర్యల స్వభావాన్ని గమనంలో వుంచుకొని 1984 అక్టోబరులో కమ్యూనిస్టుపార్టీ మౌలికమైన సమగ్ర నూతన ప్రతిపాదనలను రూపొందించింది. ఈ ప్రతిపాదనల అమలుకు కార్మిక వర్గం, ట్రేడ్‌యూనియన్ ఉద్యమ భాగస్వామ్యం వుండాలని తెలిపింది. ఈ ప్రతి పాదనలు జీవన ప్రమాణాలు యింకేమాత్రం పడిపోకుండా నిరోధించడానికి ఉద్దేశించినవి. విదేశీ వాణిజ్యాన్ని, ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించాలనీ, వినిమయ వస్తువుల పంపిణీలో సమర్థవంతమైన ప్రభుత్వ భాగస్వామ్యం వుండా లనీ, కొన్ని పారిశ్రామిక సంస్థలను జాతీయం చేయాలని యివి పిలుపుయిచ్చాయి. ప్రభుత్వరంగానికి వున్న ఆయా డిపార్టుమెంటులకు సంబంధించిన అవరోధాలను అధిగమించడానికి యీ రంగం యొక్క యాజమాన్యాన్ని మెరుగుపరచేందుకు ఒక కేంద్ర సంస్థను ఏర్పాటుచేయాలని పార్టీ పిలుపుయిచ్చింది.

అయితే మా చొరవలకు ఆమోదం లభించలేదు. ఎందుచేతనంటే మా సంఘటన భాగస్వాములలో వైరుధ్యాలుండడం; అలాగే వాటిని తీవ్రవాదులు, ట్రేడ్‌యూనియన్ నాయకత్వంలోని ఒంటెత్తువాదపక్షం ప్రతిఘటించారు. అందు వల్ల కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గ, యితర ప్రజల ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని తన యిద్దరు మంత్రులను మంత్రివర్గంనుండి ఉపసంహరించుకోవాలని నిర్ణయించింది. "సంక్షోభం తీవ్రతరం. అయింది. వివిధ పక్షాలనుండి ప్రభుత్వ పథకాలకు అవరోధం ఏర్పడింది. మితవాదులు, సామ్రాజ్యవాదం ఉధృతంచేసిన నేరస్థపూర్వక దాడి కారణంగా రాజకీయ, ఆర్థిక సమస్యల పరిష్కారంలో చాలా కాలం గడిచిపోయింది. అందువల్ల ప్రస్తుతంవున్న కృత్రిమంగా కుదించివేయ బడిన రాజ్యాంగపరమైన వ్యవధిలో వివిధ పథకాలను ప్రస్తుత ప్రభుత్వం అమలు పరచలేక పోయింది: అలా చేయడం అసాధ్యమైంది" అని పార్టీ తెలిపింది.

(యునిడాడ్, నవంబరు 24—30, 1984)

పార్టీ మహాసభ ప్రజాతంత్ర క్రమాన్ని స్థూలంగా అంచనావేస్తూ యిబ్బందులను, లోటుపాట్లను మాత్రమే గాకుండా, సానుకూల పరిణామాలను పేర్కొన్నది. ఇందులో అత్యంత ముఖ్యమైనవి, మత్తుమందుల దొంగ రవాణా దారుల ఫాసిస్టు నియంతృత్వం ఓటమి, డి. పి. యు సంఘటన ఏర్పాటు, పురోగమనం, ఆ సంఘటన రూపొందించిన కార్యక్రమం, ఫాసిస్టులు, మితవాదుల మీద ఎన్నికల విజయాలు, కార్మికవర్గ పార్టీగావున్న సి. పి. బి.తో కూడుకొన్న ప్రభుత్వ ఏర్పాటు.

తగు ప్రమాణంలో ఆర్థిక సంక్షోభాన్ని తగ్గించడంలో ఆర్థిక చర్యలు వైఫల్యం చెందాయి. ప్రజల వాంఛలు, కోర్కెలు తీర్చబడలేదు. అలాగే ఐ యం ఎఫ్. కూడ తన "పరిష్కార మార్గాలను" విధించడంలో కృతకృత్యం కాలేకపోయింది. వాస్తవంగా తీవ్రమైన, కష్టతరమైన పోరాటం జరిగిన తరువాత కార్మికవర్గ ఉద్యమ డిమాండ్లను ప్రతిబింబించే మా పార్టీ ప్రతిపాదనలు కొన్నింటిని ప్రభుత్వం ఆమోదించింది. అంతర్జాతీయ ప్రయివేటు బాంకుల రుణాల చెల్లింపును వాయిదా వేసింది. ముడిపదార్థాలు, ఆహారవస్తువులు, మందులు దిగుమతి చేసుకొనడానికి ప్రభుత్వరంగానికీ, ప్రభుత్వానికీ అనుమతి యిచ్చింది. కొనుగోలుశక్తిని కొనసాగించేందుకు వేతన స్కేళ్ళను ప్రవేశపెట్టింది.

ఇక్కడ గమనించదగిన ప్రత్యేక నిర్ణయం ఏమంటే, అతి పెద్ద ప్రభుత్వ గనుల కంపెనీ అయిన "కొమిబాల్" యాజమాన్యంలో కార్మికుల భాగస్వామ్యం. ఈ నిర్ణయం చారిత్రక ప్రాధాన్యతకలది. ఎందుకంటే యిది ఉత్పత్తి యాజమాన్యంలో కార్మికుల భాగస్వామ్యాన్ని చట్టబద్ధంచేసింది. పైగా ఆర్థిక, రాజకీయ, సామాజికాభివృద్ధి అవకాశాలకు సంబంధించి యీ నిర్ణయం ముఖ్యమైనది. ప్రజలను పెద్ద ఎత్తున ఆరోగ్య సంరక్షణా చర్యల్లో భాగస్వాములను చేశారు. విదేశాంగ విధానంలో పురోగతి సాధించబడింది. అన్నింటికంటే ముఖ్యమైన విషయం యేమంటే ప్రభుత్వం పౌరహక్కులను, స్వేచ్ఛలను గౌరవించింది.

మహాసభ దేశ సామాజిక - ఆర్థిక జీవనంలోని విభిన్న అంశాలపై గణనీయమైన పలుకుబడిని కలుగచేసే కార్మికవర్గం, ట్రేడ్ యూనియన్ ఉద్యమంపట్ల ప్రత్యేకమైన శ్రద్ధాసక్తులను కనపరచింది. ఎందుకంటే, ప్రధానంగా యీ ట్రేడ్ యూనియన్ల ద్వారానే శ్రామిక ప్రజలు తమ పోరాటాలను కొనసాగిసారు. బంజేర్ పాలనకు వ్యతిరేకంగా, అన్నింటికిమించి ట్రేడ్ యూనియన్ ఫ్రంట్ ఏర్పాటు, వివిధ శాఖల, నాయకత్వ సంస్థల రూపకల్పన, కార్మికుల కోర్కెల సంరక్షణలకై జరిగిన కార్యాచరణలో కమ్యూనిస్టులు కీలకపాత్రను నిర్వహించారు.

కార్మికవర్గం గార్షియా మెజా నాయకత్వానవున్న నియంతృత్వాన్ని తీవ్రంగా ప్రతిఘటించింది. చట్టవ్యతిరేక వ్యవస్థలను సంరక్షించడం, చటబద్ధ ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని పునరుద్ధరించడంతోసహా సంక్లిష్టమైన సమస్యల పరిష్కారానికి మా పార్టీ సభ్యులు అమూల్యమైన దోహదంచేశారు. డి. పి. యు. పాలనక్రింద యీ ఉద్యమ పాత్రను పరిశీలించారు, ఇలా పరిశీలన చేసేటప్పుడు నియంతృత్వానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటంలోని అనుభవాన్ని గమనంలో వుంచుకొన్నారు. ఈ పోరాటం జాతీయ, సామాజిక విముక్తి పతాకంక్రింద కొనసాగింపబడిన పోరాటం. అలాగే వాస్తవంగా డి. పి. యు. సంఘటన ధోరణితో కలిసిపోయినటువంటిది. అయితే రాజకీయ, ఆర్థిక, సామాజిక నిర్ణయాలు రూపొం

దించడంలో అలాగే కార్యక్రమాన్ని అమలు పరచడంలో సుసంఘటితమైన పద్ధతిలో పాల్గొనడానికి 1982 అక్టోబరు తరువాత ప్రజాబాహుళ్యానికి కలిగిన అవకాశాలు ఉపయోగించబడలేక పోయాయి. (స్వల్పంగా మినహా)

పార్టీ రూపొందించిన ప్రజాబాహుళ్యం ప్రజాతంత్ర భావన "అటు క్రింది స్థాయి యిటు ప్రభుత్వం రెండింటినుండీ" అన్న నినాదాలను ప్రజాసంక్షేమాన్ని కోరే శక్తులు పూర్తిగా తీసుకోలేదని పై విషయం, అలాగే కొన్ని యితర సమస్యలపై ట్రేడ్‌యూనియన్ ఉద్యమం తీసుకొన్న వైఖరి తెలియచేస్తున్నాయి.

ఈ పరిస్థితులకు కారణం మొదటగా మన పొరపాట్లు, మంత్రివర్గంలో వైరుధ్యాలు, తీవ్రమవుతున్న ఆర్థిక సంక్షోభ ప్రభావం - ట్రేడ్‌యూనియన్లలో కొంత పలుకుబడికలిగిన అనార్కో—సిండకలిస్టు పక్షాలు కూడా కొంత బాధ్యతను వహించాల్సి వుంటుంది ఇవి ట్రేడ్‌యూనియన్లు స్వతంత్రమైనవన్న తప్పుడు వాదనలతొ రాజకీయ కార్యకలాపాలల్లో కార్మికవర్గ యితర శ్రామిక ప్రజల భాగస్వామ్యాన్ని వ్యతిరేకించాయి. కమ్యూనిస్టు వ్యతిరేక ప్రాతిపదికపై ట్రాటస్కైట్లు, తీవ్రవాద పక్షాలతో సమైక్యమై, ఒంటెత్తువాద, దుస్సాహసికవాద పంథాను అనుసరించడంద్వారా ప్రజాతంత్ర క్రమాన్ని వమ్ముచేయాలని చూశారు; కార్మికవర్గ నిర్మాణాన్ని, సమైక్యతను దెబ్బతీయాలని చూశారు.

ట్రేడ్ యూనియన్లలో మా పార్టీకి గట్టి బలమున్నదనీ, అవి దాని అభిప్రాయాన్ని శ్రద్ధగా వింటాయని పార్టీ మహాసభలో తెలియచేయబడింది. ప్రభుత్వంలో భాగస్వామ్యం వహించడంపై కొన్ని యిబ్బందులు ఏర్పడినప్పటికీ సి పి బి. ఏ ఒక్క యితర పార్టీకంటే ఎక్కువగా కార్మికులలో ప్రతిష్ట వున్న ఒక రాజకీయ శక్తి. దానియొక్క సరియైన వ్యూహం, యితర ట్రేడ్ యూనియన్‌లకు సంబంధించి మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను పాటిస్తున్న దాని కార్యకర్తల ప్రయత్నాల కారణంగా యీ ప్రతిష్ట కలిగింది.

స్థూలమైన రాజకీయ విశ్లేషణలో భాగంగా మహాసభ, పార్లమెంటు, సాయుధ బలగాల, చర్చి యజమానుల పాత్రను పరిశీలించింది.

డి పి.యు. పాలన క్రింద, పార్లమెంటు, అభివృద్ధి నిరోధకుల, మితవాదులకు కేంద్ర స్థానం అయిందనీ, కుట్రదారులకు గూడుగా మారిందని ప్రతినిధులు పేర్కొన్నారు. మెజారిటీ సాధించినవారు, ప్రజల, మొత్తం జాతి ప్రయోజనాలను తీర్చే ముఖ్యమైన శాసనాలను ఆమోదించకుండా అవరోధాలు కల్పించారు. పార్లమెంటు యుద్ధరంగంగా తయారైంది. ఇక్కడ కమ్యూనిస్టులు, భూస్వాముల పరాధీన వ్యవస్థపై జరిగిన పోరాటంలో నూతన అనుభవాన్ని సంపాయించారు. కమ్యూనిస్టులు ప్రజల నూతన ఆశయాలను బలపరిచారు.

సాయుధ బలగాల సమస్యను ప్రస్తావిస్తూ మహాసభ, వారిలో వున్న విభిన్న ధోరణులను గమనించింది, బంజెలిజం, సైన్యానికి అప్పగించిన "మురికి

బాధ్యత" ను వదిలించుకోవడంతోపాటు గార్షియా మేజా వారసుడు డి. పి. యు. సంఘటనకు అధికారాన్ని యిచ్చిన క్రమం యీ కాలంలోనే జరిగింది. 1982 అక్టోబరు తరువాత కొంతమంది సైనికాధికారులు, జనరల్స్ తమ పరిస్థితిని సంఘటితం చేసుకొనే అవకాశాలు ఏర్పడినాయి అయితే వారు సైన్యం నియమ నిబంధనలకు ధేయులుగా వున్నారు. కానీ వారు సైన్యం, ప్రజల ప్రయోజనాలను దృష్టిలోపెట్టుకొని నడిచారు. ఈ ధోరణి స్పష్టంగా కనపడింది. అయితే యిది వెనక్కు తిప్పడానికి వీలులేని క్రమం కాదు.

ప్రజా విముక్తికై సహకరించిన మత నాయకులలోని (చర్చి) కొందరి పట్ల పార్టీ వైఖరిని చర్చించినపుడు మహాసభ, నాల్గవ మహాసభ నిర్ధారణలను పునరుద్ఘాటించింది; కాథలిక్‌లు, యితర మత గ్రూపుల సభ్యులతో సంప్రదింపులను, సహకారాన్ని సి.పి.బి. కోరుతున్నదని అది వక్కాణించింది.

బొలీవియాలో తక్షణ సమస్య అయిన మత్తుమందుల దొంగ రవాణా, రవాణాదారుల సమస్యను మహాసభ శ్రద్ధగా పరిశీలించింది. ఈ దొంగ రవాణాదారులకు తమ స్వంత సాయుధ ముఠాలున్నాయి. వారికి ఫాసిస్టు శక్తులతో సన్నిహిత సంబంధాలున్నాయి. ఈ నేరస్థపూర్వక వ్యాపారంలో "లియాన్స్ హంతకుడు" క్లాస్‌బార్‌బీ వున్నాడు. ఇంకా యిందులో యితర యూరోపియన్, లాటిన్ అమెరికా ఫాసిస్టులు వున్నారు. ఈ అప్రతిష్ఠాకరమైన కార్యకలాపాలను నిర్మూలించడానికి తగు చర్యలను తీసుకోవాలని మా పార్టీ మళ్ళీ వత్తిడి చేసింది భూస్వామ్య ఆర్థిక గ్రూపుల ఏర్పాటుకు సంబంధించి మహాసభ, యివి పెట్టుబడి కేంద్రీకరణ, ఒకే చోట చేరడం అన్న వాటి ఫలితం అని తెలియచేసింది. బ్యాంకు ఋణాలు, ప్రభుత్వ నిధులు, విదేశీ ఋణంవల్ల ఏర్పడిన ఇబ్బందుల నుండి వచ్చిన చట్టావ్యాపారం, పెరుగుతున్న కార్మిక దోపిడీ నుండి యీ గ్రూపులు విపరీతంగా లాభాలు సంపాయిస్తున్నాయి. ఇవి బొలీవియా యజమానుల సమాఖ్య ద్వారా పనిచేస్తున్నాయి. అవి బహిరంగంగా రాజకీయాల్లో జోక్యం చేసుకొంటున్నాయి. అధికారం కోసం జరిగిన పోరాటంలో పాల్గొన్నాయి. 1982 అక్టోబరు తరువాత, కొంతమంది మంత్రివర్గ సభ్యుల తోడ్పాటుతో ఈ భూస్వాములు ప్రభుత్వ ఏజెన్సీలపై వత్తిడి తెచ్చారు. పరిస్థితిని అస్థిరీకరించడానికి ప్రయత్నించారు. లాకౌట్లు ప్రకటించారు. పారిశ్రామిక సంస్థలను మూసివేశారు, బ్యాంకింగ్, వాణిజ్య లావాదేవీలను రద్దు చేశారు. పన్నులు, వేతనాల తదితర విషయాలపై చట్టాలను, డిక్రీలను పూర్తిగా ఉల్లంఘించారు. డి. పి. యు. ప్రభుత్వ పట్టును దెబ్బతీయడానికే యివన్నీ జరిగాయి.

ఆ విధంగా కార్మికవర్గ, యితర శ్రామిక ప్రజల, ప్రగతిశీలశక్తుల పోరాటం పుంజుకొనే కొలదీ కమ్యూనిస్టుపార్టీ తన మిత్రులతో కలిసి, భూస్వాముల పాలనకు నిజమైన ప్రత్యామ్నాయంగా ప్రజానుకూల, ప్రజాతంత్ర, సామ్రాజ్యవాద

వ్యతిరేక విప్లవాన్ని అభివృద్ధి చేయడానికి ఉద్దేశించిన అధికేతర ప్రాముఖ్యత గల ఒక కార్యక్రమాన్ని రూపొందించింది. గణనీయంగా ప్రజా తోడ్పాటును పొందిన ఈ కార్యక్రమం అమలు సి పి బి.కి, దాని పంథాకు ప్రధాన విజయం.

అయినప్పటికీ, యీ కార్యక్రమంలోని ప్రధాన అంశాలు అమలుపరచబడ లేదు. సామ్రాజ్యవాదుల, భూస్వాముల కుతంత్రాలు ఎన్ని జరిగినా అన్నింటికి మించి సంఘటన వైఫల్యాలు దీనికి కారణం. అదే సమయంలో సంఘటన, ప్రభుత్వాలలో ఉత్పన్నమయిన వైరుధ్యాలు డి.పి.యు కు అన్యమైన ప్రయోజనాలు, భావనలు ఒక విషయాన్ని తెలియచేశాయి. అదేమంటే, తమ చారిత్రక నిబద్ధతలను అమలుపరచడానికి భాగస్వాములందరూ కృతనిశ్చయులై లేరన్నదే యీ అంశం.

ప్రతి సజీవ పార్టీకి ఆత్మవిమర్శ అత్యంత ఆవశ్యకమైనదన్న లెనిన్ భావన నుండి బయలుదేరి పార్టీ తన స్వంత పొరపాట్లను సమీక్షించుకొన్నది. ముఖ్యంగా పరాధీన భూస్వామ్య వర్గం, సామ్రాజ్యవాద పట్టును వమ్ముచేసేంత బలంగా మనం లేమని రుజువు అయ్యింది. డి.పి.యు.. సంఘటన, ప్రభుత్వం యొక్క సమిష్టేతర నాయకత్వం ఏర్పడడానికి మేము అనుమతించాం. అప్పుడప్పుడూ ఇతరుల నుండి ముఖ్యంగా సాంప్రదాయ ఆర్థిక చర్యలకు సంబంధించిన విషయాలపై మేము యితరుల నుండి నేర్చుకొనవలసి వచ్చింది. కమ్యూనిస్టులు, ప్రభుత్వ ఆర్థిక విషయాలను, విదేశాంగ విధానాన్ని అధ్యయనం చేసి పట్టు సాధించలేకపోయారు

మా పార్టీ అనుకొన్నటుగా మరో ప్రతికూల అంశం కూడా వున్నది. శ్రామికవర్గ, ప్రజా ఉద్యమంలో యావత్తు పార్టీ సభ్యులు పాల్గొనేటట్లు చేయలేకపోయాము. సంస్కరణవాద, పెటీ బూర్జువా భావనలకు వ్యతిరేకంగా, ఆర్థిక విధానానికి వ్యతిరేకంగా, తీవ్రవాద పదజాలాన్ని ముసుగుగా వుపయోగించుకొన్న ప్రమాదకర సంస్థలు దేశంలోకి చొచ్చుకురావడానికి వ్యతిరేకంగా జరిగిన సైద్ధాంతిక రాజకీయ పోరాటానికి మొత్తం పార్టీ సభ్యుల తోడ్పాటును గట్టిగా, నిలకడగా ఇప్పించలేకపోయాము.

కమ్యూనిస్టుపార్టీ, తాను ఆమోదించిన విధానాన్ని సమర్థవంతంగా అమలుపరపించలేకపోయింది; దాని సందేశం తన మిత్రులలో స్పష్టంగా వినిపించలేదు. కొన్ని సందర్భాలలో ప్రజా బాహుళ్యానికి చేరలేదు. అలాగే ఐక్యతతో పోరాటాన్ని అనుసంధానించేందుకు సంఘటన, ప్రభుత్వం లోపల పార్టీ అవసరమైనది చేయలేకపోయింది.

అందువల్ల చిట్టచివరకు, అనేక అంతర్గత, బాహ్య వైరుధ్యాలు, దాని అవకాశాలను పరిమితం చేసే అంశాల కారణంగా ప్రజలను సంఘటితపరచి, సమీకరించే శక్తిగా డి పి.యు. వుండలేకపోయింది. దానికి యిబ్బందులు కలిగే విధంగా ఆయా శక్తుల విభజన మారిపోయింది. కార్యక్రమం అస్తవ్యస్తం అయింది. లోపల నుండే ప్రభుత్వం కార్యక్రమానికి అవరోధాలు కల్పించిన కారణంగా బయటనుండి

కాపాడటం అన్నది అసాధ్యమైపోయింది. ఆ కారణంగా వాగ్దానం చేసిన వాటిని డి పి యు. అమలుచేయలేకపోయింది. ఇంకా విషమ పరిస్థితి ఏర్పడింది తన బలాన్ని పోగొట్టుకొనడం ప్రారంభించింది. ఈ విషయాన్ని మహాసభ తెలియ చేసింది దీనివల్ల ఏదో రకమైన భూస్వాముల, సామ్రాజ్యవాదుల దాడి జరిగే అవ కాశం వున్నది.

రాజ్యాంగానికి విరుద్ధంగా అమెరికా సామ్రాజ్యవాదం విధించిన మధ్యంతర పార్లమెంటరీ ఎన్నికలు చట్టబద్ధ ప్రభుత్వ కాలపరిమితికి అవరోధం కలిగించింది. దగా, ఆ దేశ వత్తిళ్ళు వున్న వాతావరణంలో ఈ ఎన్నికలు జరిగాయి. ఫాసిస్టులు, మితవాదులు "ఎన్నికల తిరుగుబాటు"ను కొనసాగించగలిగారు. 1985 జూలైలో పార్లమెంటు ఎన్నికలు జరిగాయి, దేశాధ్యక్ష పదవికి పోటీచేసిన అభ్యర్థులు ఎవరికీ మెజారిటీ రాలేదు ఈ సమస్యను పార్లమెంటుకు నివేదించారు. నేషనలిస్టు రివల్యూషనరీ పార్టీ నాయకుడు విక్టర్ పాజ్ ఎస్టన్ సోరోను అధ్యక్షుడుగా ప్రకటించారు. సం.") ఇలాంటి పరిస్థితులలో ఆర్థిక, రాజకీయ సంక్షోభాన్ని పరిష్కరించడానికి వీలుగా ఎన్నికల ప్రచారాన్ని ఒక వ్యూహాత్మక అంశంగా చేయాలని కమ్యూనిస్టులు భావించలేదు. ఎన్నికలు నిజమైన ఒక యుద్ధరంగం కాబట్టి, కమ్యూనిస్టుపార్టీ యితర ప్రగతిశీల శక్తులతో కలిసి ఎన్నికల్లో పోటీ చేసింది. ఈ పోరాట క్రమంలో కొత్త ఐక్యతకు పునాది వేయడానికి యిది కృషి చేసింది. భవిష్యత్తులో జరగనున్న ప్రతి పోరాటానికి కార్మికులు, యితర శ్రామిక ప్రజల మధ్య ఈ ఐక్యత ఎంతో అవసరమైంది.

పూర్వపు అనుభవాన్ని విశ్లేషిస్తూ, దేశంలోని పరాధీన పెట్టుబడిదారీ స్వభావాన్ని, వెనుకబాటుతనాన్ని అలాగే, భూస్వాముల గ్రూపుల మనుగడను పరిగణనలోనికి తీసుకొని కమ్యూనిస్టుపార్టీ ఐదవ మహాసభ సోషలిజంవైపు సాగే సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజావిప్లవానికి సంబంధించిన తన వ్యూహాన్ని పునరుద్ఘాటించింది.

తన లక్ష్యాన్ని సాధించాలన్న దృష్టితో కమ్యూనిస్టుపార్టీ యీ విప్లవాన్ని సాధించేందుకు సంబంధించిన కార్యక్రమాన్ని నిలకడగా ముందుకు తీసుకొని పోయేందుకు రాజకీయ ఐక్యత సామాజిక పునాదిని సంఘటితపరచి, విస్తరించేందుకు వీలుగా సమిష్టి కృషి చేయాలని యిదే అభిప్రాయాలు గల పార్టీలకు సంస్థలకు పిలుపు యిచ్చింది. ఇలాంటి ప్రజాతంత్ర సంఘటనలో ప్రధానంగా కార్మిక వర్గము, అలాగే రైతాంగం, మధ్యతరగతి వర్గం, చిన్న మధ్యతరగతి ఉత్పత్తిదారులు, చేతివృత్తుల వారు, బుద్ధిజీవులు, విద్యార్థులు, మతనాయకులు కూడా పంగా చెప్పాలంటే ప్రజల, దేశప్రయోజనాలకు పునరంకితంఅయ్యే అందరూ చారిత్రక బాధ్యతను స్వీకరించాలి. ఈ వర్గసంఘటనలో శ్రామికవర్గ నాయకత్వం ఆధిపత్యాలు విజయంపొందేందుకు హామీగా కార్మికవర్గం, యితర శ్రామిక ప్రజలతో తన

సంబంధాలను పటిష్టమొనర్చుకొనేందుకు కమ్యూనిస్టులు కృతనిశ్చయులై వున్నారని మహాసభ పేర్కొన్నది.

మహాసభ పార్టీ నిర్మాణ కృషిని అంచనావేస్తూ యిప్పుడు సంపాయించిన అనుభవం, యీ విజయాలను సంఘటితపరచుకొనడానిక పెద్ద పార్టీని నిర్మించుకొనడానికి సాగిపోయేందుకు వీలు కల్పిస్తుంది.

ఈ సమీక్షా కాలంలో కమ్యూనిస్టుపార్టీ శ్రామికవర్గంలో మరింతగా ప్రవేశ్యాను కొన్నది. రాసిలోనూ వాసిలోనూ పార్టీ పెరిగింది. కార్మికవర్గం, రైతాంగం, యితర ప్రజావిభాగాలకు చెందిన అనేకమంది విధేయులైన పుత్రుల, పుత్రికలను పార్టీలోనికి తీసుకొనడంద్వారా పార్టీ మరింత బలవత్తరమైంది. "మన విజయాలను అధికంగా అంచనా వేయకుండా దేశంలో ఉత్తమ నిర్మాణ దక్షతగలది మన పార్టీయేనని, రెవెల్యూషనరీలెఫ్ట్ పార్టీలలో ప్రథమపార్టీ అన్న విషయంలో తిరుగు లేదని మనం చెప్పుకో వచ్చును" (సైమన్ రెయిస్ వెరిరా).

పార్టీ కొత్తపుంతల త్రొక్కడానికి వీలుగా మహాసభ ఉత్తమ పద్ధతులను, మంచి నైపుణ్యాలను సాధించాలని పిలుపు యిచ్చింది. పార్టీ నిబంధనలను సవరించింది. కమ్యూనిస్టు యువకులకు మరింత ఎక్కువ సహాయం అందచేయాల్సిన అవసరాన్ని మహిళా కమ్యూనిస్టులలో పనిని యింకా ఎక్కువచేయాల్సిన ఆవశ్యకతలను గుర్తించింది. నేషనల్ పైనీర్స్ యూనియన్ కార్యకలాపాలకు సంబంధించిన సూత్రాలను ఆమోదించింది.

పార్టీ నూతన కార్యక్రమం చర్చనీయాంశాలలో ఒకటి. ముసాయిదాలను అసాధారణ మహాసభ చర్చించుతుంది.

మహాసభలో ప్రతినిధులు నూతన నాయకత్వ సంస్థలను ఎన్నుకున్నారు. కేంద్ర కమిటీకి తనను ఎన్నుకోవద్దన్న కొల్లేకాటో విజ్ఞప్తిని ఆమోదించారు. నూతన నాయకత్వంలో పాతతరానికి చెందిన అనుభవశాలులైన కమ్యూనిస్టులతో పాటు యువకులున్నారు. కాకలుతీరిన కార్మిక నాయకుడు, ప్రజానాయకుడు, ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు సైమన్ రెవెస్‌వివేరా 'కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు

కమ్యూనిస్టుపార్టీ ఐదవ మహాసభ చరిత్రాత్మకమైనదనీ, విజయవంతమైనదనీ శ్రామికవర్గ నాయకత్వ కర్తవ్యాలను ప్రతిబింబించిందనీ, పార్టీకున్న వాస్తవమైన శక్తియుక్తులను గమనించారనీ కేంద్రకమిటీ ప్రథమ కార్యదర్శి వర్ణించారు తమ నూతన వ్యూహాన్ని అనువర్తింపచేసి, సన్నిహిత సమైక్యతను సాధించే పార్టీని పురోగమింపచేసే కొత్తబలాన్ని మహాసభ బొలీవియా కమ్యూనిస్టులకు యిచ్చింది. శ్రామికవర్గ పోరాట అవసరాలకు అనుగుణంగా ప్రస్తుత కర్తవ్యాలను పూర్తిచేసేందుకు ప్రజాతంత్ర, ప్రగతిశీల, భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తుల కార్యక్రమాన్ని తిరిగి మలచేందుకు అవసరమైన రాజకీయ, నిర్మాణపరమైన ఆదేశసూత్రాలను మహాసభ రూపొందించింది. ★★

*COMMUNISM* (Telugu Monthly). *Regd. No. H / V 3 / 78*

## కమ్యూనిస్టుపార్టీ 60 వ వార్షికోత్సవ సందర్భంగా వెలువడిన గ్రంథాలు

★ కమ్యూనిస్టు అమరవీరుల గాథలు

★ సి.పి.ఐ [యం] వక్రీకరణలకు,
విమర్శలకు సి.పి.ఐ. జవాబు

★ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం—
కమ్యూనిస్టుపార్టీ వైఖరి

ప్రతులకు :



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన్ భవన్, 4-1-435, బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001

**విశాలాంధ్ర బుక్ హౌస్**

విజయవాడ, హైదరాబాద్, విశాఖపట్టణం, గుంటూరు,
తిరుపతి, అనంతపురం, హన్మకొండ

Edited and Published by E. Nageswara Rao for the A.P. Council of C.P.I.
Himayat Nagar, Hyderabad.
Printed by him at Swatantra Art Printers, Vijayawada-4

